NEXT CHANGE

NAVRANG—MINERVA




Produced & Directed By KUNDAN KUMAR

Music CHITRAGUPTA Lyrics MAJROOH

Distributors —RASHID MEHTA& Co, Secunderabad




డిసెంబరు సంచికకి వడ్డాది పాపయ్య గారి ముఖచిత్రం ఎక్స్‌లెంట్‌గా వుంది.

శ్రీమతి యద్దనపూడి సులోచనారాణిగారి 'మీనా' సీరియల్ ఇంటరెస్టింగ్‌గా నడుస్తుంది. కథలు చక్కగా వున్నాయి జనవరి సంచికనుండి 1-50 చేసినా వెలకు మించిన విలువలో వెలువరిస్తారని ఆశిస్తాను.

—చెన్నూరి కల్పన, మిర్యాలగూడ.

"యువ" దీపావళిసంచిక సర్వాంగ సుందరంగా వెలువరింపజేసిన మీకు ధన్యవాదములు. శ్రీ జి వి. జి. గారి కథ ఆ సంచికకు మరింత శోభను కూర్చింది. రచయితకూ, మీకూ అభినందనలు.

—కిరణ్ కుమార్.

దీపావళి యువలోని చిత్రాకారుడు వడ్డాది పాపయ్యగారి చిత్రాలు మాకెంతో నచ్చినవి. ముఖ్యంగా చెప్పుకో తగ్గది, మరీ, మరీ చూడాలని పించింది

"తారకు అలుక, కలువకు పులక"

వడ్డాది పాపయ్యగార్కి మా అభివందనాలు,

కథలుకూడా బావున్నయ్,

ముఖ్యంగా 'నీడల కథ.'

—టి. బేబిసరోజ, తుమ్మలపాలెం.

మీ రూపాయి ఒక మంచికార్యమునకు సహాయ పడనివ్వండి.
అది మీకు అదృష్టాన్నికూడా సంపాదించిపెట్టవచ్చు!

# ఆంధ్రప్రదేశ్ వెల్ఫేర్ ఫండ్

# 14-వ రాఫిల్ సమర్పించు

ఒక మొదటి బహుమతి రు. 2,50,000
(విడుదలయ్యే అన్ని సీరీస్‌కు చెందినది)

* ఒక రెండవ బహుమతి రు. 25,000 ప్రతి సీరీస్‌లోను
* ఒక మూడవ బహుమతి రు. 5,000 ప్రతి సీరీస్‌లోను
* 40 నాల్గవ బహుమతులు ఒక్కొక్కటి రు. 500 ప్రతి సీరీస్‌లోను
* 500 ఐదవ బహుమతులు ఒక్కొక్కటి రు. 100 ప్రతి సీరిస్‌లోను

టిక్కెటు ఒకింటికి ఒక్క రూపాయమాత్రమే
నేడే మీ టిక్కెట్టు కొనండి

మొదటి బహుమతి గెల్చిన టిక్కెట్టు అమ్మినవారికి 15-వ రాఫిల్ తాలూకు 25,000 టిక్కెట్లు బోనస్‌గా ఇవ్వబడును.

100 టిక్కెట్ల ధర రు. 75 మాత్రమే, టిక్కెట్ల విలువముందే చెల్లించవలెను.

అమ్మకపు దార్లకు బహుమతులు

అత్యధిక సంఖ్యలో టిక్కెట్లు అమ్మినవారికి ఈదిగువ బహుమతులు ఇవ్వబడును:

| | |
|---|---|
| మొదటి బహుమతి.... ...2,000 | 15-వ రాఫిల్ టిక్కెట్లు |
| రెండవ బహుమతి.........1,500 | 15-వ రాఫిల్ టిక్కెట్లు |
| మూడవ బహుమతి........ 500 | 15-వ రాఫిల్ టిక్కెట్లు |

## డ్రా తేది: 15-2-1971

ఏజంట్లు టిక్కెట్ల వెల ముందుగా చెల్లించి, దిగువ అడ్రెస్సునుండి టిక్కెట్లు పొందవచ్చును.

గౌరవ కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ వెల్ఫేర్ ఫండ్
హైదరాబాదు—1

తంతి : "WELFARE" థాకుర్ వి. హరిప్రసాద్
ఫోన్ : 56004. గౌరవ కార్యదర్శి.

అభ్యుదయము, పురోగమనము—ఏ. పి. వెల్ఫేర్ ఫండ్ లక్ష్యములు

# చందమామ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 23 | జనవరి—1971 | సంచిక 1


**1970** వ సంవత్సరం వెళ్ళిపోయింది. 1971 ఆరంభమైంది. ఒక సంవత్సరం తరువాత మరొకటి జరిగిపోతూనే వుంటుంది. ఆద్యంతాలు తెలియని కాలగతిలో ఒక సంవత్సరమేమిటి, వెయ్యి సంవత్సరాలు కూడా పరిగణనకు రావు. కాని, మానవజీవితంలో ఒకొక్క సంవత్సరం గొప్ప మార్పులు తెచ్చి పెడుతుంది. ఆ మార్పుల ఫలితంగా, మానవజాతి నాగరికతలో ఒక పెద్ద అడుగు ముందుకు వెయ్యడమో, చాలా ముందుకు పోతున్నాననుకొని, మరింత వెనక్కు పోయే సంఘటనలలో చిక్కుకోవడమో జరుగుతూ వుంటుంది. ఇలాటి పరిస్థితులవల్ల ఎన్నో జాతులు ముందుకు వచ్చాయి. ఇంకెన్నో జాతులు రూపుమాసి పోయాయి.

వ్యక్తి జీవితంలో మాత్రం ప్రతి ఒక్క సంవత్సరమూ చాలా ముఖ్యమైనదే లెక్కకు ఒక సంవత్సరమే కావచ్చును గాని, వ్యక్తి జీవితంలో గడచి పోయి ప్రతి సంవత్సరమూ కూడా చాలా ముఖ్యమైన కాలమే. పట్టుమని నూరేండ్లుకూ బ్రతుకలేని మనుష్యుని జీవితంలో, డెబ్బయి యెనభయ్యేళ్ళు బ్రతికినా చివరివరక దార్ఢ్యముతో జీవయాత్ర గడపలేని నిస్సారపు మనుష్య జీవితంలో ఒక ఏడాదికాల వృధాఅయినా, చాలా నష్టమే. తమకూ, తమ కుటుంబానికీ, తమ దేశానికీ ఉ యోగంలేని విధంగా కాలం గడిపేవ్యక్తులు, తమ జీవితాన్ని వృధా చేసుకున్నవా కాక, సంఘానికీ, దేశానికీ అపకారం చేసిన వారవుతారు.

నిస్సారమైన జీవితాన్ని గడపుతూ, నిరుపయోగులుగా వున్న వ్యక్తులు, నేడు మనదేశంలో కోట్లసంఖ్యలో వున్నారు. చరిత్ర చదివినా, పురాణాలు చదివినా, ఒకానొకప్పుడు పూర్వకాలంలో మన దేశంలోని ప్రజలజీవితం, యీనాటిలాగ వ్యర్థంగా వుండలేదని తెలుస్తున్నది. ఈనాటి, యీ దౌర్భాగ్యస్థితికి, ముఖ్యమైన కారణం ఏమిటంటే, 135 ఏండ్లనాడు బ్రిటిషువారు మనదేశంలో ప్రవేశపెట్టిన విద్యా విధానం.

1835 లో బ్రిటిషువారు మనదేశంలో ప్రవేశపెట్టిన విద్యా విధానం, కేవలం, యీ దేశంలో తమ పరిపాలనకు కావలసిన గుమస్తాలను తయారు చేసుకోడానికి ఉద్దేశింప బడింది. గవర్నమెంటు ఉద్యోగాలను సంపాదించుకో దలచినవారే, ఆ చదువు ప్రారంభించారు. ఉద్యోగాలు దొరికినకొద్దీ, ఎక్కువ ఎక్కువమంది, ఆ చదువులలో ప్రవేశించారు. తమ పిల్లలను గవర్నమెంటు ఉద్యోగాలలో చేర్పించుదామనే కాంక్షతో, బస్తీలలో చదువు చెప్పించడానికి పల్లెటూళ్ళనుంచి ఎంతోమంది బస్తీలలో కాపురం పెట్టుకొని, ఎకరాల తరువాత ఎకరాలను భూమి అమ్ముకొన్నారు. మొదట్లో చదువుకున్నవారికి ఉద్యోగాలు దొరికినా, 1920-30 సంవత్సరాలలో ఉద్యోగాలు దొరక్క, ఉన్న ఆస్తులుపోయి, ఎంతోమంది దరిద్రులయారు.

ప్రస్తుతం పరిస్థితి మారింది. తాలూకాకు పాతిక హైస్కూళ్ళు, జిల్లాకు పది కాలేజీలు ఏర్పడ్డాయి. చదువుకో దలచిన ప్రతి బాలబాలికకూ చదువుకోడానికి అవకాశం ఏర్పడింది. లక్షల సంఖ్యలో కాలేజిలలోనూ, కోట్లసంఖ్యలో హైస్కూళ్ళలోనూ విద్యార్థులు చదువుతున్నారు. అంతవరకు బాగానే వుంది.

కాని, తమ పిల్లలు చదివే చదువు ఎంతవరకు ప్రయోజనకరమైంది అనే సంగతి తల్లి దండ్రులు ఆలోచించడం లేదు. తాము చదివే చదువు తమను ప్రయోజకుల్ని చేస్తుందా అనే విషయం, దానివల్ల ప్రయోజనంలేదని తమకు తెలిసేవరకు, విద్యార్థులకు తెలియదు. తల్లిదండ్రులూ, విద్యార్థులూ కూడా కోరేదీ, ప్రయత్నించేదీ ఎలాగయినా డిగ్రీ సంపాదించడం. తమ బిడ్డలకు డిగ్రీ వచ్చేటట్టు చెయ్యడానికి కొంతమంది అక్రమ మార్గాలను కూడా అనుసరిస్తున్నారని అప్పుడప్పుడు వింటున్నాము. చదువు వచ్చినా రాకపోయినా పరీక్షలలో ప్యాసవడానికి విద్యార్థులు నానా విధానాల ఆందోళన చేస్తున్న సందర్భాలు కూడా లేకపోలేదు.

డిగ్రీ వచ్చినా రాకపోయినా, తమ పిల్లలు ప్రయోజకులయే పద్ధతిలో విద్యావిధానం ఉన్నదా లేదా అని తల్లిదండ్రులు ఆలోచించడంలేదు. డిగ్రీ వచ్చినా చదువు రాకపోతే రాణించలేమనే విషయాన్ని విద్యార్థులు చాలామంది గ్రహించడం లేదు.

యువ.

డిగ్రీ సంపాదించుకోగానే, ఏదో ఒక ఉద్యోగం దొరుకుతుందని యువకులు భ్రమపడు తున్నారు. ఆ రోజులు పోయాయి. ఈ నాడు, దేశంలో కోట్ల సంఖ్యలో నిరుద్యోగులు ఉన్నారు. వారిలో ఎక్కువమంది డిగ్రీలు పొందినవారే, విద్యార్థులు ఎక్కువమంది అవడంవల్లనేమి, విద్యాబోధనలోని లోపాలవల్లనేమి, పరీక్ష పద్ధతులు సక్రమంగా లేకపోవడం వల్లనేమి, డిగ్రీలు పొందిన వారిలో చాలామంది, ఆ డిగ్రీకి వుండవలసిన విద్య లేకుండా వున్నారు. దానివల్ల, డిగ్రీకి వుండవలసిన గౌరవం వుండటంలేదు. ఈ విషయంలో యూనివర్శిటీలు తమ బాధ్యతను సక్రమంగా నిర్వహించడం లేదనే చెప్పాలి.

ప్రతి యువతికీ, యువకునికీ కావలసింది, సుఖప్రదమైన మనుగడ. మను గడకు ప్రతి వ్యక్తీ, జవసత్వాలు ఉన్నంతవరకూ యేదో కృషి, యేదో ఉద్యోగం, చెయ్యాలి. ఆ కృషిగాని, ఉద్యోగంగాని ప్రతి వ్యక్తికీ అతని అభిరుచికి అనుగుణ మైనదీ, అతని శక్తి సామర్థ్యాలకు అనురూపమైనదీ, అతని ప్రజ్ఞా పాటవాలను వెలువ రించేదీ అయి వుండాలి. అలా కాకుండా, ప్రతి వ్యక్తీ యేదో ఒక డిగ్రీని సంపా దించుకోవడమే అదర్శంగా పెట్టుకుంటే, ఆ డిగ్రీ అతని జీవయాత్రకు ఎంత మాత్రమూ పనికిరాకపోగా, జీవితంపట్ల నిస్పృహ కలిగించడానికి కారణమౌతుంది.

నిరుద్యోగతతో, నిస్పృహతో ఒక యువకతరం ఏర్పడితే, అది దేశానికి చేటు. ఇప్పుడిప్పుడే కొంతమంది విద్యార్థులు, తాము డిగ్రీలు తీసుకోగానే తమకు ఉద్యోగాలు చూపించాలనీ, అలా వుద్యోగాలు లేని పక్షంలో, తమకు జీవయాత్రకు ప్రతి నెలా కొంత భృతి ఇవ్వవలసిందనీ అడుగుతున్నారు. యువకులు, తమకు గవర్నమెంటు ఉద్యోగాలో, కంపెనీ ఉద్యోగాలో దొరక్కపోతే, జీవన భృతి ఇవ్వ వలసిందని అడగడం, ప్రపంచంలో మొట్ట మొదటిసారిగా మన దేశంలోనే ఆరంభ మైంది. ఇది చాలా విచిత్రమైన కోరిక. ఉద్యోగం లేని కోట్లకొలది యువకులకు భృతి ఇవ్వాలంటే, గవర్నమెంటు ఆ డబ్బును ఎక్కడనుంచి తేవాలి? ఒక కుటుంబంలో యిద్దరు ఉద్యోగాలు చేస్తుంటే, మూడోవాడికి ఉద్యోగం లేకపోతే, అతడి భృతికోసం తక్కిన యిద్దరూ గవర్నమెంటుకి ఎక్కువ పన్ను చెల్లిస్తారా? ప్రజలు ఇచ్చే పన్నులే కదా, గవర్నమెంటు ఆదాయం.

ఆఫీసులలో కూచునే ఉద్యోగాలూ, ప్రజలమీద అధికారం చెలాయించే ఉద్యో గాలూ కావాలని, ప్రతి సంవత్సరమూ కాలేజీల నుంచి డిగ్రీలతో బయటికి వచ్చే 50

అత్తలమందీ, హైస్కూళ్ళనుంచి ప్యాసయి వచ్చే కోటిమంది కోరితే, అన్ని వుద్యోగాలు ఎలా ఎర్పడతాయి?

కాని, ప్రతి వ్యక్తీ ఏదో ఒక వృత్తి చదువు చదివితే, దానివల్ల తాను కృషి చేసుకోగలగడమూ, లోటు లేకుండా జీవించగలగడమూ మాత్రమేకాక, దేశానికి ఉపయోగపడే వాడవుతాడు.

అలా ప్రతి వ్యక్తినీ తయారు చెయ్యాలంటే, కేవలం డిగ్రీలను చేతికి ఇచ్చే నేటి నిరుపయోగమైన విద్యా విధానం మారాలి. అది కూడా ఎంత త్వరగా మారితే అంత మంచిది. లేకపోతే సంఘానికీ, దేశానికీ ఉపద్రవం తప్పదు.

ఈ సంవత్సరంలోనైనా, మన యూనివర్శిటీలూ, మంత్రి మండలులూ, యీ విషయాన్ని తీవ్రంగా పరిశీలించి, ప్రయోజనకరమైన విద్యా విధానాన్ని రూపొందించాలి. విద్యా విధానాన్ని తయారు చెయ్యడంలో రాజకీయాలు, వర్గతత్వాలు ప్రవేశించాటుంటే, సరియైన విద్యా విధానం తయారు కాదు.

---

## రచయితలకు మనవి

ఈ నెలనుంచి యువను ఎక్కువ పేజీలతో ప్రచురిస్తున్నాం. రచయితలు సహకరించ గలరని ఆశిస్తున్నాం. యువలో చిన్న నవలలూ, పెద్దకథలూ ప్రచురించ నిశ్చయించాము. కనుక రచయితలు అలాంటి రచనలు పంపప్రార్థన

సంపాదకుడు,

యువ

1, ఆర్కాట్ రోడ్, మద్రాసు-26.




(గత సంచిక తరువాయి)

## 4

నవద్వీపంలో కిశోరబాబు ఒక శ్రీమంతుడు. సుమారు ముప్పై ఆరేళ్ళ వయస్సు.

రెండో పెళ్ళివాడు కావటం చేత హేమను గురించితెలిసి, పిల్లని చూడకుండానే పెళ్ళికి ఒప్పేసుకున్నాడు. హేమకూ కిశోరబాబుకీ అనుకున్నట్టుగానే మార్గశిర బహుళంలో పెళ్ళయింది. అత్తారింటి కెళ్ళేముందు హేమ ఎడంగా నించునే గుణిదాకు సమ



పెళ్ళయాక కిశోరబాబు అత్తను కూడా వచ్చి ఉండమని మరిమరి కోరాడు. నవ ద్వీపంలో ఉండి పుణ్యం సంపాయించవచ్చు కదా అని కుతూహలంతో, సులోచన అందుకు ఇష్టపడుతూ కూతురి పేర ఉత్తరం రాయించింది.

అయితే ఆమె వాంఛకు కేవలం వ్యతిరేకమయింది. తల్లి ఉత్తరానికి హేమ ఇలా జవాబు రాసింది: "నువ్వు ఏ యింటో అయితే ఉంటున్నావో, ఆ యింటి గాలి కాస్త స్కరించి వెళ్ళింది. ఆమెకు అత్తమామలు లేరు, ఆడబిడ్డలూ లేరు. ఉన్నదల్లా భర్త నాయనమ్మ, పెళ్ళికాని మరిదీ, అంతే.

శోకినా ఈ నవద్వీపం పవిత్రమవుతుంది. అక్కడ వుండీ నువ్వు పుణ్యం సంపాయించ లేక పోయావంటే, వైకుంఠానికి వెళ్ళినా నీకు పుణ్యం రాదు. అతన్ని గనక నువ్వు వదలి వచ్చావో, నేనే వెళ్ళి అక్కడవుంటా, తెలుసుకో.''

సులోచనకు కూతురి సంగతి బాగా తెలుసు. అంచేత ప్రయాణం మానుకుంది. అయినా, ఆమె మనస్సు మాత్రం రాత్రింబవళ్ళు ఎన్నడూ ఎరగని ఆ నవద్వీపం చుట్టుతా తిరుగుతూ ఉండేది.

ఆరు నెలలు గడిచాయి.

ఉండబట్టలేక ఓనాడామె ఏదో ఉత్సవం వంక బెట్టుకుని నవద్వీపానికి ప్రయాణమయింది. నందుణ్ణి వెంటబెట్టుకుని స్టీమరెక్కింది. తీరా ద్వీపంలో దిగి కూతుర్ని చూసేటప్పటికి ఆమె చిక్కిపోయివుంది. ఎంతో విచారపడింది సులోచన. "అమ్మాయీ!- ఇక్కడ నీ వంక చూసేవారే ఎవరూ లేరులాగుందే? పోనీ, నీ గొడవ నువ్వయినా చూసుకోపోతే ఎలా, తల్లీ!'' అంటూ మనస్సులో వేదన వెల్లడించింది. 'అవు' నన లేదు, 'కాద'నలేదు హేమ.

ఉత్సవం అయిపోయింది. అయినా తల్లి తిరిగి పోదామనే తొందరలో లేనట్టు గ్రహించింది. కూతురు, ''ఏమే అమ్మా, ఇంకా ఎంతకాలం బైరాయిద్దామని అల్లుడు గారింటో? లోకులు నవ్వి పోతారనైనా యిదిలేదేం నీకూ?" అని హెచ్చరించింది.

చర్రున కోపం వచ్చేసింది సులోచనకు. "ఏం నన్ను తరిమేద్దామనా ఇక్కణ్ణుంచీ? అప్పుడుగాని నిద్దర పట్టదా ఏం, నీకూ? అయినా నేను నా కూతురి దగ్గర అల్లుడింటో ఉన్నాగాని, పరాయిల్లు కాదు కదా! సరే, పోనీ—అక్కడికి వెళ్ళమంటావే? నా స్వంత ఇల్లు ఉందని పొమ్మంటావా? నువ్వే చెప్పు'' అనడిగింది, రోషంతో.

ఈ మాటకు తెల్లబోయింది, హేమ. "నిన్ననవలసిన పనేం లేదమ్మా! మన ఆడవాళ్ళ నైజమే అంత, నా వాళ్ళూ తనవాళ్ళూ అనే తేడా క్షణంలో మరిచిపోతాం''అంది.

* * *

కాలం గడిచిపోతూనే వుంది. మళ్ళీ మహర్నవమి వచ్చింది. తల్లీ కూతుళ్ళకు గుణేంద్రుడు పంపించిన పూజా బహుమతులు ఎంతో అట్టహాసంగా ఉన్నాయి. సులోచన కూతుర్ని చాటుకి పిలిచింది, "మన గుణీదా బ్రాహ్మ మతస్థుణ్ణి అంటాడు గాని, వాడి కివన్నీ తెలుసునే'' అంది.

అతడు పంపిన మిఠాయిలూ అవీ ఇరుగు పొరుగు లందరికీ పంచి పెట్టింది, సులోచన. అతడు పంపిన బట్టలూ బహుమతులు చుట్టుపక్క లందరికీ చూపించింది.

"నే నక్కడ లేకపోయినా మావాడు చెల్లెలికి ఎలాటి బహుమతులు పంపించాడో చూశారా?—ఈ పండగ రాగానే నే నింక ఇంటికి వెళ్ళిపోతా'' అంటూ ప్రచారం మొదలెట్టింది. ఆమె వెళ్ళడం మానడం గురించి నాటినుంచీ హేమ మళ్ళీ కలుగజేసుకోనే లేదు. ఇదంతా గ్రహించలేకపోయింది సులోచన. అయినా మనసులో ఇలా అనుకుంది: "నా హేమ కడుపున నలుగురు బిడ్డలు పుట్టి, వాళ్ళని తను విడిచి వెళ్ళాల్సి వస్తే, తల్లి ప్రాణం ఎంతెలా విలవిల్లాడుతుందో అప్పుడు కదా దానికి తెలిసి రావటం?''

సులోచన అనుకున్నట్టూ జరగలేదు. పండగ వెళ్ళకముందే తీవ్రంగా మలేరియా పట్టుకుంది. నెల్లాళ్ళు అవస్థపడ్డది.

''ఆపదసమయంలో దేవుణ్ణి స్మరించుకోవాలి. బతకాలని వాంఛ ఉంటే గుణీదాకి ఉత్తరం రాయి,'' అన్నది హేమ. ఈ మాటలు అంటూ ఉంటే కళ్ళ నీళ్ళు గిర్రున తిరిగి, కాలవలాగా ప్రవహించాయి. "అలాగే చెయ్యి అమ్మా, ఉత్తరం రాయి వాడికి '' అంది సులోచన.

గుమాస్తాను పిలిపించి, అమ్మని తీసుకు వెళ్ళమంటూ గుణేంద్రుడికి ఉత్తరం రాయించింది హేమ.

రెండు రోజులయే సరికల్లా దర్వానూ, మానదా వచ్చారు. "గుణీదా రాలేదేం?" అని మానదా నడిగింది. తప్పక అతడు వస్తాడని మహా అనుకుని ఎదురు చూస్తున్న హేమ.

''రెండు వారాలై ఆయనకీ వంటో బాగుండటం లేదమ్మా. జ్వరం, దగ్గూ, ఆయాసం—ఏదో ఒకటి. లేకపోతే మీ ఉత్తరం వచ్చినందుకు క్షణమైనా ఆగేవారేనా?'' అంది మానదా.

* * *

వెళ్ళిపోయింది సులోచన.

అమ్మకు పథ్యపానాదులన్నీ ఏర్పాటు చేయించాడు గుణేంద్రుడు. అంతేకాదు. దాస దాసీలను వెంట తోడిచ్చి, ఆవిడకు గాలి మార్పుకోసం విదేశాలక్కూడా పంపించాడు.

''నాయనా, నీ వంటో మాత్రం ఏమంత ఖులాసాగా ఉందనీ. పద, ఇద్దరం కలిసి [illegible] దేశాంతరం'' అన్నది. కాని గుణి ఒప్పుకోలేదు. తనకి కలకత్తాలో తలమున [illegible] ఉండటంవల్ల రాననేశాడు. ఇక్కడే ఉండిపోయాడు.




విదేశాలకు వెళ్ళాక సులోచన ఆరోగ్యం బాగా కుదుటపడింది. "ఇప్పుడు నా వంట్లో బాగానే వుంది. మాఘమాసం ఆఖరికల్లా ఇంటికి వచ్చేస్తాను" అంటూ ఆమె కలకత్తాకూ నవద్వీపానికీ కూడా ఉత్తరాలు వేసింది.

నిరుడు మార్గశిర బహుళ దశమినాడు హేమకు పెళ్లయింది. అంటే ఇవాళ్టికి సరిగ్గా ఒక పూర్తి సంవత్సరం. ఈ సంగతి హఠాత్తుగా జ్ఞాపకమొచ్చింది గుణేంద్రుడికి. ఒక్కక్షణం పుస్తకం మీదినించి దృష్టి మరల్చాడు. కిటికీ అవతల శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

* * *

అంతలో కొత్తదర్వాన్ "మహరాజ్, అర్జెంట్ టెలిగ్రామ్!" అని పిలిచాడు.

వెనక్కి తిరిగి చూశాడు గుణి. దర్వాన్ వెంట వచ్చిన టెలిగ్రాఫ్ ప్యూన్ కవరు చేతికిచ్చి, సంతకం పెట్టించుకుని, సలాం చేసి వెళ్ళిపోయాడు.

వైర్ చించి చూసుకుని ఆశ్చర్యపడ్డాడు గుణేంద్రుడు. "బయల్దేరాను—హుగ్లీ చేరి అక్కణ్ణించి రైలెక్కుతాను—మూడు గంటలకు స్టేషనుకు బండీ పంపించు—హేమ." ఆమె ఇప్పుడెందు కొస్తూంది? కూడా ఎవరున్నారు? కిశోర్‌బాబు కూడా వస్తున్నట్టా? ఒక్కర్తే వస్తుందా?— ఈ సంగతులేవీ గుణి ఊహించ లేకపోయాడు.

ఇక్కడ చూడబోతే—ఆడవాళ్ళన్న మాటే లేరు. దాసీది మానదా సులోచన వెంబడి విదేశానికి వెళ్ళింది. అందుకని గుణేంద్రుడికి కంగారు పుట్టింది. పూర్వంనించీ

ఉంటున్న సారటుబండీ తీసుకెళ్ళి, ఇంకా సాయంత్రం పడకముందే హేమను వెంట బెట్టుకు వచ్చాడు. హేమవెంట కొంతమంది దాసదాసీలున్నారు, కొన్ని సామాన్లున్నాయి. ఆమెను చూసి గుణి వణికిపోయాడు.

"ఇదేమిటి? పిచ్చిదానిలా తెల్లకోక కట్టుకొచ్చావ్?" అనడిగాడు.

నేలకంటా వాలి, హేమ నమస్కరించింది. "పైకి పద, చెబుతా" అన్నది. మేడ మీద హాల్లోకి వెళ్లి కూర్చున్న తరవాత, "అమ్మ మాఘమాసం లోపుగా రాదా?" అని ప్రశ్న వేసింది.

"అలా అనే రాసింది."

"అలా అయితే ఆమెకీ లోపుగా తెలియచెయ్యాల్సిన పనిలేదు. కాని—గుణిదా!- నిరుడీ రోజున వెళ్లాను; మళ్లీ సరిగ్గా ఇవాళ్టిరోజునే తిరిగి వచ్చాను. ఇది ఆశ్చర్యకరమైన విషయం కాదూ?—" అన్నది.

అర్థంకాలేదు గుణేంద్రుడికి. "తిరిగి రావడమేమిటి?" అనడిగాడు.

"తిరిగి రాకపోవడమేమిటి?" అంటూ మళ్లీ ప్రశ్న వేసింది హేమ. "అక్కడ ఇహ నెలా వుండటం? నా తెల్లకోక చూసైనా గ్రహించలేక పోయావే? మొన్నటితో కర్మకాండలన్నీ పూర్తి అయిపోయాయి. ఇవాళ బయల్దేరి వచ్చా"నని చెప్పింది.

కొయ్యబారిపోయాడు గుణి. చాలాసేపటిదాకా మరి మాటాడలేక పోయాడు. కాస్త తమాయించుకుని "కబురయినా చేశావు కావేం. కిశోర్‌బాబుకి జబ్బేంచేసింది?" అంటూ ఆత్రంతో అడిగాడు.

"ఆ క్రితం బుధవారం సాయంకాలంనించీ కలరా లక్షణాలు కనిపించాయి. ఊళ్లో ఘనవైద్యులచేత చికిత్స చేయించా. కాని మాట తక్కలేదు. మర్నాడు పదింటికల్లా . ..."

గుణి పక్కకి తిరిగి కన్నీళ్ళు తుడుచుకున్నాడు. "ఈ మాట అమ్మ విన్నదంటే ఏమన్నా వుందా, పై ప్రాణాలు పైనే ఎగిరిపోతాయి. నువ్వు చెప్పినట్టు—ఆమెకు తెలియటం ఎంత ఆలస్యమయితే అంత మంచిది." అన్నాడు.

అందుకు హేమ ఇలా చెప్పింది: "బ్రహ్మ లిఖితమనేది ఒకటుంది కదా, గుణిదా? దానికి విరుద్ధంగా మీరు యంత్రం పన్నుతున్నారనే విషయం లోలోపలే నాకు బాగా తెలిసిపోయింది. ఆనాడు నామాట కాస్తయినా వినిపించుకున్నారా మీరూ, చెప్పూ. ఇప్పుడిహ ఏడిచి మొత్తుకోవటం, రాగాలు తియ్యటం....ఏమనుకుంటే యేముందీ?—



"నేను అలసిపోయి వున్నాను. బలే ఆకలేస్తోంది. ఏం తినేది చెప్పు. కాని, ఇప్పు డింక వంట చెయ్యలేను. ఏవయినా పళ్ళూ అవీ తిని ఎలాగో కాలక్షేపం చేసేస్తా" అన్నది.

"ఏమీ తినలేదా, పొద్దిట్నించీ? అడిగాడు గుణి."

"లేదు. స్టీమరుకోసం చీకటి ఉండగానే బయల్దేరాల్సి వచ్చింది" అని బదులు చెప్పింది హేమ.

*　　　　*　　　　*

ఉత్తరం రాయించినట్టుగానే, సులోచన మాఘ బహుళంలో తిరిగి వచ్చింది. కాని ఆరోగ్యం నసిలేదు. దానికితోడు, ఇల్లు చేరుకోగానే పిడుగు పాటు వార్తవిని, వెంటనే మంచమెక్కింది. ఇప్పుడు కలిగిన ఈ దుఃఖం ఆమెకు హృదయ శల్యం గాక మరేమిటి?—ఆ బాధ చెప్ప తరం కాదు. సులోచనకు జరిగే వైద్యానికి లోపం లేదు, శుశ్రూషకు లోటు లేదు. కాని, ఎంత చేసినా ఏమీ లాభం కన్పించలే. ఉండగా ఉండగా ఒకనాడామెకు ఒళ్లు ఉబ్బు చూపింది. చూసి, గుణి దిగులుపడ్డాడు. ఆరోజున ఆమె గుణిని ఒక్కడూ ఉన్నప్పుడు పిలిచి, ఇలా అంది: "నాయనా, ఇంకా ఎందుకిలా తాపత్రయ పడతావ్? మాట తక్కేట్టయితే బంది లేదు. కాని, వృథా ప్రయత్నమెందుకు గుణీ! నిశ్చింతగా వెళ్ళిపోనీ "

గుడ్ల నీళ్లు గుక్కుకున్నాడు గుణేంద్రుడు. "అంత నిరాశగా చెబుతా వెందుకమ్మా! ఇప్పుడేం జరిగిందనీ?"

"ఆశలు పెట్టుకునేందుకు ఇంకా ఏముంది గుణీ, నువ్వే చెప్పూ" అన్నది సులోచన. తల వంచుకున్నాడు గుణి. మళ్ళీ ఇలా అందామె: "నాకేం తెలియ దనుకోకు నాయనా!—తెలిసి తెలిసి నేనేపాపమయితే చేశానో, అది లోలోపల నన్ను అణువణువునా భస్మంచేసి దహిస్తోంది."

కొంచెం సేపు మౌనంగా ఉండి, ఇంకా ఇలా అడిగింది: "ఒక్క మాట నువ్వు నిజం చెప్పు గుణీ, నాతో. ఒకప్పుడు నువ్వు హేమను ప్రేమించావని నాకు బాగా తెలుసు. మళ్లీ ఒకసారి దాన్ని ప్రేమించటానికి ప్రయత్నించలేవూ?"

తలవంచుకున్న గుణి ఇలా చెప్పాడు: "అమ్మా!—ఆనాడూ ప్రేమించాను, ఈ నాడూ ప్రేమిస్తున్నాను, దాన్ని ఎప్పుడూ ప్రేమిస్తూనే వుంటానమ్మా. హేమను గురించినీకేం దిగులక్కర్లే. నేను బతికుండగా దాన్ని ఏమాత్రం కష్టపడనియ్యనమ్మా!"

నాకు మాత్రం తెలియదా గుణీ! నే నెరుగుదును. సరేకాని, ఇదుగో ఇదే మీ ఇద్దరికీ నా కడాపటి దీవెన. ఒకవేళ ఎప్పు డయినా అవసరమొస్తే, ఈ సంగతి దాంతో చెప్పు. మరోమాట! నేనిక్కడ ఉన్నప్పుడు ఒకమాటు అమ్మాయి నాకు ఉత్తరం రాస్తూ, ఏమందో తెలుసా?—

"నువ్వు ఏయింటో అయితే ఉంటున్నావో, ఆ ఇంటి గాలి కాస్త సోకినా ఈ నవద్వీపం పవిత్రమవు తుంది. అక్కడ వుండీ నువ్వు పుణ్యం సంపాయించ లేక పోయావంటే, వైకుంఠానికి వెళ్ళినా నీకు పుణ్యం రాదు," అంటూ రాసింది.



"రా, నాయనా!—నేను చచ్చిపోయేముందు నాతల మీద చెయ్యానించి, నేను పాపవిముక్తురాల్ని కావాలని ప్రార్థన చెయ్యి. నేచేసింది ఎంతటి అపరాధమో, అది నాకు తప్ప మరెవ్వాళ్ళకీ తెలియదు, గుణీ!—" అన్నది సులోచన.

నిశ్శబ్దంగా ఏడుస్తున్నాడు గుణేంద్రుడు. నిజానికి అతడు సులోచనను తల్లిలాగానే ప్రేమిస్తున్నాడు.

"గుణీ!—హేమతో నేనేమాటా చెప్పలేను. దాని ముఖంకేసి చూస్తేనే నాగుండె తరుక్కు పోతుంది. లోకంలో సవతితల్లి ప్రేమ గురించిన కథలు చెప్పుకుంటారు. నేను దానికి సవతితల్లి కంటె కూడా పెద్ద శత్రువునైపోయాను, నాయనా!" అని యేడ్చింది సులోచన.

ఆమెకి మర్నాటి కల్లా రోగం ముంచు కొచ్చింది. బతుకుతుందనే ఆశ ఎవళ్ళకీ లేదు. అంతా వదులు కున్నారు. శ్వాసకూడా సరిగా ఆడటంలేదు. ఇంకేం ఆశ?— హేమను దగ్గరికి పిలిచింది. గడ్డం తాకి ముద్దెట్టు కుంది. "అమ్మా, ఇంక నే వెళ్ళి పోతున్నానే తల్లీ!" అంటూ వలవల యేడుపు మొదలెట్టింది.

తల్లి గుండెల మీద పడి, తలకొట్టుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది హేమ.

కాస్సేపయాక దుఃఖం ఆపుకుని, లెమ్మని సౌంజ్ఞ చేసింది సులోచన.

'ఏడవకు తల్లీ!—పూర్తిగా పదిహేనేళ్లు నిన్ను హృదయానికి హత్తుకుని కాలం గడిపాను. ఇప్పుడిహ సమయమొచ్చింది. మీ నాయనదగ్గరికి నేనూ వెళుతున్నా. ఇవాళ నాకెంతో సంతోష సమయం. ఇహ ఏడవను. ఇప్పుడు నువ్వు నన్ను బేజారు పెట్టకుండా వుంటే సంతోషంగా వెళిపోతా నమ్మా!—అయితే—నీముఖం చూడా లంటే నాకు సిగ్గేస్తూంది, దుఃఖం పొంగి పొంగి వస్తూంది. నీవేపు చూడలేకుండా ఉన్నానమ్మా!" అన్నది.

మితిలేని దుఃఖంలో ఉన్న హేమ ఇలా చెప్పింది: "నువ్వెందుకమ్మా అలా విల పిస్తావ్? నా మొహాన ఏం రాసి పెట్టివుందో అదే జరిగింది. ఇందులో నువ్వు చేసిందేముందీ?"

ఈ మాటకి అడ్డువచ్చి ఇలాఅంది సులోచన: "నేను చేసిందీ ఉంది. లేక పోవడ మేమిటి, తల్లీ!—అంతా నేను చేసుకున్నదే చేతులారా. నా చేతిని నేనే నరికేసు కున్నాను. నే మధ్యలో వచ్చి అంతా నాశనం చేశాను గాని, లేకపోతే నీ అంత అదృష్టవంతురాలు మరెక్కడుంది హేమా, ఈ లోకంలో? ఆ సందర్భాలన్నీ తెలుసు నాకు, అందుకనే ఇంత దుఃఖాన్ని దాచుకోవాలంటే నాకు హృదయంలో చోటు కనబడటం లేదు. అమ్మడూ!—తెలియక చేసిన పాపాని కేదయినా ప్రాయశ్చిత్త ముందేమో కాని, తెలిసి చేసిన పాపానికి విముక్తి ఎక్కడ, తల్లీ?"—

ఇలా అంటూవుంటే సులోచన కళ్ళనించి జలజలా నీళ్లు కాలవగా ప్రవహించాయి. తన పమిట చెంగుతో హేమ తల్లి కళ్ళనీళ్లు తుడిచేసింది. కాస్సేపయాక మళ్ళీ సులోచన ఇలా చెప్పింది:

"మీ అమ్మ మీద కోపం పెట్టుకోకు, తల్లీ!—అమంగళ మౌతుందేమోనని నీముందు ఈమాట చెప్పలేకుండా వున్నాను గాని .లేకపోతే, ఈ మరణసమయంలో చేతులు రెండూ జోడించి ."




అంటూ ఉండగానే చటుక్కున హేమ తల్లినోరు మూసింది. "అమ్మా! నేనేం చేస్తే నీప్రాణం హాయిగా ఉంటుందో చెప్పవే. అలాగే నడుచుకుంటా. ఎన్నడైనా నీమాట కాదన్నానా నేను? చెప్పవే తల్లీ!" అన్నది.

చెయి వణికిపోతూంది సులోచనకు. ఎంతో కష్టం మీద ఆ చేతిని కూతురి తలపైన ఉంచింది. "నువ్వెప్పుడూ నామాట కాదనలేదే అమ్మా!—అందుకనే ఇలా కుమిలిపోతున్నాను. హేమా!—నేను చెప్పవలసిందేదో గుణికి చెప్పేశాను. అవసరమయితే ఆమాట నీకు చెబుతాడు.—

"హేమా!—నువ్వెళ్ళి బట్టలు మార్చుకురా అమ్మా!—నిరుడీ రోజుల్లో ఎలాంటి చీర కట్టుకు వచ్చి ఈయింటో నా మంచం మీద కూర్చునేదానివో, ఏ నగలు పెట్టుకుని మొట్ట మొదటగా నీతల్లికి నమస్కరించటానికని వచ్చావో, మా గుణి పెట్టిన ఆ చీర కట్టుకుని, ఆ నగలు పెట్టుకుని ఒక్కసారి నా ఎదటికి రా తల్లీ!—నే చేసుకున్న మహాపాపం నించి ఒక్కక్షణం సేపయినా నన్ను విముక్తురాల్ని కానీ అమ్మా!" అని చెప్పింది.

నిశ్శబ్దంగా లేచి వెళ్ళింది హేమ. సరిగ్గా తల్లి చెప్పినట్టల్లా చేసింది. మళ్ళీ వచ్చి కూర్చుంది. సులోచన పెదవులమీద సంతోష రేఖలు తాండవించినట్టయింది. ఆమె ఎంతో ఆరోగ్యంగా ఉన్నట్టు కూడా అనిపించింది.

"అమ్మాయీ!—నా ముప్పైనాలుగేళ్ళ జీవితంలో ఎన్నడూ కలగని జ్ఞానం విదేశాలనుంచి వచ్చాక, మొట్టమొదటగా నిన్ను చూసిన క్షణంలో నాకు కలిగింది. హేమా!—ఒట్టువేసుకు చెబుతున్నాను అమ్మా!—ఈ నగలూ, ఈ చీరలూ

నువ్వెప్పుడూ వదిలెయ్యోద్దు. వితంతువులకి ఈ వేషం ఏర్పరచిన ఆ పాషాణ హృదయు డెవడో, దుర్మార్గుడు! నా హృదయానికి తగిలిన అఘాతం వాడి కొక్కడా తగలాలని శపిస్తున్నాను. హేమా!— అడ్డు చెప్పకు. నామాటకు అడ్డు చెప్పొద్దు. ఏం చెప్పినా, ఎంత చెప్పినా ఇవాళే. రేపు మళ్ళీ నీకు చెప్పేందుకు రాను కదా!—నీతండ్రిదగ్గర ఉండి అక్కణ్ణించే, నువ్వెప్పుడూ సుఖంగా ఉంటున్నావా అని చూస్తూంటాను. ఇదే నా మాట'' అంది.

క్రమంగా సులోచన కంఠస్వరం గద్గదమయింది. పమిట చెంగుతో కూతురు ఆమె కళ్లు తుడుస్తూ వుంది. డాక్టర్ని వెంట బెట్టుకు వచ్చి గుణి ఆ గదిముందర నిల బడ్డాడు. సులోచన చూసింది వాళ్ళని. అదో మోస్తరు ధోరణిలో అన్నది:— ''ఇంకా డాక్టరెందుకు గుణీ!—ఆయన విజిటింగ్ ఫీజు ఏదో ఇచ్చేసి అక్కణ్ణించే వెనక్కి పంపెయ్యి. నువ్వోసారి ఇలావచ్చి నాదగ్గిర కూర్చో నాయనా!''

అందుకు గుణేంద్రు డిలా అన్నాడు. ''ఎలానూ రానే వచ్చారుగా, అమ్మా! ఒక్కమాటు చెయ్యి ''

''వొద్దు గుణీ, వొద్దు. ఎందు కొచ్చిన యాతన? నన్నట్టే వేధించక. ఆయన్ని వెళ్ళి పోనీ'' అన్నది సులోచన.

ఇదంతా డాక్టరు కేం తెలుసు? గదిలోకి వచ్చాడు, ఆమె మంచం దగ్గరికి కుర్చీ లాక్కున్నాడు, జేబులోంచి థర్మామీటరు తియ్యబోయాడు.

విరక్తితో ఇలా అంది సులోచన: ఆయనగారి తెలివి చూడు. ఆ గొట్టంతో కొలుస్తాడట, నాకు జ్వరం ఎంత వుందో!—ఇదంతా ఏమిటిగాని గొడవా, నువ్వెళ్లి. నందాని పంపించి మంచి ఆయుర్వేద వైద్యుణ్ణి పిలుచుకు రమ్మను. ప్రాణం ఎంత సేపట్లో పోయేదీ ఖచ్చితంగా చెబుతాడు. నాకోసం మందులూ మాకులూ ఏమీ తేవద్దని కూడా చెప్పిపంపించు,'' అన్నది.

ఎలక్ట్రిక్ లైటంటే కిట్టదు సులోచనకు. అంచేత గదిలో మైనపు వత్తిదీపమే పెడుతున్నారు. సాయంత్రమయ్యేసరికి దీపం వెలిగించి టేబిల్ మీద పెట్టారు. ఇదే చివరి రాత్రి అనుకుందామె. ఈరాత్రి అయినా సిగ్గూ, సంకోచమూ వదిలి పెట్టి, జీవితంలో యథార్థ విషయాలు స్పష్టంగా మనః పూర్వకంగా చెప్పేయ్యాలి, చెప్పక పోతే భగవంతుడు తనకింకా శిక్ష విధిస్తాడని నిశ్చయించుకుంది. కాబట్టి, పాప ఫల మేదో నెత్తిన వేసుకు చావడ మెందుకనే జిజ్ఞాసతో దీర్ఘంగా నిట్టూర్చింది. ఆకస్మి

కంగా ఆమె అలా నిట్టూర్చడం చూసి, హేమ గాభరా పడింది. తల్లి ముఖం మీదికి వంగి, "ఏమిటి అమ్మా!—" అనడిగింది.

సులోచన మెల్లి మెల్లిగా చెప్పసాగింది.

"ఏం లేదమ్మా!—గుణి మాట నువ్వెప్పుడూ నిర్లక్ష్యం చెయ్యకు తల్లీ!—అతడి మనస్సుకి కష్టం కలిగించకు. అతడికేది ధర్మమో, నీకూ అదే ధర్మం. ఇది నామాట కాదు. ఎవరి ఆదేశం ప్రకారం మీరిద్దరూ ఒకరికొకరు తొలిసారి చూసుకున్నప్పుడే ఒకటైపోయారో, ఆయన ఆదేశం! —ఛ!—సిగ్గుపడతావెందుకు హేమా!—అందరి మనస్సుల్లోనూ ఉండి మాటాడించే అంతర్యామి బోధలను ఉపేక్ష చెయ్యొద్దు. వాటిని తిరస్కరించకు నేను తిరస్కరించి ఆయనకు అవమానం చేశాను. ఆ పాపఫలం అనుభవిస్తున్నాను. మీ ఇద్దరికీ నే చెప్పే చిట్ట చివరి మాట ఇది—నేను అన్యాయం చేశాను, పాపం చేశాను. వాటికి మీరు శాశ్వతంగా కట్టుబడకండి. నా దుష్కృతిని మాత్రం అక్షయంగా ఉంచబోకండి."

మానదా వచ్చి, వైద్యుడు వచ్చాడని చెప్పింది. ఆయన్ని లోపలికి రమ్మన్నది. మెల్లిగా సులోచన. "హేమా!—నువ్వొక్కసారి బయటికి వెళ్లుతల్లీ!—" అని చెప్పిపంపింది.

## 5

తల్లి పోయినప్పటినుంచీ హేమ చాలామారిపోయింది. ఆమె ఆచారవ్యవహారాల్లో ఎంతో మార్పు వచ్చింది.

మొదటినుంచీ గుణేంద్రుడు సహనశీలుడు. హేమలో వచ్చిన పరివర్తనను ప్రారంభంలోనే గ్రహించాడు. అంతా సహించి ఊరుకున్నాడే కాని ఎన్నడూ ఒక ప్రశ్నఅయినా వెయ్యలేదు. పూర్వం నవలలూ, నాటకాలూ, ప్రబంధాలు చదువుతూ వచ్చిన హేమ, వాటన్నింటినీ దూరంగా ఉంచింది. ఇప్పుడు రామాయణం, భారతం, భగవద్గీత, ఉపనిషత్తులు—వీటి పఠనంలో మునిగిపోయింది.

తల్లి వేసుకున్న ఒట్టు జ్ఞాపకముంది హేమకు. ఆప్రకారము చీరెలుకట్టటం, చేతి గాజులూ మెళ్లో గొలుసూ మొదలైన నగలు ధరించటం మానలేదు. అయితే—వితంతువులకు ఏర్పడిన కఠోరనియమాలు మట్టుకు దీక్షగా నిర్వహిస్తూంది.

ఎటువంటి ఆడంబరమూ లేదు. ఒక్కపొద్దే వంటా భోజనమున్నూ. మామూలు ఇంటిపనులు చూచుకున్నప్పుడు తప్ప తక్కిన కాలమంతా ధర్మవిచారణలో గడిపేది.

ఒకవేళ ఎప్పుడైనా ఆమె గుణిదగ్గరికి వచ్చి కూర్చున్నా, ఏదో వంక పెట్టుకొని మరు క్షణమందే అక్కడినుంచి లేచి వెళ్ళిపోయేది.

ఆమె అతని దగ్గర కూర్చోటానికి ఏదో భయపడుతూందా అన్నట్టుగా హఠాత్తుగా లేచి పారిపోవటంతో అతడి మనస్సులో ఒకవిధమైన అభిప్రాయం ఏర్పడేది. చాల సేపు గుణి శూన్యంగా కిటికీలోంచి బయటికి చూస్తూ, నిశ్చేష్టుడై అలానే కూర్చుండి పోయేవాడు. కాలం గడచినకొద్దీ, ఆమె ఆచార వ్యవహారాలకు సంబంధించిన ప్రతి చిన్నపనీ పెద్దగా పరిణమిస్తూ వచ్చింది.

* * *

ఒకనాడు హఠాత్తుగా వచ్చింది హేమ. "గుణీదా! —నేను మంత్రోపదేశం పొందాలని వుంది. ఏమంటావ్?" అనడిగింది.

"ఏమిటా మంత్రం !—గురుమంత్రమా ?"

"ఊఁ"—

"ఆత్మ రక్షణ కోసమని రోజుకో కొత్తరక్షకవచాన్ని ఎందుకు ధరిస్తావు హేమా! అవసరం లేదు" అన్నాడు గుణి.

ఈ మాట గ్రహించిందో లేదో ! కొంచెం ఆగి, "గురూపదేశం అవసరంలేదా?" అని మళ్లీ అడిగింది.

"ఉంది. కాని ఉపదేశం పొందే వయసింకా రాలేదు నీకు, ఆదీగాక మీ గురువు లెవరో నాకు తెలియందే, నా ఉద్దేశమేం చెప్పేది?"

"ఏ గురువో ఎందుకు ? నీదగ్గరే నే దీక్ష స్వీకరిస్తాను" అన్నది హేమ.

ఆశ్చర్య చకితుడైనాడు గుణి. "నా దగ్గరా, నువు దీక్షస్వీకరించడం !—దీక్ష అంటే నాకేం తెలుస్తుంది హేమా! అదీగాక మీరు హిందువులూ, నేను బ్రాహ్మమత స్థుణ్ణి" అని చెప్పాడు గుణి.

"అదంతా నాకు తెలియదు, గుణీదా !—నీకు ఏదయితే ధర్మమో, నాకూ అదే ధర్మమని చెప్పింది అమ్మ. సరేకాని గుణీదా! ఆమాటకు అర్థమేమిటీ?"—అనడిగింది.

గుణికి అర్థం తెలుసుకాని, పైకి చెప్పలేదు. మామూలు ధోరణిలో ఇలా అన్నాడు- "బహుశా అన్ని ధర్మాలు ఒకటేనని అమ్మ ఉద్దేశమేమో?" కాని, అన్ని ధర్మాలూ ఒకటి కాదని చెప్పింది హేమ. కాస్సేపు ఊరుకున్నాడు గుణి. "ఈ విషయం నే నెన్నడూ ఇతరులతో ఆలోచించి ఎరగ" నన్నాడు.

"నేను నీకు పరాయిదాన్ని కాదుగా?" అన్నది హేమ.




అందుకు జవాబుగా—"కాదు, నిజమే. నువ్వు నాకు పరమాత్మీయురాలివి. కాని, నీతో అయినా ఈ విషయాలు చర్చించదలుచుకోలేదునేను" అన్నాడు గుణి. హతాశురాలయింది హేమ. నిట్టూర్పు విడిచింది. "నువ్వు చెప్పకపోతే మరి, నాకెలా తెలుస్తుందీ?" అనడిగింది.

సానుతాపంగా ఆమె ముఖంకేసి చూశాడు, గుణేంద్రుడు. "నువ్వు తెలుసుకోవాలనుకుంటున్న దేమిటి, హేమా!" అడిగాడు గుణి.

"ఓనాడు నేను బలవంతంగా నీ విస్తట్లో కూర్చుని భోంచేసిన జ్ఞాపకముందా? అప్పుడు నేను చేసింది మంచి పని కాదన్నావు. ఎవరి జాతి ధర్మాలను వారు పాటించడం మంచిదని కూడా అన్నావు. ఇప్పుడేమో—అన్ని ధర్మాలూ ఒక్కటే నంటున్నావు. ఇందులో ఏది సత్యం, ఏదసత్యం,?" అంటూ తన సంశయం వెల్లడించింది.

అందుకిలా జవాబు చెప్పాడు, గుణేంద్రుడు: "ఆ రోజున నేనేదో యాధాలాపంగా అన్నాను. అయినా, ఆమాటా, ఇప్పుడు చెప్పినమాటా రెండూనిజమే. జాతివేరు. ధర్మం వేరు. మొదటిది—కేవలం దేశాచారానికీ లోకాచారానికీ సంబంధించింది, ఇప్పటి కాలానికి పనికి వచ్చేది. రెండోది—ఇహానికీ పరానికీ కూడా సంబంధించింది. అలా అని, ఒకటి ఒప్పుకుంటే రెండోది అంగీకరించినట్టు కాదు. జాతిని లక్ష్యపెట్టకపోతే దుఃఖం అనుభవించాల్సి వస్తుంది.

"హేమా!—రెండూ వేరువేరు విషయాలే అయినా, రెండింటికీ సంబంధముందీ. అంటే-దేశ భేదాన్ని బట్టి ధర్మంకూడా వేరవుతుంది. ధర్మానికి మూల విషయమేదైతే ఉందో, అది పరలోకానికి సంబంధించింది. "మరణమే చివరి మెట్టుకాదు" అన్నదే ఆ మూలసూత్రం. ముఖ్యమైన ఈ సిద్ధాంతం మీదనే నువు హిందూమతం లోనూ, నేను బ్రాహ్మమతంలోనూ నిలబడివున్నాం.

"ధర్మాలన్నీ ఈశ్వర సమ్మతమైనవే. అయినా, ఒక్క మరణం వల్లనే నిష్కృతి లభిస్తుందని ఆ ధర్మాలు చెప్పటం లేదు. ఈ విషయాన్ని నీగ్రోల దగ్గర్నించి లాప్ లాండ్ దేశస్థుల దాకా, అందరూ అంగీకరిస్తున్నారు.

"మరణానంతరం గురించి నువ్వూ ఆలోచిస్తావు, నేనూ ఆలోచిస్తాను, మనిద్దరి ఆలోచనలూ వేరు కావచ్చు. కాని ఆలోచనకు ఆధారభూతమైన మూలవిషయం ఒక్కటే. ఈ సంగతే బహుశా అమ్మ మరణకాలంలో చెప్పివుంటుంది"—అన్నాడు.

ఇదంతావిని, చాలాసేపటివరకు ఊరుకుంది హేమ. "ఉత్తనే ఆలోచించి ఊరు కుంటే ఏమవుతుంది? దానికి ఉపాయం కూడా ఆలోచించాలి" అన్నది. అందుకు గుణి మళ్ళీ చెప్పాడు. "అవునవును. ఉపాయమూ చెయ్యాలి. లేకపోతే ఎలా?— ఉపాయం కోసమేకదా ఇప్పుడు జరిగిన ఇంత|వాదమూ, ఇంత గందరగోళమున్నూ. అయితే నీ ఉపాయం నాకు నచ్చదు, నా ఉపాయం నువ్వు ఒప్పుకోవు. దీనికి ఆధారం అనుమానం ప్రమాణం కాని ప్రత్యక్ష ప్రమాణం కాదు. అలా అన్నంత మాత్రాన వివాదమూ అక్కడితో పోదు, రాద్ధాంతమూ పూర్తి కాదు. దీనిమాటకేం గాని—నీకింకా వంటవేళ కాలేదా, హేమా?"

మౌనంగా వెళ్ళిపోయింది హేమ. తలలో యోచనేదీ లేకుండా శూన్యం కేసి అలాగే చూస్తూ కూర్చున్నాడు, గుణి.

* * *

ఉన్నట్లే ఉండి "గుణిదా!" అని పిలుపు.

తృళ్ళిపడ్డాడు గుణేంద్రుడు. వెనక్కి తిరిగి చూశాడు. "హేమా!"—అంటూ పలకరించాడు.

"గుణీ!—సరేకాని, నేనేమార్గంలో అయితే నడుచుకుంటున్నానో, అది సరయిన మార్గమేనా?" అడిగింది.

"అది నీకే తెలియాలి గాని నేనేం చెప్పగలనూ? నువు అవలంబించిన మార్గంలో నీకు శాంతీ, ఆనందమూ లభిస్తోందా? అయితే, సరైనమార్గమేనన్నమాట."

''నాకు అలాంటి దేమీ కనబడటంలే'' దంది హేమ, దీనమయిన కంఠస్వరంతో. ఆ కంఠస్వరం వినేసరికి అశ్రువులు పొంగి పొర్లాయి గుణికి. అతికష్టం మీద వాటిని ఆపుకున్నాడు. ''మరయితే, అలా ఎందుకు చేస్తున్నావు?'' అనడిగాడు.

అందుకామె ఇలాజవాబు చెప్పింది—''నాకేం తెలుసు గుణిదా?—నన్నా మార్గం లోకి ఎవరో లాక్కుపోతున్నారు, బలవంతంగా. నిగ్రహించుకోలేక పోతున్నాను.'' ఈ మాట కేమనాలో గుణికి తోచలే. ''బహుశా, కొత్త గనుక దొరకలేదేమో. కాలం గడచినకొద్దీ లభించవచ్చు'' అని చెప్పాడు. ఉత్సాహంతో హేమ: లభిస్తుందా! నింజగా లభిస్తుందా?'' అని మళ్లీ అడిగింది.

''తప్పకుండా. శాంతీ, సుఖమూ అనేవి ధర్మంలో కాకపోతే మరెందులో లభిస్తాయి? ఏనాటికయినా ఒకనాడు నీకు పూర్తి సౌఖ్యం కలగాలని నేనాశీర్వదిస్తున్నా'' అని బదులుచెప్పాడు గుణి.

* * *

రెణ్ణాళ్ళ తరువాత ఒకరోజున—డాబామీద వెన్నెట్లో చిన్నచాప పరచుకొని గుణి పడుకునివున్నాడు. హేమ వచ్చింది. కాళ్ళదగ్గర కూర్చుంది. ''కాళ్లొత్తనా, గుణిదా?'' అనడిగింది.

''ఒత్తూ '' అంటూ అతడు కళ్లు మూసుకున్నాడు.

ఆ వెన్నెట్లో మెరిసిపోతున్న హేమ ముఖంకేసి సాహసించి చూళ్లేక పోయాడు. నిశ్శబ్దంగా కాళ్లొత్తుతూ ఒత్తుతూ, హఠాత్తుగా ఇలా అడిగింది: ''గుణిదా!—వితంతువు మళ్లీ పెళ్ళి చేసుకోవటం మంచిదేనా?''

కళ్ళు మూసుకునే వున్న గుణి ''అంటే, నీ వుద్దేశమేమిటీ? అని ప్రశ్నించాడు.

''నేను వచ్చింది చెప్పటానిక్కాదు, వినటానికి'' అనేసింది.

''ఓహో! అలానా?—అయితే, ఈ కాళ్లొత్తటం బహుశా దానికి ప్రస్తావిక కాబోలు!''

''ఉహూఁ—అదికాదు. నీ కాళ్ళ దగ్గిర కూర్చునే సరికి, నీపాదాలు ఒత్తాలెననే కుతూహలం కలుగుతూంది నాకు.'' మెదలక ఊరు కున్నాడు గుణి. అతని కాళ్ళ మీద ఒక చిన్న చిటికె వేసింది, హేమ. ''చెప్పవేం?''—

''చెబుతా గానీ, ముందు, నేనడిగేదానికి సమాధానం చెప్పూ.''

''ఏమిటీ?''

''సరేకాని—నువ్వు నీభర్తని ప్రేమిస్తూ ఉండేదానివా?''





"ఉహుఁ—లేదు. అసలీ సంగతి మనస్సుకి ఎన్నడూ తట్టనే లేదు. అక్కణ్ణించి ఒకపైసా విలువగల వస్తువు కూడా నాతో తెచ్చుకోలేదు. వారు నాకిచ్చిన చీర ఒక్కటీ కట్టుకురాలేదు. కడుపుకి తిన్నదానికి నాలుగింతలు ప్రతిఫల మిచ్చే వచ్చాను. అంతే. వారితో నాకున్న సంబంధం ఇదే," అన్నది.

"కానైతే—పతివ్రత అయిన స్త్రీ తన భర్తని ప్రేమిస్తుందిగా?—ఒకవేళ వితంతు కావలసిన యోగమే పడితే అతణ్ణే స్మరించుకుంటూ ఉంటుంది కానీ, మళ్లీ పెళ్ళి చేసుకుంటుందా?—అమ్మలాగా చచ్చేటంత వరకూ "నా భర్త దగ్గరికి వెళుతున్నా" అనుకుంటూ వుంటుంది," అని చెప్పాడు గుణి.

అందుకు హేమ—నన్ను మీరు బలవంతంగా కట్టి పట్టుకుని పెళ్ళి చేశారు. నేను పతివ్రతనే. అందుకనే "మరణ కాలంలో నీ దగ్గరికి వస్తాను." అన్నమాట స్మరించు కుంటాను. సరేకాని, గుణిదా!—నేను చచ్చిపోయాక నీదగ్గరికి రాగలనా?" అనడిగింది.

హేమ మాటల్లో కాస్తంతయినా సిగ్గులేదు, సంకోచం లేదు, జడత్వం అంత కన్నా లేదు. ఎవరి సంగతో ఎవరో చెప్పుకున్నట్టుంటుంది. ఆనాటి హేమకూ ఇప్పటి హేమకూ ఎక్కడా పోలికే లేదు. ఆమెప్రశ్నకు గుణి స్తబ్ధుడయినాడు.

"నీ దగ్గరికి రాగలనా లేనా, చెప్పూ—చెప్పన!" అంటూ తొందరపెట్టింది హేమ.

"రాలేవు" అన్నాడు. "ఎందుకనీ?" ప్రశ్నించింది హేమ. ఈ చిన్న ప్రశ్నకి గుణేంద్రుడు ఇలా వివరించి జవాబు చెప్పాడు: "నా కర్మఫలం నన్నెక్కడికి తీసుకు పోతుందో నాకూ తెలియదు, నీ కర్మఫలం నిన్నెక్కడికి తీసుకు పోతుందో నీకూ తెలియదు.

"నేను చేసుకున్న కర్మ చెడ్డ దయితే ఆదోషంవల్ల నేను పశు జన్మ ఎత్తవచ్చు. నువ్వు చేసుకున్న సుకృతం ఫలితంగా నువు మళ్లీ బ్రాహ్మణ కన్యగానే పుట్టుతా వేమో! అటువంటప్పుడు మనిద్దరికీ పొత్తూ, సంబంధమూ ఎలా కుదురుతుంది, హేమా!—కర్మఫలమే కనుక నిజమయితే, భార్యా భర్తలమధ్య నుండే చిరకాల సంబంధం యథార్థం కానేకాదు. మనం కల్పించుకున్న ఈ సంబంధం తుచ్ఛమైంది. మన కళ్ళ ఎదట ఎన్నెన్ని చూస్తున్నాం?—భేదాలూ, భిన్నత్వాలూ, ఎక్కువ తక్కువలు, ఇలాంటివి. అయితే—బహుశా ఇదే కాబోలు కర్మఫలం అంటే.

"కర్మ సిద్ధాంతాన్ని మరొక విధంగా చెబుతా, విను: మీ శాస్త్రాల్లో ఇలావుంది: ఈ లోకంలో పాషండులైనవారి భార్యలలో ఎంతోమంది పతివ్రత లున్నారు. వారి భర్తలు పాపఫలితంగా, చచ్చాక పశువులై జన్మించవచ్చు. అయితే—పతివ్రత అయిన స్త్రీ, తన జీవితమంతా చేసుకున్న సత్కర్మకు ఫలితంగా ఆ మగపశువుతో బాటు ఆడపశువై పుట్టి కలిసిఉండాలని కాంక్షిస్తుందా? ఇదేనా పాతివ్రత్యం—ఎవరి మాటో ఎందుకు, నీమట్టుకి నీ ఉద్దేశం చెప్పూ.

"హేమా!—అలా ఎన్నటికీ జరగదు. అలానే అయినట్టయితే ఇహ—మంచి పనికీ చెడ్డ పనికీ తేడా ఏమిటుంది? భార్య చేసుకున్న సత్కర్మ ఫలితంగా స్వర్గానికి వెళ్ళవచ్చు. పాపిష్ఠివాడయిన భర్త ఎన్ని జన్మలకైనా నరక యాతనలే అనుభవిస్తూ

ఉండనూవచ్చు. వెయ్యి పుటాలు పెడితేమటుకి, ఇద్దరూ ఒకటవటానికి సావకాశం ఎక్కడుంది, హేమా!——''

ఇదంతా శ్రద్ధగా విన్న హేమ, చాలాసేపు ఆలోచనలో పడి పూరుకుంది. తరువాత మళ్లీ మెల్లి మెల్లిగా సంశయాలు తీర్చుకోటానికి ఉద్యమించింది. ''అయితే, గుణీదా!——భార్యా భర్తలిద్దరూ మళ్లీ కలుసుకునే మార్గం నిజంగా లేదా? లేనట్టేనా——'' అనడిగింది.

మళ్ళీ జవాబు చెప్పాడు, గుణి.

''లేదు, హేమా!——ఉండాల్సిన అగత్యమూ లేదు, నువ్వు అవలంబించాల్సిన మార్గం——సన్మార్గం——నాకు తోచింది చెబుతున్నాను: ఏ కలయిక అన్నింటికన్నా ఎక్కువదీ? ఎవరి సన్నిధి చేరుకుంటే మరొకళ్ళ దగ్గరికి వెళ్ళాలనే వాంఛ కలక్కుండా వుంటుంది? దేనివల్ల సమస్త వాంఛలూ వాటంతటవి నమసి పోతాయి: అటువంటి దివ్యమైన సన్నిధిని కోరుకో. నీమార్గంనుంచి ఎవ్వరూ నిన్ను తప్పించకుండా ఉండా అని నేను మనసా వాచా ఆశీర్వదిస్తా. నీకు కలిగిన దుఃఖమంతా సార్ధకమయ్యేరోజు వస్తుంది.''

ఇలా చెబుతూ వుండగా గుణి రెండు నేత్రాల నుంచి అశ్రువులు జలజలమంటూ స్రవించాయి. వాటిని వెన్నెల వెలుగులో హేమ స్పష్టంగా చూడ గలిగింది. అతడి పాదాలమీద శిరస్సు ఆనించి, నమస్కరించి, మెల్లిగా లేచి వెళ్ళిపోయింది.

ఇంతకు పూర్వం కూడా, ఈ విధంగా పాదాలకు నమస్కరించి లేచి వెళ్ళటం ఎన్నో సార్లు జరిగింది. కానైతే, ఇవాళ అలా చెయ్యటంలో గుణేంద్రుడి రూపాన్నీ, అతడి ధైర్యాన్నీ సంపూర్ణంగా హరించి మరీ వెళ్ళింది. అతడికి మనసులో ఎన్నో రోజుల్నించి కనిపెట్టుకుని ఉన్న ఒక సదవకాశం ఇవాళ జారిపోతున్నట్టనిపించి, చాలా బాధ పడ్డాడు. చెయ్యి జాచి పట్టుకుందామా అనుకున్నాడు, పట్టుకోలేక పోయాడు. తనని హేమ ఎంతగా ప్రేమిస్తున్నదో గుణికి నిస్సంశయంగా తెలుసు. ఇవాళ ఆమె నోటి మీదుగానే స్పష్టంగా విన్నాడు. అయినా అతడు తన మనోగతాన్ని వెల్లడించటానికి సాహసించ లేకపోయాడు. సులోచన పోయినప్పట్నించీ ఈ ఉద్దేశం ''చెబుదాం చెబుదాం'' అనుకుంటూనే చెప్పలేక పోయాడు.

ఇంకిప్పుడు——ఈక్షణం నించీ ఒక కొత్తభావం అతని మనస్సులో ప్రవేశించింది: తన ఎదట నున్నది కాలసర్పం, కొంపతీసి చెయ్యిజాచి తాకినట్టయితే పడగ విప్పి బుస్సుమని బుసకొడుతుందేమో అనిపించింది. అందుచేత ఇన్నాళ్ళుగా ఏభయం వల్ల




తన చెయ్యి ముడుచుకుని వుందో, ఆ భయంవల్లనే ఇవాళకూడా ఆ చేతిని బయటికి చాచలేకపోయాడు.

*　　　　*　　　　*

హేమ రోజూ ఉదయానే స్నానంచేసుకుని, అతడికి నమస్కరించటానికని వస్తుంటుంది. మర్నాడు ఆమె అలానే వచ్చింది. ఆమె రాగానే, గుణి ఇవాళ సంకోచాలన్నీ దూరంగా నెట్టివేసి, అడిగాడు: "నిన్న నువ్వు వితంతు సమస్య గురించి ప్రసంగం తెచ్చావెందుకు హేమా?"

"ఈసంగతి ఒక పత్రికలో చదివా. అందుకని—"

"అయితే—అది మంచిదనే అనుకుంటున్నావా నువ్వు?"

"ఛ!—మళ్ళీ ఇంకోపెళ్ళేమిటీ?" అంది ఒక్కముక్కలో.

"ఏం, ఎందుక్కూడదూ? ఒక్క హిందువుల్లో తప్ప ప్రపంచంలో అన్నిజాతుల వారిలోనూ ఈ విధవా వివాహా లున్నాయే?"

"ఉంటే ఉండనిద్దూ" అంటూ పోబోయింది, హేమ.

గుణి ఆమెను వెనక్కిపిలిచి, "మరొక్కమాట!"—అన్నాడు.

"ఏమిటి?" అనడిగింది, వెనక్కి తిరిగి నించుని.

"అవున్లే. నీవయస్సెంత?"

''పదహారేళ్లు.''

''ఈ పిన్నవయస్సునించే సన్యాసినివై పోతావా?''

''ఏంచేస్తాను మరి? నారాత ఎలాఉందో—మీ కలాటి బుద్ధి కలిగింది.'' అన్నది. ఒక్కక్షణం ఆమె ముఖంకేసి చూస్తూ ఊరుకున్నాడు, గుణి. ''మరో ఉపాయం గాని, వేరే దారిగాని లేదా?'' అంటూ ప్రశ్న వేశాడు.

''ఏమీలేదు, గుణీదా!—గత్యంతరం లేదు,'' అనిచెప్పి వెళ్ళిపోయింది. రోజు రోజుకీ ఆమె సర్వ అవయవాల్లోనూ యౌవనం పరివ్యాప్తమవుతోంది. అయితే, ఆమె అవలంబించే ధర్మకృత్యాల చాటున ఆ యౌవనం మరుగుపడుతూ వచ్చింది. ఈ మార్పులన్నీ గమనిస్తూనే వున్నాడు, గుణి. కాని, ఏమనటానికీ సాహసం లేక పోతూంది. హేమను చూడగానే అందరూ లోలోపల భయపడే యంత్రమేదో ఆమెలో వుంది. ఆ మాటకొస్తే—ఆమె అంటే వాళ్లమ్మే భయపడేది. అలాగే ఇప్పుడు గుణికూడా భయం పట్టుకుంది. కొన్నాళ్లు గడిచాయి.

* * *

ఒకనాడు—కోర్టుకి వెళ్ళబోతున్నాడు, గుణి.

హేమ వచ్చింది. బీరువా తెరచింది. చెక్‌బుక్కు తీసింది. అతడిచేతికిచ్చి, ''వచ్చేటప్పుడు ఓ అయిదు వందలు పట్టుకురా,'' అంది. సరేలెమ్మని ఆ చెక్‌బుక్కు జేబులో పెట్టుకున్నాడు, గుణి. ఆగమంది. ఇంటిఖర్చుకూడా సరిపడా లేదు.. కనుక మరో రెండువందలు కూడా తెమ్మంది.

గుణి, మరి, ఆ అయిదు వందలూ దేనికి?'' అని అడిగాడు ఆశ్చర్యంతో.

''అదా! నేను రేపు కాశీ వెళ్లా'' లని చెప్పింది.

మంచంమీద కూలబడ్డాడు, గుణి. రేపు .కాశీ వెళతావా?—ఎవరి సలహా అవసరం లేదా?'' అడిగాడు. నీ ఆజ్ఞ తీసుకున్నాకే వెళ్ళటం'' అంది హేమ, తెల్లబోయి. ''అన్నీ సిద్ధం చేసుకున్నావ్, రేపు వెళ్లబోతున్నావ్, ఇంక అనుమతి తీసుకునే దెప్పుడు?—పోనీలే. కూడా ఎవరు వస్తారు?'' అనడిగాడు, గుణి.

''నందా, మానదా, దర్వానూ వస్తారు. ఇవాళ రాత్రిరికి నీతో చెబుదామను కుంటున్నాను. రేపు వెళ్లేదా, గుణిదా?'' ''సరే, వెళ్లు'' అంటూ కోర్టుకెళ్ళిపోయాడు గుణి. సాయంకాలం—పైకం పెట్టెలో పెట్టి తాళం వేసింది హేమ. గుణివద్దకు వచ్చింది: ''రేపు వెళ్ళటం కుదరదు'' అన్నది. ''ఏం?''—

"వంటమనిషి తల్లికి సీరియస్‌గా వుందని మధ్యాన్నం వైరొచ్చింది. మూడునెల్ల జీతమిచ్చి అతన్ని వెళ్ళమన్నా." "మరి, వంట ఎలా?"

"మళ్ళీమనిషి కుదిరేదాకా నేనే. అవును గాని, గుణీదా!—నువ్వు పెళ్ళిచేసుకో గూడదూ?" అనడిగింది.

"ఎందుకూ?"

"ఎందుకేమిటీ?—పెళ్లాడకపోతే ఇల్లు చక్కబెట్టేదెవరు, నీ గొడవ చూసే దెవరు?"

"నువ్వే!"—

నవ్వింది హేమ. "నేనీయింటోనే పాతుక్కూర్చుంటా ననుకున్నావా, శాశ్వతంగా? నాకింక వేరే పనీ పాటూ లేదనుకున్నావా?" అనడిగింది.

"నన్ను కనిపెట్టుకు నుండటం పనికాదుకాబోలు?" ప్రశ్నించాడు గుణి.

"నీతో నే వాదించలేను, గుణీ!—ఉహుఁ అలా జరగటానికి వీల్లేదు. మీ బ్రాహ్మ మతస్థుల్లో ఎదిగిన పిల్లలు పెద్దపెద్ద వాళ్లు దొరుకుతారు. ఎక్కడయినా ఒక పిల్లని వెతికిపట్టి తెచ్చుకో. ఈ సంసారం ఆ అమ్మాయికి అప్పగించేసి, నేను కాశీ వెళతా" అని చెప్పింది. హేమ, నవ్వుతూ.

"సరే, నువ్వూ పెళ్లిచేసుకుంటే—నేనూచేసుకుంటా," అన్నాడు, గుణి.

ఇప్పటిదాకా నవ్వుతూనే మాటాడింది హేమ. క్షణంలో ఆమె నవ్వంతా ఎగిరి పోయింది.

"ఛ!—ఇదేం పరిహాసమా, గుణిదా? ఇలాంటి మాట నాలిక చివరి నించైనా ఎన్నడూ రానివ్వబోక!" అంది. మరేం మాటాడలేక గుణేంద్రుడు ఆమె ముఖంకేసి చూస్తూ కూర్చుండిపోయాడు. హేమ అక్కణ్ణించి లేచి వెళ్ళిపోయింది.

## 6

హేమ కాశీలో రెండు నెలలుంది. గుణికి జబ్బుగా వుందని తెలియగానే ఇంటికి మళ్ళీ తిరిగి వచ్చేసింది. ఆమె రాబట్టిగాని, లేకపోతే గుణేంద్రుడి సంగతే మయ్యేదో! హేమవచ్చి, ఉపచారాలు మొదలు పెట్టి కొద్దిరోజులకల్లా అతడి ఆరోగ్యం కుదుటపడేట్టు చెయ్యగలిగింది.

బయట జోరున వర్షం. మంచంమీద కూర్చుని కిటికీల్లోంచి ఆ వర్షాన్ని చూస్తూన్న గుణి, హేమను గురించే మనస్సులో ఆలోచిస్తున్నాడు. అతనికి ఒక్క మార్పుమట్టుకు కనిపించిం దామెలో. మొదట్లో, రోజూపొద్దున్నే గుణేంద్రుడికి నమస్కరించటానికని




వచ్చేది, కాని ఈసారి అలా రావటంలే. అంటే మానేసిందన్న మాట ఇప్పుడు. మానదాని పిలిచాడు, గుణి. హేమను పిలుచుకురమ్మని పంపాడు. మానదా తిరిగివచ్చి ''అమ్మాయిగారు జపంలో ఉన్నా'' రంది. రెండు గంటలసేపు తరవాత గదిలోకి వచ్చింది హేమ. ''నన్ను పిలిచావట?''

''అవును, ఒక్క నిముషం అలా కూర్చో.''

''కూర్చుంటాలే. కాని, నా జపం పూర్తికాలే.''

''రెండుగంటల సేపయినా ఇంకా పూర్తికాలే?''

''రెండు గంటల్లో ఏమిటవుతుంది? కనీసం రెండు వేలయినా చెయ్యమని చెప్పారు. గురువుగారు.''

''అలాగా? ఎవరా గురువుగారూ?''

''ఆయన కాశీలో ఒక సన్యాసి. ఆహా!—దివ్యమంగళ మూర్తి!! ఆయన్ని ఒక్కసారి చూస్తే మళ్ళీ సంసార కూపంలోకి దిగగలమా? ఆ ఇచ్ఛే కలగదు ఏకోశానా. మళ్ళీ ఆమహానుభావుడి పాద దర్శనం ఎప్పుడు లభిస్తుందో కదా!—మళ్ళీ రేపటెల్లుండిలో వెళదామనుంది.''

''రేపటెల్లుండిలో ఎలావెళతావు హేమా! నేనీస్థితిలో వున్నాను, ఆరోగ్యం సరిగ్గా కోలుకోలేదు, నన్నెవరు చూస్తారూ?'' అన్నాడు. ''అబ్బే, అలా అనుకోకు. రెండు

రోజుల్లో నయమైపోతుందిగా, ఖులాసాగా వుంటావ్, ఎందుకు బెంగ?'' అని ధైర్యం చెప్పింది హేమ.

''పోనీ, ఈ రెండు రోజులు దాకానయినా ఉండు హేమా, నువ్వు.''

''అలాగే వుంటానులే.'' అంటూ వెళ్ళిపోబోయింది. ఆమెను వెనక్కి పిలిచాడు గుణి. ''అవునుగాని, రేపో, ఎల్లుండో వెళితే, మళ్ళీ ఎన్నాళ్ళకొస్తావ్ ఈ సారి? అనడిగాడు. ఈ మాటు వెళితే బహుశా మళ్ళీ ఇప్పట్లో రానని చెప్పింది హేమ, నెలకో వంద రూపాయలు తనకు పంపిస్తే గడిచి పోతుందనీ, అంతకు తక్కువయితే కాలక్షేపం జరగటం కష్టమనీ కూడా అన్నది.

డబ్బు సంగతికేం? వందకాదు, రెండువందలు కావాలన్నా తప్పక పంపిస్తానని అభయ మిచ్చాడు, గుణి. నువు నిజంగా తిరిగి రావా?'' అంటూ దీనంగా అడిగాడు.

''ఎందుకు మళ్ళీ రావటం?'' ''ఒకవేళ నేను పోయానని తెలిస్తే, అప్పుడయినా వస్తావా?''

''అవేం మాటలు, గుణీదా!''

''ఏ క్షణమందు ఏంజరగనుందో ఏం చెప్పగలం హేమా! అంచేత, ఈ మాత్రం తెలివిలో ఉండగానే ముందే చెప్పివుంచటం మంచిది కదా. నీకు డబ్బివ్వాలన్న సంగతి నా వీలునామాలో రాస్తాను. ఈ ఇల్లుకూడా నీ పేరనే వుంటుంది. ఒకవేళ నువ్వెప్పుడయినా ఇక్కడికి వస్తే, ఈగదిలోనే పడుకో. ఇదే నాకోరిక,'' అని చెప్పాడు.

ఏదో చెప్పబోయింది హేమ, కాని ఆ మాట మింగేసింది. ''చెబుతున్నాగా గుణీదా!—నీకేం భయంలేదు. ఇప్పుడు వంటో బాగాలేకనే ఇలాటి పిచ్చి ఆలోచన లన్నీ వస్తున్నాయి'' అంది. ''అయివుండొచ్చు'' అనేసి, అతడు బయట వర్షం కేసి చూస్తున్నాడు మళ్ళీ. విచారంతో వెళ్ళిపోయింది, హేమ.

* * *

''నందా!—కటిక చీకటిగా వుందికదా, బాబుగారి గదిలో దీపం పెట్టలేదేం?'' అంటూ, హేమ నవుకర్ని కోప్పడింది. గదిలోనించి గుణి ''నేనే వొద్దన్నాను,'' అని చెప్పాడు. నందుడు దీపం వెలిగించుకొచ్చే లోపలే, ఆ చీకటిలో చొరబడి హేమ గుణి కాళ్ళదగ్గర కెళ్ళి కూర్చుంది. ఆమె గుణి కాళ్ళమీద చెయ్యి వెయ్యగానే ఆతడు వెనక్కి ముడిచేసుకున్నాడు.

''అయితే—ఇహ నువ్వు నన్ను కాళ్ళయినా ముట్టుకో నివ్వవా?''—అనడిగింది తీరని బాధతో, హేమ. ''అంత అవసరమేముంది, హేమా! ఒకవేళ, ఈ పని కూడదు అని నిషేధించారేమో మీ గురువుగారు?'' అన్నాడు.

తను కాశీనించి వచ్చాక పాదాభివందనం చెయ్యటంలేదని చెప్పి గుణి ఇలా అని వుంటాడని వెంటనే గ్రహించింది హేమ. అయితే ఈ మాట పైకి అనలేదు. తన పైన అతడు కోపం తెచ్చుకున్నాడేమో ననుకుంది. కాని అలాటి దేమీ లేదన్నాడు. అనేసరికి ఆమె పశ్చాత్తాప పడి, ''మరయితే ఇవాళ ఆ సంగతులన్నీ ఎందుకు మాటాడావ్?'' అనడిగింది. ఆ సంగతులంటే డబ్బు పంపటం, వీలు రాయటం అవ్వీని.

''నే చెబుతున్నా కదా, నా మాటనమ్ము. చప్పున నీకు నయమవుతుంది, మరేం భయపడకు'' అంటూ మళ్ళీ ధైర్యం చెప్పింది.

''నయంకాదని భయపడ్డా ననుకున్నావా?'' అని గుణి అనేసరికి, వెక్కి వెక్కి ఏడ్చింది హేమ. ''నీ కాళ్లమీద పడతా. అలాంటి మాటలన్నీ అనకు, గుణిదా!—నీకు నయం కాకపోతే నే నెలా బతగ్గలనూ?'' అంది.

''నువ్వెళ్లిపోతే నేను మాత్రం ఎలా బతగ్గలనూ? నిన్ను వెళ్లనియ్యకుండా పట్టు కుంటేనో?'' అన్నాడు గుణి. ''నీకేం లాభం?'' అన్నది హేమ.

''లాభమా!'' అంటూ గుణి, మరిమాటాడ లేకపోయాడు. అలానే కూర్చున్నాడు. వర్షపు జల్లు కిటికీమీదికి కొడుతూంది, బయటి నించి. తలుపు తెరిచివుండటం మూలాన, ఒక్కొక్కసారి ఆ గాలివిసురు లోపలికి వచ్చి మంచం ప్రక్కన ఉండే దీపాన్ని కాస్తా ఆర్పేస్తుందా అని కూడా అనిపించింది. కింద నవుకర్లు చేసే గందరగోళం అస్పష్టంగా వినిపిస్తూంది. ఈ స్థితిలో కూడా ఇద్దరూ కదలకుండా అలానే నిశ్చలంగా కూర్చున్నారు.

చిన్నప్పటినించీ గుణేంద్రుడికి మంచి నిగ్రహముంది, అభిమానముంది. ధైర్యాన్ని ఎంతగానో చిక్కబట్టుకు వస్తున్న ప్రజ్ఞావంతుడు. ఇంత ఇదిగావున్నా, సులోచన నుండి కడపటి ఆశీర్వాదం పొందినప్పటినించీ ఆధైర్యమనే గొప్ప శక్తికి తూట్లు పడ్డాయి. ఆ రంధ్రాలలోనించి పాతాళగంగ పరవళ్ళు తొక్కుతూ సుడిగుండాలు తిరుగుతున్నట్టయింది. ఆ ధైర్య శక్తి హఠాత్తుగా ఏ క్షణాన విరుచుకు పడుతుందో ఆ సంగతి అతడికే తెలియదు.




బాహ్య ప్రకృతి అంతా ఎటుచూసినా పిచ్చెత్తించే పరిస్థితులతో నిండివుంది. కాని గుణేంద్రుడు ఆ ప్రకృతివేపే దీక్షగా చూస్తూ, తొలినుండి తుదివరకూ ఇప్పటిదాకా జరిగిన సంఘటనలే నెమరువేస్తూ కూర్చున్నాడు.

అయితే—రుగ్మతతో పీడితమయింది శరీరం, మెదడు దుర్బలమై పోయింది. ఏ విషయం ఆలోచిద్దామన్నా మెదడు పనిచెయ్యటం మానేసింది. అందుచేత అతడొక నిశ్చయానికి రాలేకపోతున్నాడు.

* * *

ఉన్నట్టే ఉండి, హేమ—"మెదలకుండా కూర్చున్నావేం గుణీదా!—ఏమిటాలోచిస్తున్నావ్?" అని ప్రశ్నించింది.

అందుకు గుణి ఇలా అన్నాడు: "ఏంలేదు, ఏంలేదు. నా విషయం నీకు చెప్పేది కాదు. చెప్పినా గ్రహించలేవు. ఏనాటికయినా నీ మనస్సు మారితే, అప్పటికి నేనింకా బతికివుంటే మాత్రం, ఒక్కమాటు రా."

కా స్త సర్దుకు సరిగ్గా కూర్చుంది హేమ. "అన్నీ గ్రహించా. ఎవడు రక్షించాడో వాడే భక్షిద్దామని చూస్తున్నాడే; ప్రారబ్ధం!—చూడగా, చివరికి నన్ను దుర్గతికి లాగా లని చూస్తున్నావా!" అన్నది.

ఇప్పటిదాకా పెద్దదిండుని ఆనుకుని కూర్చున్న గుణి లేచాడు, సరీగ్గా కూర్చున్నాడు. అతడి కళ్ళు నిప్పులు చెరుగుతున్నాయి.

"ఛ!—ఏమిటి నువు గ్రహించింది, చెప్పు హేమా!" అన్నాడు.

మెరుపు మెరిసినట్టు చటుక్కున లేచి నించుంది, హేమ. అంతా గ్రహించే నే మాటాడుతున్నా. ఏ విషయమైతే నువు చిలవలు పలవలు పెట్టి, అటు తిప్పి, ఇటు తిప్పి మళ్లించి, డొంక తిరుగుడుగా చెబుతున్నావో, అదే నేను స్పష్టంగా—పసి వాళ్లకూడా తెలిసేట్టు నీ యెదుట చెబుతున్నాను.—

ధర్మపథమంటే ఏమిటో తెలుసుకున్నాను. తెలుసుకునీ కూడా అధర్మ పథం కేసి మళ్లేటంత అజ్ఞానురాలినికాను. నువ్వు నన్ను భ్రష్టురాల్ని చెయ్యాలని చూస్తున్నావు. లేకపోతే విధవకు మళ్లీ పెళ్లేమిటి, గుణీదా?—

"నాకు నీ డబ్బూవద్దు, ఆశ్రయమూ వద్దు, ఏమీ వద్దు. నాకీ ఐశ్వర్యంతో పని లేదు. ఎక్కణ్ణించి అయితే నే వచ్చానో, మళ్లీ నేను నా అత్తారింటికే పోతా. అక్కడ దాసీపని చేసుకు బతికినా నాకు గౌరవమే "

కదలక మెదలక కూర్చునివున్న గుణి—"అయిందేదో అయింది, నా తప్పు క్షమించు హేమా!—నేను రోగిష్టివాడినన్న సంగతి కూడా కాస్త ఆలోచించు!" అన్నాడు.

"ఆలోచించా. ఇవాళకాదు, రెండు రోజులు పోయాక నిన్ను క్షమిస్తా. ఇక నీతో సంబంధం వద్దు నాకు. అహంభావంతో గర్విష్ఠినై ఎక్కడనుంచి తిరిగివచ్చానో, అక్కడికి రేపే వెళ్లిపోతా. ఎలా గడిచినా బందిలేదు, అక్కడే పడివుంటా. అదే నాకు కాశీ, అదే వైకుంఠం. నువ్వూ నన్ను క్షమించు, గుణిదా! నేను వెళతా," అని చెప్పింది.

వెళ్ళిపోయింది హేమ.

పిడుగుపడ్డ తాటి చెట్టులా అస్థిపంజరంగా అలాగే కూర్చున్నాడు గుణేంద్రుడు. అతడి కిప్పుడు పడుకుందామంటే ఆపాటి కూడా శక్తిలేదు.



## 7

దసరా పండగ, పుణ్యకాలం. లోకంలో అంతా ఎంతగానో సరదాగా వుండే శుభ సమయం. హేమ మట్టుకు సంతోషంగా లేదు. చీకటిలో లేచింది. కిటికీ తలుపు తెరిచింది. తూర్పుదిక్కున ప్రసరించే అరుణకాంతులు చూస్తూ నించుంది.

అలా నించునివున్న హేమ కళ్లవెంట, ఆమెకు తెలియకుండానే అశ్రువులు కాలవగా ప్రవహిస్తున్నాయి. ఇప్పుడు హేమ మనస్సులో ఎన్నెన్ని ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయో, మానసికమైన బాధలు ఎన్నెన్ని ఆమెను దహించేస్తున్నాయో, తనని పుట్టించిన ఆ దేవుడికే తెలియాలి!—

*   *   *

గుణేంద్రుడి కబుర్లు తెలిసి ఎన్నాళ్లయింది!—మా గుణీదా ఎక్కడున్నాడో, ఎలా వున్నాడో కదా!—తనిక్కడికి బయల్దేరి వచ్చేటప్పుడు గుణీదా ఏడుస్తూ అన్నాడు: "హేమా, ఇంకా రెండు రోజులుండు, హేమా! కోపంవద్దు, వెళ్లిపోకు!"

అంతగా అభిమానపడిన అతడి కన్నీటికి ఆనాడు కాస్తంతయినా విలువ ఇవ్వలేదు, హేమ.

జబ్బుతో తీసుకుంటూ, బలహీనంగా వుండి నడవ శక్తిలేక పోయినా, రోడ్డు చాలా వచ్చాడు, అనాడు. "హేమా, నీ మనస్సు ఇప్పుడేం సరిగాలేదు. కాలం ఏమయితేనేం, మారిపోయింది. కనుక వెనక్కి తిరిగి వచ్చెయ్యి. ఒక్కరోజయినా ఉండు హేమా!" అని బతిమలాడాడు, గుణి. ఇందులో ఒక్క మాటయినా ఆమె వినిపించుకుంటేగా?—చెవిని పెట్టకుండానే బండిలో ఎక్కి కూర్చుంది. లేని ఓపిక తెచ్చుకుని బండీ దాకా వచ్చాడు గుణి. కడాపటి ప్రార్థనగా "నా కోసమని చెప్పటం లేదు, హేమా! నీ కోసమే చెబుతున్నా, విను. ఈ సంఘటన నీ మనస్సుకి శాశ్వతంగా గుచ్చుకుపోతుంది, తెలుసుకో. రా. ఇవాళ్టికి బండీ దిగి రా," అంటూ ప్రాధేయపడ్డాడు. దీనికి హేమ సమాధానమేమిటో తెలుసా?—"పోనియ్యవోయ్!—" అని బండీవాణ్ణి వేగిర పెట్టింది.

ఇటువంటి సందర్భాలెన్నో తలపుకి వచ్చాయి. హేమ వెనక్కి తిరిగి వచ్చి, పక్కమీద పడుకుంది. ఎంతోసేపు ఏడ్చింది ఏడ్చింది. కన్నీళ్లతో జుట్టంతా తడిసి ముద్ద అయేటంతవరకూ యేడ్చింది. చివరికి అలసటవల్ల నిద్దరోయింది!—

* * *

ఈ దుఃఖం అంతటితో ఆగలేదు. ఏమంటే, ఇందుకు మరి అనేక కారణాలు తోడైనాయి. నిన్ననే జరిగిన ఒక చిన్న సందర్భం :

హేమ తీర్థయాత్రకు వెళదామనుకుంది. గుమాస్తాదగ్గరి కెళ్ళి ఒక యాభై రూపాయిలు పట్టుకు రమ్మని దాసీదాన్ని పంపించింది. గుమాస్తా అన్నాడు గదా—"చిన్న బాబుగారి హుకుం లేందీ పైసాకూడా ఇవ్వటానికి వీల్లేదు" అని చెప్పి తిప్పి పంపేశాడు, దాసీదాన్ని.

మరిదితో ఎప్పుడూ మాటాడ్డం అలవాటు లేదు హేమకు. కనుక అవేళ చాటున నించుని, "నేను కబురు చేస్తే యాభై రూపాయ లివ్వటానికి గుమాస్తాకి వీల్లేక పోయిందా?" అనడిగింది.

అందుకతడు "వీల్లేదు, నువ్విక్కడ భోంచెయ్యటంవరకే హక్కుంది. డబ్బు తీసుకోటానికేం అధికారం లేదు" అని ఖచ్చితంగా సమాధానం చెప్పాడు.

"సరే—నాకే అధికారముందో, ఏదిలేదో తెలుసు నాకు. ఇదుగో ఇదే చెప్పటం-నాతోగాని విరోధం పెట్టుకున్నావంటే, నీ యిల్లూ, గిల్లూ గంగలో కలపటానికి క్షణం సేపు పట్టదు. తెలుసుకో!—" అని హెచ్చరించింది హేమ.

కాస్సేపట్లో ఆమెముందుకు డబ్బు వచ్చింది. ఆ డబ్బు విసిరిపుచ్చుకు నడివాకిట్లోకి గిరాటేసింది. గదిలోకి వచ్చింది. తలుపులు బిడాయించుకు పడుకుంది. ఆ రోజల్లా




షస్తు, కటిక ఉపవాసం!—లేవనేలేదు. మనస్సులో లోలోపల ఎవర్నో తలుచుకు తలుచుకు ఏడుస్తోంది.

సాయంత్రం ఏడయింది. మెలకువొచ్చి లేచి, స్నానం చేసుకుంది, జపంలో కూర్చుంది.

* * *

అంతలో దాసీది వచ్చి—''అమ్మగారూ!—మీ అన్నగారింటినించిటండీ, నలుగురైదుగురు వచ్చారు!'' అని అంటూండగానే, మానదా వచ్చి హేమకు నమస్కరించింది. హేమ ఒక్కమాటు ఆమె ముఖం కేసి చూసింది. అన్నీమరిచిపోయి పరుగెత్తుకుంటూ వచ్చింది. మానదా మెడ కౌగలించుకుని, పసిపిల్లలా ఏడవటం మొదలెట్టింది.

నిన్నటి నుంచీ హేమ కంటి తడి ఆరనేలేదు. ఇవాళ మానదా హఠాత్తుగా వచ్చి కంటబడేసరికి, సుమారు సంవత్సరంనించీ అణిగివున్న అశ్రుధారలు కట్ట తెంచుకు ప్రవహించినట్టయింది. మానదాను తన గదిలోకి లాక్కుపోయింది హేమ. ''గుణి నాకురాసిచ్చిన ఉత్తరం ఇలా ఇవ్వు'' అని తొందరపెట్టింది, తగని ఆత్రంతో.

''ఉత్తరమేం ఇవ్వలేదమ్మా'' అన్నది మానదా.

''ఇవ్వలేదూ!'' మళ్లీ అడిగింది హేమ.

''లేదు తల్లీ! అసలాయన లేవగల్గుతే కదా, ఉత్తరం రాయటానికీ?'' అంది.

''లేవటంలేదా? ఏం?'' అనడిగింది హేమ ఆశ్చర్యంగా.

''ఏం చెప్పను తల్లీ!'' అంటూ ఏడ్చింది మానదా.

"తరువాత ఏడుద్దువుగాని, ఏం జరిగిందో చెప్పవే, ముందు!—" అని వేగిర పెట్టింది, హేమ.

ఏడుస్తూనే చెప్పింది, మానద:—

ఏంచెప్ప మంటారమ్మా, మీరు వచ్చేశారు కదా, ఇక్కడికి. ఆ మర్నాడే ఆయనకి జ్వరం మొచ్చింది. తగ్గుతూ తగ్గుతూ ఉండటం, మళ్ళీ తిరగబెట్టటం—మళ్లీ నేనింటికి వెళ్లేటప్పటికి ఆయన ఎలా వుంటారో, ఆయన్ని చూడగలనో లేదో, నమ్మకం చాలకుండా వుంది.

"తరవాత....?"

"తరవాత—ఈ సంగతి తెలియగానే వర్ధమాన్‌నించో ఎక్కడినించో గాని పినతల్లి వచ్చింది. ఆ తరవాత ఆవిడ భర్తా, కొడుకూ, కూతురూ, అల్లుడూ ఒక్కొక్కరే అంతా దిగారు. ఇహ రావాల్సిన వారంటూ లేరు. ఇల్లంతా ఈ పటాలంతో కిటకిటలాడిపోతూంది, తల్లీ!—"

"హాఁ! సరి. తరవాత?—" అడిగింది, హేమ.

"తరవాత ఏముందమ్మా!—ఈ ముఠా అంతా అయినకాడికి మొక్కడం, కూర్చోటం, ఇష్టారాజ్యంగా డబ్బు తగలెయ్యడం!—వీళ్లిలా తందనా లాడుతుంటే బాబుగారు మేడమీద ఒక్కరూ పడివుండటం!—ఒక డాక్టరు లేడు, మందులేదు, మాకు లేదు—పథ్యంలేదు, పానంలేదు.—ఎవళ్లూ ఆయన మొహం చూసేది? గాలి మారిస్తే నయమవు తుందన్నారు. స్థలం మార్చి తీసుకెళ్లే దెవరూ?"

"మీరంతా చేసే పనేమిటి? నందుడేం చేస్తున్నాడూ? వాడు తీసుకెళ్ళలా?"

నెత్తీనోరూ కొట్టుకుని చెప్పింది, మానద. "నందు దెవరనుకున్నారమ్మా! బాబుగారిదగ్గర మొదట్నించీ కనిపెట్టుకునున్న నవుకరు. అలాంటివాణ్ణి ఇప్పుడొచ్చిన ఆ పినతండ్రి కొడుకు—అభయబాబుట!—తన్ని తగిలేశాడు. ఈ అభయబాబు సంగతేమిటను కున్నారు?—రోజూ తాగుడు, ఒక్కొక్కనాడు తాగొచ్చి ఇంట్లోనే గందరగోళం చేస్తాడు. అంతా ఝడుసుకుంటారు. ఒక్కళ్ళూ బయటికి రారు. అతగాడంటే బాబుగారి కూడా భయమే!" అని చెప్పింది.

"అయితే ఒక్కమాట నిజంచెప్పూమనూ!—మా గుణీదా బతకడంటావా!!—"

"ఎందుకు బతకరు తల్లీ!—మీరు రాండీ, ఆయన్ని కాస్త కనిపెట్టండీ, తప్పక బతుకుతారు—కా........నీ........గాలికి వదిలేసి, అలా పడేసి వుంచితే ఇంక బతికే దేమిటీ?" అని చెప్పి దుఃఖించింది.



రెండు నిమిషాలు కళ్లు మూసుకుని ఆలోచించింది హేమ. లేచి నిలబడింది. "మనూ!— నీ దగ్గర డబ్బుందా, తిరిగి వెళ్ళటానికీ?—" అనడిగింది.

"మీకు తెలియదా అమ్మా!—నా దగ్గర డబ్బు లేకపోవడమేమిటీ? ఒక్క రూపాయితో ఎక్కడికన్నా వెళ్ళాలంటే, పది రూపాయ లిచ్చి పంపుతారు, బాబు. అదీ గాక, నాదగ్గిర చార్జీలకు సరిపడా వుంది" అని చెప్పి, చెంగున కట్టుకున్న డబ్బు చూపించింది, మనూ.

"ఎప్పుడు మనం వెళ్ళటం, రేపా?—"

"అవును; రేపే వెళ్లాలి. ప్రస్తుతం బాబుగారి దగ్గరున్న వాళ్లలో పాతదాన్ని నే నొక్కత్తెనే, తక్కిన వాళ్లంతా కొత్తవాళ్లేనాయెను. అమ్మో, రాకసి మూక! వాళ్ళదగ్గర ఎవళ్లూ నిలవలేరు. పినతల్లి ఓ భద్రకాళి అనుకుంటే, ఆవిడ మొగుడూ అలాంటివాడే. వాడ్ని మించిపోయిన పైచేతులు కొడుకూ కోడలున్నూ. వీళ్లందర్నీ ఒకే మూసలో పోసి సృష్టించినట్టుంది ఆ బ్రహ్మదేవుడు. నే నో మొండి ఘటాన్ని గనక, వాళ్లదగ్గిర ఎలాగో నిలబడి నెట్టుకొస్తున్నా. ఆ అభయబాబు ఓనాడు బాబు గారితో—"ఇది చస్తేగాని మనం బతకలేం!" అని చెప్పి, నన్నే కొట్టొచ్చాడు!—"

హేమ కళ్లలో నిప్పులు రగుల్తున్నాయి. "ముందు, పద. ఇవాళ స్టీమరు అందుకో గలమా?"

"ఇంకో గంటకల్లా బయల్దేరుతుంది. నే వచ్చేటప్పుడు రేవుదగ్గిర కనుక్కునే వచ్చా" నన్నది, మానద. హేమ చెప్పగా, ఆమె బండీ పిల్చుకు వచ్చింది.

* * *

అపరాహ్ణ వేళ. దగ్గరే కూచ్చుని తల్లి ఉభయబాబుకి వడ్డిస్తూంది. "ఇంకొక్క రెండు పూరీలు తినరా నాయనా!" అని బలవంతం చేస్తూంది. ఆ పక్కనే మేడ మెట్లు. కొత్తగా వచ్చిన హేమనుచూచి ఆశ్చర్యపోయింది. "ఎవరమ్మాయ్ నువ్వు?" అనడిగింది.

"మాది యీవూరు కాదులెండి" అంటూనే పైకి వెళ్ళిపోయింది, హేమ. నోరుతెరుచుకున్న పెద్దపులిలా ఆమెకేసి చూస్తూ కూచున్నాడు, ఉభయబాబు.

* * *

తిన్నగా గుణేంద్రుడి గదిలోకి వెళ్లింది హేమ. చూచేసరికి, అతడు గోడవేపు ముఖం పెట్టుకుని పడుకున్నాడు. మెలకువతో ఉన్నాడో, నిద్రలో ఉన్నాడో తెలీదు. తలాపు దిక్కున తాళంచెవుల గుత్తి పడివుంది. ఆ గుత్తి తీసుకుంది ముందు, చెంగున కట్టుకుంది.

ఒక టేబిల్ మీద రెండో మూడో మందు సీసాలు ఖాళీవి ఉన్నాయి. వాటి లేబిల్సుపైన పదిహేను రోజులకిందటి తారీఖు వేసిఉంది. సంగతి సందర్భాలు స్పష్టంగా తెలిసి పోతున్నాయి.

తరవాత కాష్‌పెట్టె తెరిచింది. చెక్కుబుక్కు తీసిచూసింది, విలువ ఎంతుందో. గుణేంద్రుడి దస్కతులన్నీ పరిశీలనగా చూస్తోంది.

అంతలో మనతల్లి వచ్చింది గదిలోకి. తెల్లబోయింది. "ఎవరు నువ్వు; ఇనప్పెట్టె తెరిచావు?" అని గద్దించింది, బిగ్గరగా గొంతు పెట్టి.

"అరుస్తా వెందుకు, ఆయన లేస్తారు!" అంది, హేమ.

"ఆవిడ మరింత గట్టిగా "అపచార మెందుకురా!" అంటూ రంకె వేసింది.

గుణి మేలుకునే వున్నాడు. యీగొడవ విని అటునించి ఇటు పక్కకి తిరిగాడు.

"నేను రాకపోతే మరెవరు తీస్తారను కున్నావ్? నువ్వా!" అని ఎదుర్కొంది, హేమ.

గుణేంద్రుడు వీళ్ళని కనిపెట్టి చూస్తూండటం ఇద్దరిలో ఎవరూ గమనించనే లేదు. పినతల్లికి ఆవేశం ఎక్కువయింది. గుణి మెల్లిగా "హేమా, ఎప్పుడొచ్చావ్?" అన్నాడు.

"ఇప్పుడే వచ్చా. ఈవిడెవరో గాని పెత్తనం చెయ్యటానికివచ్చినట్టుంది. బోడి పెత్తనం!—నీవస్తువులు తీసి చూడటం పరాయిళ్ళల్లో దూరి ఆగడం చెయ్యటం కాదని నచ్చచెప్పు. ఇదంతా నాది అన్న సంగతి ఆవిడకి బాగా నాటేటట్టు, తెలియ చెప్పి, ఆవిడగార్ని ఇక్కణ్ణించి బయటికి దయచెయ్యమను," అన్నది హేమ.

అంతా గ్రహించాడు గుణి. నవ్వుతూ, "ఇన్నాళ్ళకి ఇనప్పెట్టె తెరవటానికి వచ్చావా?" అన్నాడు.

చెక్కుబుక్కుతో మిగిలివున్న పత్రాలు లెక్కపెడుతూ, హేమ "ఊఁ"—అంది.

"ఆ అమ్మాయి ఎవరు గుణీ!" అనడిగింది, పింతల్లి.

"నా చెల్లి."

"ఈమాటకు పరిపోయిం దావిడ. ఏమిటీ, ఇన్నాళ్ళనించీ ఎప్పుడూ ఈ సంగతే విన్లేదే? నీ కెలాంటి చెల్లెలూ?" అని మళ్ళీ అడిగింది.

"పోట్లాడి వెళ్ళిపోయింది, పిన్నీ!—ఇదంతా దానిదే" అన్నాడు టూకీగా, గుణి.

ఈ మాటలు నమ్మలేదావిడ. అవి అర్థమూ చేసుకోలేదు. మెల్లిగావెళ్ళి పోయింది, ఇక్కణ్ణించి.

గుణి హేమకేసి సరిగా చూడనే లేదు. చూడకుండానే ఇలా అనేశాడు: "నా మరణకాలంలో నీకిదేం ఖయ్యాళీ, హఠాత్తుగా?" అనేశాడేకాని, ఆమె ముఖం చూసి భయపడిపోయాడు.

హేమ ముఖం వెలవెలబోయింది. భయంతోనే గుణి "హేమా!"—అని పిలిచాడు. జవాబు లేదు. కళ్ళార్పకుండా నేలకేసి చూస్తూ కూర్చుండి పోయిందామె. గాబరాపడుతూ గుణి, హేమా, నే చెప్పేది విను!" అన్నాడు మళ్ళీ.

సమాధానంగా హేమ ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది, మాటాడక కూర్చుంది. ఎలాగో అలా లేచి, గుణి పక్కమీద కూర్చున్నాడు. తరువాత దిగి, అతికష్టంతో మెల్లిగా వచ్చి హేమఎదుట నిలబడ్డాడు. ఆమె అమాంతం అతడి కాళ్ళమీదపడి, రెండు పాదాల మధ్యనీ ముఖం దాచుకొని ఏడుపు మొదలెట్టింది.

"నావల్ల తప్పులేకపోయినా నన్నందరూ శిక్షిస్తారు. నువ్వూ శిక్షిస్తున్నావు. ఇలా చేస్తావని కల్లోనూ అనుకోలే" అంది.




అలాగే కొయ్యాలా నించుండిపోయాడు గుణి. చెదరిపోయిన తన జుట్టుతో హేమ అతడి పాదాలు రెండూ కప్పివేసింది. తరవాత మెల్లిగా కూర్చున్నాడు, గుణి. తన కుడిచేత్తో హేమ తలను నిమురుతూ, ప్రశాంతమైన కంఠముతో ఇలా అన్నాడు.

"నువ్వు నన్ను ప్రేమించినందుకు గాను నాకు నేనే శిక్షవిధించుకోను. అటువంటప్పుడు నిన్ను శిక్షిస్తానా హేమా!—ఇది శిక్షకాదు చెల్లీ'—నాలుగేళ్ళపాటు ఎంతో దుఃఖం అనుభవించి, తరవాత మరణకాలంలో ఏశిక్షనయితే పొందానో, చివరి రోజున, దుర్లభమైన ఆ వస్తువును నీకే ఇచ్చి పోతాను. పద ముందు, కాశీ!—"

దుఃఖం దాచుకొని ఏడుస్తూంది హేమ. "పద!—ఇదేనా నీకడపటి సందేశం? ఇది నేను సహించగలనా?" అన్నది హేమ.

అందుకు గుణి ఇలా బదులుచెప్పాడు:

"సహించగలవు, తప్పక సహించగలవు!—ఈ లోకంలో "ప్రేమ' అనే' వస్తువు దానిమహిమను చాటడానికిగాను, నీలాంటి మహా ఐశ్వర్యవంతురాలి వాకిట చిరకాలం చెయ్యి చాచుకు నించుంది. మహత్తరమైన ఆ ప్రేమవస్తువు క్షుద్రమయిన ప్రేమకుటీరం ముందు నిలబడలేదు. ఈ సంగతి ఎప్పుడైతే గ్రహిస్తావో, అప్పుడు నువ్వు నా అంతిమ సందేశాన్ని సహించగలవు!

"ఉత్కృష్టమైన పవిత్రప్రేమకు తృప్తి కాని వాంఛలే ప్రాణం. ఈవాంఛల ద్వారానే అమరత్వం అనే ప్రయోజనాన్ని పొందుతూవుంది లోకం. యుగ యుగా



లుగా వీటిద్వారానే ఎన్నెన్నో కావ్యాలు వెలుస్తున్నాయి, ఎంతో మధువు ఉత్పత్తి అవుతూంది, అమూల్యమయిన అశ్రువులు వెలువడు తున్నాయి. ఆ అతృప్త వాంఛలు వీటన్నింటినీ సమీకరించగలదని నిస్సంశయంగా ఎప్పుడయితే తేల్తుందో, అప్పుడు సహించగలవు, హేమా!—

''వేలాది వత్సరాలుగా వ్యాపించివున్న రాధావివాహం ఎంత ప్రాణప్రదమైంది వైష్ణవులకు?—ఏవిధమైన ప్రేమ సమాగమమూ లేకుండానే అది ఎట్లా పరిపూర్ణ మయిందీ? —

''బాధవల్లనూ, తాపం వల్లనేకదా ప్రేమవస్తువు మధుర మయిందీ!—ఈ సందర్భాలన్నీ నీకెప్పుడు తెలిసివస్తాయో, ఆ క్షణమందు నువు నా సందేశాన్ని సహించగలవు, చెల్లీ!—

* * *

''లేచి కూర్చో హేమా!—ఇవాళే మనం కాశీ వెళదాం. నాకింకా ఈలోకంలో ఎన్ని రోజులు మిగిలి వున్నాయో, అన్నాళ్లూ నీ సేవలో వినియోగిస్తాను. భగవంతుడి ఆశీర్వాదంవల్ల నీ జీవితమంతా సత్పథంలో, ధర్మ పథంలో, శాంతిమార్గంలో అక్షయం కావాలని నేనెప్పుడూ కోరతాను!—''

———




# మల్లెలు వచ్చాయి

భమిడిపాటి అనంతనారాయణ

విసుగ్గా వాచీవంక చూసుకుంది గీత.

"ఆరు-పది" అనుకుంది చిరాగ్గా.

"ఇంక ఇవాళ సినిమా చూసినట్టే..."

వంటిమీద తెల్ల సిల్కుచీర ముళ్ళు గుచ్చుకుంటున్నట్టుంది.

"ఇంకరారు" అనుకుంది.

కంట్లో నీరు తిరిగింది.

"ఇవాళసాయంత్రం సినిమాకువెళ్దాం. తెల్లసిల్కుచీర కట్టుకు రెడీగా వుండు ఇవాళకు మన పెళ్ళయి ఏడాదయింది" అన్నాడు మూర్తి ఆవేళ పొద్దున్న ఆఫీసుకు వెళ్తూ.

"వేగం ఐదు గంటలకే వచ్చేయండి" అంది గీత.

అన్నమాటమీద నిలబడ్డదెప్పుడు? .. ఏదో మాయకబుర్లు చెప్పి మురిపిస్తాడు.

సరిగ్గా ఏడాదయింది పెళ్ళయి!

తలంబ్రాలు పోసేటప్పుడు ఏం అల్లరి చేశారు!

సిగ్గుతో నవ్వుకుంది గీత.

ఆనందంగా గడపవలసింది ఈ రోజు.

ఏడ్పువస్తున్నది గీతకు.

వెధవ ఆఫీసు పని రేపు చూసుకో కూడదూ.

రోజూ ఉండేపనేగా....

చీర మార్చుకుంది. కసిగా ఉండలు చేస్తూ పెట్లో కుక్కేసింది సిల్కుచీరను.

తల దిమ్ముగా ఉంది.

రేడియో పెట్టింది.

''మధుర మధుర మీ చల్లని రేయి...'' అంటూ వినిపిస్తూంది భానుమతి కంఠం. కసిగా రేడియో పీక నొక్కేసింది.

ఏడయిపోయింది!

ఛళ్లున వీధి తలుపులు మూసి ఇంట్లోకి వచ్చేసింది గీత.

*                *

''అరే! అప్పుడే ఆరయి పోయిందే? తొందరగా బయలుదేరాలి. గీత ఎదురు చూస్తూ ఉంటుంది'' అనుకున్నాడు మూర్తి.

''మిస్టర్ మూర్తీ! ఈ ఎస్టిమేట్స్ కాస్త చూడు. వెరీ అర్జంట్. రేపు బిల్స్ పాస్ చెయ్యాలి'' అన్నాడు ఇంజనీరు.

ఫైలుతో ఒక్కటి ముఖంమీద కసి తీరా కొట్టాలనిపించింది మూర్తికి.

వీడికి పెళ్లాం పిల్లలు లేరు అను కున్నాడు.

వీడి పెళ్లాం చండిక బాబోయ్. అందుకే రాత్రి పది గంటలవరకూ ఆఫీసులో ఏడు స్తాడు. ''గాడిదకొడుకు'' అనుకున్నాడు కసిగా.

వెధవ ఎస్టిమేట్లు.

ఆరున్నరయి పోయింది!

గీత పాపం ఎదురు చూస్తుంది.

ఛీ! వెధవ ఉద్యోగం!

అరవై ప్లస్ డెబ్బైనాల్గు ప్లస్....

గీత ఎంత డిసప్పాయింట్ అవు తుందో——

చిరాకుపడిపోతున్నాడు.

సరే సెకండ్ షోకు వెళ్లవచ్చు. వెధవ వర్కు వేగం కంప్లీట్ చెయ్యాలి.

ఇవాళ్టికి పెళ్లయి ఏడాదయింది!

ఎంతో ఆనందంగా గడపవలసిన రోజు!

ఎనిమిదిన్నరకు ఆఫీసు పని పూర్తి చేసికొని లీలామహల్లో రెండు టిక్కట్లు తీసికొని తోవలో ఓ పావుశేరు మల్లెపూలు కొన్నాడు.

తెల్ల సిల్కు చీర మీద నల్లటి జడలో తెల్లటి మల్లెపూలు పెట్టుకుంటే——జడ పాములా మెలికలు తిరిగిపుంటే-చూడాలి గీతను.

హుషారుగా ఇంటికి బయలుదేరాడు సిగరెట్టు కాలుస్తూ.

*                *

''గూట్లో అలమరలో కందిగుండ ఉంది. కుంపటిమీద అన్నం ఉంది. మీరు అన్నం తిని నాకు వడ్డించండి'' అంది గీత వాకిట్లో కూచుని.

కసిగా టిక్కట్లు చింపసాగాడు మూర్తి.

టేబిల్ మీద మల్లెలు ఫక్కున నవ్వాయి!

———




జగదీశ్వర్రావుగారి రెండంతస్తుల పచ్చ మేడ వెనక పెద్దతోట.......రంగు రంగుల పువ్వులతోట .... ఒక పక్క కూరగాయల మొక్కలు కూడా ఉన్నాయి.

తోట వెనక మసి బారినట్టు ఎండి పోయిన తాటాకు గుడిసెల పేట. ఆ పేటలో గుడిసెల్లేని చోటల్లా బురద— వానవల్ల వచ్చింది కాదు. యిరుగ్గా ఉన్న ఆ గుడిసెలకి ''డ్రెయినేజి స్కీము'' వేసే శ్రద్ధ, ఓపిక—సదరు అధికారులకి లేని కారణంచేత, ఋతువుల్ని బట్టి కాక, అక్కడ నివసించేవాళ్ళ జీవనాన్నిబట్టి.... ఎప్పుడూ బురద!

బురదతో నిండిన గుడిసెల పేటకి, రంగుల పువ్వులతో నిండిన అందాల తోటకి మధ్య—పేద వాళ్ళకి, గొప్ప వాళ్లకి మధ్యనున్నంత పెద్దగోడ ఉంది. ఆగోడ అడుగున్నర మందాన, పదడు గుల ఎత్తున ఉంది. తోటలో ఉన్న అందాలుగాని, ప్రత్యేకించే సౌరభాలు కాని అవతలివేపుకి పోకుండాను, అవతలి వేపున్న దిగంబర దృశ్యం, బురద యివతలి వేపుకి పాకకుండాను కాపాడే గోడ!

తోటవేపున్న గోడకి పచ్చని సున్నం వేసేరు. గోడ పైభాగాన గాజు పెంకులు, రేకుముక్కలు తాపడం పెట్టేరు. పేట వేపున్న గోడనిండా పిడకలు; పిడకల్లే నవ్వుతూ ఎండిన పేడ పెచ్చులు!

ఆ గోడ ఎత్తుగా ఉండడంవల్ల కొద్ది దూరంలో ఉన్న మోహన్ రోడ్డుకి కూడా స్పష్టంగా కనిపిస్తుంది.

పేటలోని గుడిసెల మధ్య ఒక చిన్న గుడిసెలో డెబ్భైయేళ్ళ ముసలామె ఉంటోంది. పదేళ్లకిందటే ఆవిడ మొగుడు పోయేడు. మరో రెండేళ్లకే ట్రెయిన్‌లో పనిచేస్తున్న ఒక్కగా నొక్కకొడుకు ఒక ప్రమాదంలో చచ్చి




పోయేడు. తరవాత ఏడాది తిరక్కుండానే కోడలు ఎవరితోటో లేచి పోయింది. ఆ గుడిసె స్థిరాస్తిగాను, రెక్కల కష్టం చరాస్తిగాను అక్కడక్కడా అంట్లు తోము కుంటూ నాలుగేళ్ళ కిందటివరకూ ఈడ్చు కొచ్చింది ముసిలమ్మ. రెక్కల్లో సత్తువ కూడా పోయేసరికి రోడ్డుమీది పేడ తట్టలో కెత్తుకుని, పేటవేస్తున్న జగదీశ్వర్రావు గారి గోడమీద పిడకలు పెట్టుకుని అమ్ము కుంటూ బతుకుతోంది. ఆ మాత్రం ఆధారమేనా చూపించి తననలా బతక నిస్తున్నందుకు రోజుకి పదిసార్లేనా ఆ "సర్వేశ్వరుడ్ని" తల్చుకుంటుంది.

* * *

ఈ దేశంలో ఉన్నది ప్రజాస్వామ్య మేనని చెప్పేందుకు, ప్రభుత్వాన్ని ప్రజలే ఎన్నుకుంటున్నారని చాటి చెప్పేందుకు అయిదేళ్ళ కోసారి ఎన్నికలు జరుగు తుంటాయి. ఈ ఎన్నికల్లో నాయకు లంతా ప్రజల యిళ్లకి వెళ్ళి, వాళ్ల యోగ క్షేమా లడుగుతూ ఉంటారు. డబ్బు విరి విగా ఖర్చు పెడతారు, ఒకరి గుట్టు ఒకరు బైట పెడుతూ ఉంటారు. ఆవేశంగా ఉపన్యాసా లిస్తారు. ఎన్నెన్నో వాగ్దా నాలు చేస్తారు. కార్లలో మైకులు పెట్టు కుని అరుస్తూ తిరుగుతారు.

ఇవన్నీ ముసిలమ్మని అంతగా బాధ పెట్టలేదు. ఒకరోజు తెల్లవారగానే పేడ కోసం తట్ట పటుకు బైల్దేరిన ముసిలమ్మ గోడవేపు చూసి....ఆశ్యర్యంతో నోరు తెరుచుకుని అలాగే ఉండిపోయింది.

గోడ గోడలాగ లేదు. రంగుల సినిమా ఆడుతున్న తెరలాగుంది........ పోస్టర్లు....పోస్టర్లమీద పెద్ద పెద్ద అక్షరాలు....రక రకాల బొమ్మలు....పిడకలు పెట్టుకోడానికి అంగుళం మేరకూడా మిగల్చకుండా కాగితాలంటించేసారు.

మహాత్ముల శాంతి బోధనల్లాగ,

పోలీసుమంత్రి అహింసా ప్రవచనాల్లాగ,

కోటీశ్వరుడు "సోషలిజా"ని కిచ్చిన నిర్వచనం లాగ.

ఆధునిక అభ్యుదయకవి శృంగార కవిత్వం లాగ,

ఆ రంగులు, ఆ అక్షరాలు, ఆ బొమ్మలు కలగా పులగంగా, హడావిడిగా చూడ్డానికి అందంగానే ఉన్నా,

ఆకలిబాధ తెలిసిన ముసిలమ్మకి పిడకలు పెట్టుకోకపోతే కడుపు నింపుకునే మార్గం లేదు కనక వాటివేపు కోపంగాను అసహ్యంగాను చూసింది.

"నాకేటి. ఆటిమీదే పిడక లెట్టుకుంతాను. ఎవులడ్డం వొస్తరో సూస్తాను" అంటూ, కుడిచేత్తో తట్ట పట్టుకుని ఎడంచెయ్యి ఊపుకుంటూ పేడ కోసం బైల్దేరింది.

* * *

గోడమీద పోస్టర్లంటించింది తెల్ల జెండా పార్టీవాళ్ళు. వాళ్ళకి ప్రజాస్వామ్యం మీద అపరిమితమైన విశ్వాసం గౌరవం ఉన్నాయి. మిగతా పార్టీలవాళ్ళకి లేవని గాఢంగా నమ్ముతుందా పార్టీ. ఆ పార్టీ తాలూకు ప్రజాస్వామిక హక్కుల్ని కాపాడేందుకు చాలామంది రౌడీలున్నారు. వాళ్ళు "పార్టీ వర్కర్ల"న బడతారు. ఆ పార్టీకి దేశం అంతటా కోటీశ్వరుల, మరాధికారుల మద్దత్తుంది. ఆ పార్టీ నాయకులు పుట్టిందగ్గిర్నించి ప్రజల్నే ఉద్ధరిస్తున్నా మంటారు.

ఊళ్లో "పొజిషను" చూసుకుంటూ వచ్చిన పార్టీ వర్కర్లు గోడవేపుచూసి ఆశ్చర్యంతో అలాగే నిలబడి పోయేరు. —పోస్టర్ల అంచులు మాత్రమే కనిపిస్తూ గోడనిండా వరసగా పిడకలు పేర్చి ఉన్నాయి. పిడకలు పెట్టిన ముసిలమ్మ గోడనీడలో తాపీగా చుట్ట కాలుస్తూ కూర్చుంది.

"ఎవరు పెట్టేరాపిడకలంటూ"గర్జించేడొక వర్కరు.

"నానే బాబూ. ఏటలా ఎగిరి పోత న్నావు?" అంటూ కసిరింది ముసలమ్మ.

"ఏటీ దౌర్జన్యం ముసిలమ్మా, మా కాయితాలమీద పిడక లెట్టినావూ?"







"నాదా దౌర్జన్యం. నాను పిడక లెట్టుకుని గోడమీద రాయితాలంటించి నా కడుపు కొడితే నాకేటొస్తదిరా? నడు నడు."

పార్టీవర్కర్లకి, ముసిలమ్మకి చాలా సేపు తగువయింది. చుట్టూ చాలామంది మూగేరు. మూగినవాళ్లు వింతచూస్తూ నిలబడ్డారేగాని, ఎటువేపూ మొగ్గుచూపించ లేదు. నిస్సహాయురాలైన ముసిలమ్మ ఎక్కువసేపు దెబ్బలాడలేక పోయింది. ఆవిడ అడ్డువచితే వెనక్కి తోసేసి, యినపరేకుతో గోడమీది పేడ ముద్దల్ని గోకేసి, మళ్ళీ పోస్టర్లంటించి వెళ్ళి పోయేరు పార్టీ వర్కర్లు.

ముసిలమ్మ ఏడుపు చూస్తే కొందరికి నవ్వొచ్చింది. మరింతగా ఏడిపించ బుద్ధయింది. కొందరు ఓదార్చేరు. ఒక రిద్దరికి మాత్రం పార్టీవర్కర్లమీద విపరీత మైన కోపం వచ్చింది. ఏం చెయ్యలేక ఊరుకున్నారు.

* * *

ముసిలమ్మకి మూడ్రోజుల్నించి తిండి లేదు. గుడిసెలో ఒకర్తి ముడుచు కూర్చుంది.

కాళ్లు, చేతులు మొద్దుబారినట్లైపోయి నీరసంగాను, మగతగానుఉంది. ముడతల పడి తడారిన చర్మం పొట్టులాగుంది. మధ్యలో మూలుగుతూ, ఏడుస్తూ, మగ తగా జోగుతోంది.

ఆ రోజే ఎన్నికలు

ఊరంతా హడావిడిగా ఉంది. పార్టీల వర్కర్లు జనాన్ని రిక్షాలెక్కించుకొని, లారీలమీద, బస్సులమీద, టేక్సీలమీద తీసుకుపోయి ఓట్లేయించుకుంటున్నారు. కొందరు మళ్ళీ మళ్ళీ వెళ్ళి ఎవరెవరి వోట్లో వేసేస్తున్నారు. కొందరు వోటు ఖరీదు గురించి బేరాలాడుతున్నారు. బూతులు తిట్టు కుంటున్నారు. మూల మూలల్నించి మనుషుల్నెత్తుకొస్తున్నారు పార్టీల వర్కర్లు.

సాయంత్రం అవుతుండగా తెల్ల జెండా పార్టీవర్కరు ముసిలమ్మ గుడిసె లోకి ప్రవేశించేడు.




"ముసిలమ్మా, వోటేసేవా?"

"ఎవడూ!"

గొణుగుతున్నట్టుంది ముసిలమ్మ.

"పద, పద కారొచ్చింది. వోటేద్దువు గాని పద.... తెల్లజెండాకే వోటెయ్యి."

"నాన్రాలేసు బాబూ."

"నేస్తీసికెళ్తాను కదా ముసిలమ్మా" అంటూ రెండు చేతుల్లోనూ ఎత్తుకు తీసు కెళ్ళి జీపులో కూర్చోపెట్టేడు.

"నాన్సచ్చి పోతన్నాన్రా కొడుకా.... నన్నొగ్గరా బగమంతుడా" అంటూ ఏడుస్తోంది ముసిలమ్మ.

"ఇయ్యాళ్తో ఆఖరురోజు ముసిలమ్మా. రేపణ్ణించి నీ గోడమీద పిడక లెట్టుకుందువులే."

తెల్లజెండా పార్టీ వర్కరుని అప్పుడు పోల్చుకుంది ముసిలమ్మ.

"వోటేట్రా ముదనష్టపోడా? నా కడుపు కొట్టి నన్నే వోటెయ్య మంటన్నావురా సచ్చినోడా? నీ వోటుకోసంవు నన్ను సంపినావు కదురా? నన్నొదులు.... నాకే వోట్లొద్దు....నాకే కార్లొద్దు........ నన్నొగిపో...."

ముసిలమ్మ అరుస్తుండగానే జీపు "పోలింగ్ బూత్" దగ్గరాగింది. అందరూ దిగేరు.




"దిగు ముసిలమ్మా వోటెయ్యి. తెల్లజెండాకే .."

ముసిలమ్మ జీపు దిగిందిగాని వోటెయ్యడాని కొప్పుకోలేదు. ఎన్ని చెప్పినా, ఎంత బతిమాలినా ముసిలమ్మ విన్లేదు. మూడు రోజుల్నించి ఆకలి మంటతో "వోటు" నుసే, మసే అయి పోయింది!

ఒక్కర్తి గుడిసెవేపు తడుముకుంటూ తూలుకొంటూ నడిచింది. నేలమీదికి వంగి, ఏదో జంతువు పాకుతున్నట్టు నడుస్తోంది.

"రేపట్నించి మళ్ళీ పిడకల పెట్టుకో వచ్చు, వొంట్లో ఏ మాత్రం సత్తువ లేక పోయినా, ఆ సంతోషంతో, ఆ ఆశతో మెల్లిగా నడుస్తోంది.

* * *

ఎన్నికల హడావిడి చూసిన ఒక రేడియో కంపెనీ ఏజంటుకి ఆ గోడ బాగా నచ్చింది. మెయిన్ రోడ్డు మీదికి స్పష్టంగా కనిపిస్తుంది. జగదీశ్వరరావు గార్ని కలుసుకొని, తమ రేడియో కంపెనీ ఎడ్వర్టైజ్ మెంటుకి గాను ఆ గోడని అద్దెకి తీసుకుంటూ "అగ్రిమెంటు" మీద సంతకం చేసేరు. ఎన్నికల రోజు సాయంత్రం గోడమీది పోస్టర్లన్ని పీకించేసి, కుదురుగా, అందమైన పెద్ద అక్షరాలతో "కంపెనీ రేడియోలనే కొన"మని రాస్తు ఉండగా,-

మసక మసగ్గా కనిపిస్తున్న కళ్ళ లోంచి ఆ దృశ్యం చూసిన ముసలమ్మ ఓపిక లేక అలాగే కూలబడి పోయింది....

ఆ గోడ స్వతంత్ర భారత దేశం లాగుంది!

———

# నా కోసం ఈ కన్నీళ్ళు

కొడూరి శ్రీరామమూర్తి M.A.



ఇందిర బి. ఏ. పేసయింది - నిజమే—

పెళ్ళయిపోబట్టి కాని, లేకుంటే ఎమ్మేనో మరేదో పేసయ్యేది—

—ఆ మాటా నిజమేనూ.

అయినంత మాత్రాన తనలోని స్త్రీత్వాన్ని ఒప్పుకోకుండా ఎలా వుంటుంది?- స్త్రీ కోరే గమ్యంలో ఆనందంలేదని ఎలా అనుకుంటుంది?—

లాన్స్‌లో ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తోంది ఇందిర—ఇందిర ఆలోచనలు కాసేపు గతంలోకీ మరి కాసేపు వర్తమానంలోకీ పరిగెట్టి విచిత్రమయిన భావాలను సృష్టిస్తున్నాయి. వాటిని చూచి ఇందిర ఆనందపడుతుందో భయపడుతుందో ఆమెకే తెలియదు. గతాన్ని మరచిపోవాలనే తాపత్రయం—వర్తమానాన్ని గురించి ఆందోళన—భవిష్యత్తును గురించి భయం—ఇందిర చుట్టూ అల్లుకున్నాయి.

నిజానికి—ఇందిర వయస్సు పెద్దదేమీ కాదు. పాతికేళ్ళు పైబడుతున్న ఇందిర భావాల్లోనూ, అనుభవాల్లోనూ ఎంతగా ఎదిగిందో కాని, సామాజిక స్థాయిలోనూ ఐశ్వర్యంలోనూ బాగా ఎదిగింది. చిన్నప్పుడు బస్సులో ప్రయాణం చేస్తే మురిసిపోయిన ఇందిర ఇవాళ కాడిలాక్ కారుకూ, దాన్ని పోషిస్తున్న పెద్ద మేడకూ అధికారిణి అయింది.

ఆ అదృష్టమంతా ఆ అమ్మాయి కళ్ళల్లో వుందంటాను నేను. ఆర్టిస్టిక్‌గా

వుండే ఆ కళ్లు ఇందిరను అందమైన అమ్మాయిగానే కాదు—అందాల రాణిగా కూడా చేశాయి. ఈపూటే ఆ అమ్మాయి దగ్గిర ఎవరన్నా అంటే తియ్యగా నవ్వుతుంది. ఆ నవ్వంటే పడి చచ్చే వాళ్లు ఎంతమందనీ?—

అందులో ప్రకాశం మరీనూ—

కాని—ఆనవ్వుమీద సర్వహక్కులూ గల యజమాని మైకాగనుల కృష్ణమూర్తి.

అదృష్టవశాత్తో లేక దురదృష్టవశాత్తో కృష్ణమూర్తి కవితా (త్రే)క పోయాడు గానీ లేకుంటే ఇందిర నవ్వుమీద ఓ ప్రబంధం రాసిపారేసి ఇంటింటికీ ఓ కాపీ పంచిపెట్టి వుండేవాడు -

కృష్ణమూర్తికి తనమీద వున్న వెర్రి అభిమానం ఇందిరకు తెలియక పోలేదు—నిజానికి అదే ఇవాళ ఆమెను అంతగా భయపెడుతుంది.

ఆరోజు తనకింకా జ్ఞాపకం వుంది—

ఘోరున వర్షం పడిన ఆరోజు-మెరుపులతో ఉరుములతో భయంకరంగావున్న ఆ రోజు-తను ఒంటరిగా కుమిలి కుమిలి ఏడ్చిన రోజు-

ఎలాంటి వికృతమైన జ్ఞాపకాలు!—

భూతద్దంలో పెట్టినట్టుగా డాక్టర్ రామేశ్వరి ముఖం భయంకరంగా కనబడుతోంది—"భగవాన్—గతాన్ని ఎందుకుమరచి పోలేను నేను-" గొణుక్కుంది ఇందిర—

దూరంగా అల్సేషన్ మొరుగుతోంది.-

ప్రక్కన ఏదో అడుగుల చప్పుడు వినబడింది.

"రాణీగారు ఇక్కడున్నారా?- దేవిగారి ఏకాంతసేవకు మేం ఏం చెయ్యాలిట?—" అన్నాడు కృష్ణమూర్తి పక్కన కూర్చుంటూ.

బోకెడంత డబ్బా—పెద్దమూతా—దానిమీద నాటూకుగా వుండే చిలుమీసమూ-పిల్లికళ్లూ—పాలపింతకాయబోకులూ—కలిస్తే "కృష్ణమూర్తి" అనే బొమ్మ తయారవుతుంది--కృష్ణమూర్తి అందగాడు కాదు కానీ దానికోసం తాపత్రయం కొంచెం ఎక్కువేను—

కృష్ణమూర్తి మాటలకు మామూల్లాగా ఇందిర నవ్వలేదు—ఎప్పటిలాగా అతని కళ్లల్లోకి చిలిపిగా చూడలేదు—

నిజానికి ఆమెకు అతగాడి మాటలు వినబడటం లేదు—కాలగర్భంలో కలిసి పోయిన డాక్టర్ రామేశ్వరి—ప్రకాశం—ఇంకా—చెప్పలేనిభయం—ఏవేవో జ్ఞాపకం వస్తున్నాయి"

"భగవాన్—గతాన్ని నేనెందుకుమరచి పోలేను—" మరోసారి అనుకుంది—

ఈ మాటలు కృష్ణమూర్తికి వినబడలేదు—వినబడ్డా ఈ మాటల్లోని లోతులు అతనికి తెలియవు—తెలుసుకోలేడు—

* *

"ఇందూ!—ఎవరొచ్చారోచూడు—" అంది శాంతాదేవి ప్రొద్దున్న అప్పుడే లేచిన కోడలితో—

ఎదురుగా అక్క—నీలవేణికనబడింది—

"కంగ్రాచ్యులేషన్స్—" అంటోంది నీలవేణి—

ఆ మాటలు ఎందుకో ఇందిరకు తెలుసు—తేలిగ్గా, తృప్తిగా, నవ్వింది—

ఇందిర నవ్వడం చూచి శృతికలుపుతూ నవ్వాడు నీలవేణి వడిలో వున్న చిన్నబాబు—

"నీ కొడుకు అందంగా వున్నాడు నీలూ!—" అంది ఇందిర వాడిని ముద్దు పెట్టుకొంటూ—

"ఇంకెన్నాళ్లులే మరో ఏడు నెలలు ఓపికపడితే పండంటి కొడుకు అద్దాలలో వాలతాడులే!-" సరసమాడింది నీలవేణి.

నీలవేణి మాటల్లో ఆశలూరించే భావి అందంగా తొంగి చూచి ఇందిరను గిలిగింతలు పెట్టింది. ఈ ఆనందానికి తను త్వరలోనే అధికారిణి కాబోతోంది- నిండుగా నవ్వుకుంది ఇందిర—

కాని—ఆ నవ్వు వెనకాల ఏవో జ్ఞాపకాలు కలుక్కుమన్నాయి. ఓ నాడు ఈ ఆనందం తనకు భయంకరమైన శాపంగా పరిణమించింది. ఈ నాడు తను కోరుకుంటున్న మాతృత్వాన్ని చూచి ఒకప్పుడు భయపడింది. ఆనాటి వ్యధను సులువుగా మరచిపోలే దామె.

బయటవర్షం, భోరున్న పడుతూంటే—చీకటిలో ఒంటరిగా ఏడ్చింది తను. ప్రపంచం అంతా ఒక్కటై తనను వేలెత్తి చూపిస్తున్నట్టుగా వెలివేసి ఎగతాళి చేస్తున్నట్టుగా—భయంమీద అసహాయతస్వారీ చేస్తున్నట్టుగా అనిపించింది. ఎలాంటి గతాన్ని తను కడుపులో దాచుకుంది!—

"ఏమిటోయ్ ఇందిరా-భావలోకాల్లో తేలిపోతున్నావు—అతిథుర్తోటి రెండు మాటలు మాటలాడు మరి!"

వేళాకోళం చేస్తోంది నీలవేణి.

*　　　　*

భోజనాల దగ్గిర అన్నది శాంతాదేవి కోడలితో—

"ఈ సంగతి విన్నావా అమ్మాయ్?" అని.

"ఏమిటది అత్తయ్యా?—" అంది

"పూజకి పూలు కావాలంటూ అస్తమానూ మహాభక్తురాలిలాగా మన గార్డెన్ లోకి వస్తూవుంటుందే—అవధాన్లు గారమ్మాయి సరస్వతి - ఎవడితోనో స్నేహం చేసి కడుపు తెచ్చుకుందిట. కొంపకి అప్రదిష్ట వచ్చిందని అవధాన్లుగారు కూతుర్ని డాక్టరు దగ్గరకు తీసికెళ్ళాడట—అయినా రహస్యం ఎన్నాళ్ళని దాగుతుంది?-ఊరందరికీ తెలిసిపోయింది. పిదపకాలపు బుద్ధులు కాకపోతే తప్పుచేసిన కూతుర్ని కేకలేసి ఆ కుర్రాడిచేత మూడు ముళ్ళు వేయించే ఏర్పాటు చూస్తాడా—డాక్టర్ దగ్గి



రకు తీసికెళతాడా-ఛీఛీ-లోకానికి బొత్తిగా సిగ్గూ లజ్జా లేకుండా పోతోంది——''

శాంతాదేవి మాటలకు నీలవేణి పుంజుకుంది.

''——అంతేకాదు. ఈ సిగ్గుమాలిన వాళ్ళకు ప్రభుత్వం భరోసా ఇస్తుందటండీ. గర్భస్రావం చేయించుకోవడం తప్పు కాదుట. దానికి ఓ శాసనం కూడా చేస్తారట-అదే కనుక జరిగితే అన్యాయాన్ని పట్టగలమా అని——మొన్న పేపర్లో ఒక వార్త చదివాను. లండన్ నగరంలో డాక్టర్లందరికీ ఇప్పుడిదే ప్రాక్టీసుట—— లండన్‌లో గర్భస్రావం నేరంకాదు కదా అని——అనేక దేశాల్నించి అమ్మాయిలు లండన్ వస్తున్నారట——ఎయిరోడ్రోమ్ దిగగానే సరాసరి అస్పత్రులకు వెడుతున్నారట——''

ఇంటరు ఫెయిలయిన నీలవేణికి పనికిరాని పరిజ్ఞానంతోబాటుగా యితరులను 'బోర్' చెయ్యడంలో కూడా మంచి నేర్పుంది,

''ఛీఛీ!-ఇలాంటి పాపపు మాటలు నా దగ్గిర చెప్పకు——ఆ గుండెల్లేని వాళ్ళ గురించి అనుకోవడం కూడా పొరపాటే అయినా గర్భస్రావం అంటే ఏమిటి?—— భ్రూణహత్య కాదూ!-గోహత్య, భ్రూణహత్య, సామాన్యమైన పాపాలు కావమ్మాయి. కట్టి గుడు పుతాయి. తరతరాల్ని ఆ పాపం పీల్చి పిప్పిచేస్తుంది——'' కోపంగా అంటోంది శాంతాదేవి.

శాంతాదేవి మాటలు ఇందిర గుండెల్లో బలంగా గుచ్చుకున్నాయి. తననీ - తన పాపాన్నీ ఆమె శపిస్తున్నట్టుగా అనిపించింది. తన శీలాన్ని గేలిచేస్తున్నట్టుగా అనిపించింది - పెగిలివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక కొంచెంలోనే చెయ్యి కడుక్కుని గబగబా తన గదిలోకి వెళ్ళిపోయింది.

కోడలి ప్రవర్తన అర్ధంకాక - తెల్లబోయింది శాంతాదేవి గదిలోకి వెళ్ళిపోయి ఒంటరిగా తనివితీరా ఏడ్వాలనుకున్న ఇందిరకు ఎదురుగా కనబడింది కేలండర్ మీదవున్న పసిపాప బొమ్మ!-నోట్లో వేలు పెట్టుకుని వెన్నెల్లాగా నవ్వుతున్నాడా బాబు.

అందంగావున్న ఆ కేలండర్‌ను కృష్ణమూర్తి స్వయంగా ఇందిర గదిలో తగిలించాడు. అంతేకాదు-"ఇందూ! ఇంత అందమైన బాబుకు నువ్వు తల్లివి కావాలంటోంది అమ్మ—" అంటూ 'జోక్' చేశాడు కూడాను. ఆ రోజు ఆ బొమ్మను చూచి హాయిగా నవ్వింది తను.

ఈ రోజు ఆ పసిపాప బొమ్మ తనని భయపెడుతోంది—ఆ పసిపాపలోని అమాయికత్వం తనని దహించి వేస్తోంది.

ఆరేళ్ళ క్రితం జరిగిన కథ కళ్ళ కెదురుగా కనబడుతోంది—తన యౌవనం చేసిన పొరబాటును డాక్టర్ కామేశ్వరి ఎలా తుడిచిపెట్టిందో జ్ఞాపకం వచ్చింది.

దూరపు బంధువు అయిన హాస్టల్ డాక్టర్ కామేశ్వరి తనను తల్లిలా ఆదుకుంది. మరోకంటికి-కనీసం ఇంట్లోవాళ్ళకు కూడా తెలియకుండా తతంగం పూర్తయిపోయింది. పల్లెటూళ్ళో వున్న తండ్రీ, తోబుట్టువులూ బస్తీలో కాలేజీలో చదువుతున్న ఇందిర టైఫాయిడ్ వచ్చి హాస్పటల్‌లో చేరిందని అమాయికంగా నమ్మేశారు. డాక్టర్ కామేశ్వరి లోకాన్ని ఎంత సులువుగా నమ్మించింది!—

"చేసిన పొరబాటుకు ఇప్పుడు విచారించి ప్రయోజనం లేదు. జీవితంలోని ఎదురు దెబ్బలకు తట్టుకోగలిగితేనే మనం మనుషుల్లాగా నిలబడ గలిగేది!" అంటూ తన భుజం తట్టిన డాక్టర్ కామేశ్వరి మాటలు ఇంకా జ్ఞాపకం వున్నాయి. గుండెల్ని రంపపుకోత పెట్టిన ఓదార్పు అది—

బాధగా కళ్ళు మూసుకున్న ఇందిరకు కేలండర్‌లోని పసిపాప భయంకరంగా నవ్వినట్టయింది.

"ఇందిరా!-నన్ను నువ్వు గుర్తుపట్టలేదు కదూ!-ఒకరోజున నన్ను నువ్వు తుడిచి పెట్టాలనుకున్నా పూర్తిగా పోకుండా ఇంకా నీ కడుపులో మిగిలివున్న పాపాన్ని నేను--నానుంచి నువ్వు తప్పించుకోలేవు-ఏ మాతృత్వాన్నయితే ఓరోజున నువ్వు ద్వేషించావో అదే మాతృత్వాన్ని నువ్వీ రోజున కోరుకుంటున్నావు— నీకు మాతృత్వం కన్నా మాతృత్వం తెచ్చిపెట్టే గౌరవం ముఖ్యం - నువ్వు తల్లివి కావు-రాక్షసివి-నీ హృదయంలో వున్నవి ప్రేమ, త్యాగాలూ, కావు—స్వార్థానికి, కామానికి నువ్వు ప్రతిరూపం-నీపై నేను కక్ష తీర్చుకుంటాను-నీ ఆశల్ని నేల కూర్చేస్తాను-నువ్వు నీ బిడ్డ అని సగర్వంగా చెప్పుకోబోతున్న ఆ శిశువును

కడుపులోనే కబళించి వేస్తాను. ఈ జన్మకు నీకు తల్లినని చెప్పుకునే అర్హత లేకుండా చేస్తాను!-''

భయంకరమైన నవ్వు వినబడుతోంది-

ఇందిరకు ముచ్చెమటలు పోస్తున్నాయి-కళ్ళు తిరిగిపోతున్నాయి - చెప్ప లేనిభయం-గుండెల్లో రంపపుకోత—

''బాబూ! — నాకు అన్యాయం చెయ్యకు!—''

బలంగా గుండెల్ని అదుముకుంటూ తనలో తను అనుకుంది ఇందిర-

ఇంతలో ఆమె భుజంమీద చెయ్యి పడింది-

''ఏం?—ఇందూ ఒక్కసారిగా అలా అయిపోయావు? - ఎందుకీ కన్నీళ్ళు?-'' అనునయంగా అడుగుతుంది అక్క నీల వేణి.

* * *

''ఇందూ! — ఓమంచి ''జోక్'' వెయ్యనా?—'' అన్నాడు కృష్ణమూర్తి తనకు ''టై'' కడుతున్న ఇందిరతో—

''ఏమిటది?-'' అంది ఇందిర మామూలుగా ''టైనాట్'' ను బిగిస్తూ—

''అదిగో!—ఆ పేతటిక్ పోజువద్దన్నాను—''జోక్'' అనేమాట వినేసరికి సగం నవ్వు ముందుకొచ్చి—''జోక్'' వేసేసరికల్లా ''ట్రిగ్గర్'' నొక్కగానే తుపాకీగుండు దూసుకొచ్చినట్టుగా నవ్వంతా విరజిమ్ముతున్నట్టుగా వచ్చెయ్యాలి—''

కృష్ణమూర్తి వేసే ఈచచ్చు ''జోక్'' లన్నిటికీ ఇదివరకు ఒకప్పుడయితే తీరిగ్గా నవ్వేదామె—ఇప్పు డలాకాదు—

''మీ జోక్ లన్నిటికీ నవ్వే ఓపిక నాకు లేదు—అయినా ఏమిటో చెప్పండి—'' కొంచెం నిరుత్సాహంగానే అంది ఇందిర కృష్ణమూర్తి కాలర్ సరిచేస్తూ.

ఇందిర మాటలకు కృష్ణమూర్తి నీళ్ళు కారిపోయాడు—

''ఏం మనిషివోయ్ నువ్వు—నిన్నటి నుంచీ జోక్ ని జాగ్రత్తగా దాచుకుని నీకు చెబుదామనుకుంటే నువ్వు విననంటావు కదూ!—నీతో నేనసలు మాట్లాడనే మాట్లాడను—'' అన్నాడు నిలువుటద్దం ముందునుంచుని ''హైముడి'' ని సరిచూచుకుంటూ—

కృష్ణమూర్తి అలిగాడని తెలుసుకుని నవ్వుతూ అంది ఇందిర—

''అంత కోపమైతే ఎలాసార్?—మీరు నవ్వ మన్నంతసేపు నవ్వుతాను—సరేనా?—ఏదీ జోకు వెయ్యండి—నేను రెడీ—'' అంది కృష్ణమూర్తి గడ్డం పట్టుకుంటూ—

అంతే! — కృష్ణమూర్తి కోపం తాలూకు బెంపరేచరు ఒక్కసారిగా పడిపోయింది—



ఎద్వాన్సుగా ఓ చిరునవ్వు పడేసి—సోఫాలో కూర్చుంటూ — ఇందిరను చూస్తూ అన్నాడు కృష్ణమూర్తి —"నిన్న ఆఫీసులో ఓ తమాషా జరిగింది—మధ్యాన్నం ఇంటర్వెల్ టైములో కూర్చుని ముఖ్యమైన ఫైల్స్ చూసుకుంటున్నాను. ఇంతలో పెద్దమనిషి నాకు ఓ చీటీ పంపించాడు—అతగాడు ఎవరో తెలుసా? ఒక డేన్స్ మాస్టరు—డొనేషన్ ఏదయినా ఇమ్మంటాడేమో అనుకున్నాను—అతడు వచ్చి అంటాడు కదా—మీ పిల్లలకి డేన్స్ నేర్పించండి—రెండేళ్ళలో పెర్ఫార్మెన్స్ ఇప్పించే పూచీ నాది అని—అతగాడి మాటలు చూస్తే నవ్వాలో ఏడవాలో తెలియ లేదు — "బహువచనందాకా వెళ్ళి పోయావు—నాకింకా ఏకవచనం కూడా లేదు—నువ్వు సరిఅయిన ఎడ్రస్‌కే వచ్చావు గానీ—ఏడేళ్ళముందు వచ్చావు-తర్వాత కనబడు—" అని చెప్పాను-"

అతడి మాటలకు నవ్వుతూ అంది ఇందిర—

"అయితే మీ అమ్మాయికి డేన్స్ నేర్పిస్తారన్నమాట!—"

"ఒట్టి చెప్పించడమేనా?—అందులో ఎక్స్‌పర్ట్‌ని చేయించేస్తాను — ఇంటర్నేషనల్ పెర్‌ఫార్మెన్స్‌లు ఇప్పిస్తాను—"

"బాగున్నాయి పగటికలలు—గుర్రం లాడం దొరికింది కదా అని—గుర్రపుబగ్గీ దొరికినంత సంతోషించాడట వెనకటికి ఓ ప్రబుద్ధుడు— ఉద్యోగంలేని డేన్స్ మాస్టర్ దొరికాడు కదా అని మీ ఊహలకు అంతులేకుండా పోతోంది—" పకపకా నవ్వుతోంది ఇందిర—

ఇందిర నవ్వుతూంటే ఉడుక్కున్నట్టుగా మొహంపెట్టాడు కృష్ణమూర్తి-

"అవున్లే—నువ్వు అలాగే నవ్వు తావు—అయినా నీకు ఆడపిల్లలకి తల్లి కావడం ఇష్టంలేదు—ఒకవేళ అయినా ఆ అందమైన ముక్కును ఇవ్వడం అసలు ఇష్టంలేదు—" అంటూ మూలిగాడు—

కృష్ణమూర్తి నవ్వినప్పుడుకన్నా అలిగినప్పుడే ఎక్కువ బాగుంటాడు ఇంది రకి—చిన్నగా నవ్వుకుందామె.

నిజానికి—తన అందాన్ని మూస పోసుకున్న కూతురు పుట్టడంకన్నా ఇంది రకు కావల్సింది ఏమీలేదు—మరి ఆ అందానికి వజ్ర వైఢూర్యాలు పొదుగు తానంటున్నాడు కృష్ణమూర్తి — ఇంత కన్నా ఏం కావాలి తనకి—తియ్యటి భావాలు ఆమెలో ముప్పిరిగొన్నాయి—

చిన్నతనంలో — పక్కింటి ప్లీడరు గారి అమ్మాయి డేన్స్ నేర్చుకుంటూంటే చూచి సరదాపడి తనూ డేన్స్ నేర్చు కుం టానంటే-"మనం సంసారుల మమ్మా-తగుదునమ్మా అని గజ్జెకట్టి రంగ మెక్క డానికి ఇది బజారు కొంపకాదు—అయినా నీ ఇష్టం—మీ నాన్నగారిష్టం—" అని సవతితల్లి మూతిని అష్టవంకరలు తిప్పడం జ్ఞాపకం వచ్చింది-ఆరోజు తను ఎంతటి అవమానంతో క్రుంగిపోయిందో-కుప్పగా కూలిపోయిన తన ఆశలు గుండెల్లో ఎంతటి భయంకరమైన బాధను చెల రేపిందీ—తన కీనాటికీ జ్ఞాపకం వుంది-

తను మాతృవిహీనగా — అదృష్ట విహీనగా—పుట్టింది—కాని, తనకు పుట్టబోయే శిశువు తనకోసం ప్రాణాల నయినా ఇవ్వగల మాతృ హృదయాన్ని, అదృష్టాన్ని ఒలిచి చేతులో పెట్టగల తండ్రిప్రేమనూ కలబోసుకుని పుట్ట బోతోంది— మైడార్లింగ్-నీ అదృష్టాన్ని చూడటంకన్నా నాజీవితంలో కోరికలేదు-భారంగా కళ్లు మూసుకుంది ఇందిర—

ఇంతలో ఎక్కడినించి వచ్చిందో శాంతాదేవి రానేవచ్చింది—

"అమ్మాయ్!-ఈ ప్రసాదం తీసుకో! నీకు పండంటి మొగపిల్లవాడు పుట్టాలని గుళ్లో పూజచేయించాను—" అందామె-

తల్లిమాటలు కృష్ణమూర్తికి సుతా రామూ నచ్చలేదు—"ఈ ఆడవాళ్ళం దరూ ఇంతేరా బాబూ!—" అని గొను క్కుంటూ వెళ్ళిపోయాడు—

అత్తగారు వెళ్ళిపోయిన తర్వాత సన్నగా నవ్వుతూ ప్రసాదం తీసుకో బోతున్న ఇందిరకు గుండెల్లో భయంకర మైన నవ్వు వినబడింది—ఆ నవ్వును తను మరచిపోలేదు—అహర్నిశలూ తనను వెన్నాడుతున్న ఆ నవ్వునించి తను పారిపోలేదు—

"లేదు. లేదు—అలా జరగడానికి వీల్లేదు-నా పాపానికి నా బిడ్డకు అన్యాయం జరగడానికి వీల్లేదు-నా బొందిలో ప్రాణం వుండగా ఈ ఘోరం జరగనివ్వను—"




వళ్లు తెలియని కోపంలో ఊగిపోయింది ఇందిర—

* *

మధ్యాన్నం ఇందిర మేడమీద డ్రాయింగ్ రూములో కూర్చుని వుండగా వంటవాడు నాయర్ కాఫీ "ట్రే"తో వచ్చాడు—

ఇందిర కాఫీ కలుపుతూ వుండగా నాయర్ అన్నాడు—"నీలవేణమ్మగారి బాబు మనింటికి వస్తేనే ఇల్లంతా సందడితో నిండిపోయింది—ఇక మీకడుపున ఓదీపం వెలిగిందంటే మా అందరికీ చేతినిండా పనే వుంటుందమ్మా—ఇంటికి పిల్లలే కదమ్మా ఐశ్వర్యం!—"

నాయర్ మాటలకు ఇందిర నవ్వుకుంది నిండుగా—"నిజమేనూ" అంది ఆమెలో మాతృత్వం—

కాఫీ త్రాగుతున్న ఇందిరతో నాయర్ అన్నాడు

"నాదో చిన్నమనవండి—"

"ఏమిటది?—" మామూలుగా అంది ఇందిర—

"ఏమీలేదండి—నా ఒక్కడి సంపాదనతోనూ ఇల్లుగడవటం లేదు—పురిటి సమయంలో మీకు ఆసరాగానూ వుంటుంది—ఆతర్వాత బుల్లి జమీందారు గారికి ఆయాగానూ వుంటుంది—అని మా ఆవిడను తమదగ్గిర నౌకరీకి పెడదామనుకుంటున్నాను—తమరు ఈవిషయంలో పెద్దమ్మగారికి కాస్త రెకమండేషను ఇప్పించాలి-"

నాయర్ మాటలు వింటూంటే ఇందిరకు ఏమనాలో తెలియలేదు. తన మాతృత్వం మీద ఎందరికి ఎన్ని ఆశలు?—

అందమైన కళాకారిణికి తండ్రికావాలని కృష్ణమూర్తికి ఆశ—తండ్రిని మించిన కొడుకై ఓడలకూ, మేడలకూ, అధిపతి అయ్యే కోటీశ్వరుడికి నాయనమ్మ కావాలని శాంతాదేవి ఆశ—ఇక పోతే నాయర్ కు ఆయాఉద్యోగం మీద ఆశ—

ఇందరి ఆశల్ని కోరికల్ని తీర్చగలదా తను?—భారంగా నిట్టూర్చింది ఇందిర—

నాయర్ కాఫీ "ట్రే" తీసుకొని వెళ్ళిపోతూండగా నీలవేణి అక్కడకువచ్చింది-

"ఏమండీ!—ఇందిరాదేవిగారు!—ఒంటరిగా తపస్సు చేస్తున్నారు—బావగారి రాక కోసమేనా?—" అంటూ—

"అదేం లేదు—ఎంతసేపు తపస్సు చేసినా ఆయనప్రత్యక్షం కారని తెలుసుగా-ఇవాళ డైరెక్టర్ల బోర్డువుంది-" నవ్వుతూ అంది ఇందిర—

ఇందిర నీలవేణితో ఉంటే నీలవేణి వడిలో ఉన్న బాబు తనకాళ్ళను ఆడిస్తూ-తనలో తాను ఏదో ఆనందిస్తున్నాడు—

అదిచూచి ఇందిర—"మీవాడు మంచి ఉషారుగా ఉన్నాడే—" అంటూ వాడిని నీలవేణి వడిలోంచి తీసుకుంది—

"ఆ ముక్కుఅంతానీదే నీలూ!—" అంది ఆ చిన్నవాడిని ముద్దుపెట్టుకుంటూ--

ఇంతలో క్రిందనుంచి శాంతాదేవి పిలుపు వినబడింది—

"మీ అత్తగారు పిలుస్తున్నారు—ఇప్పుడే వస్తాను ఉండు—" అంటూ క్రిందకు వెళ్ళిపోయింది.

మేడమీద ఇందిర బాబుతో ఒంటరిగా ఉండిపోయింది—

బాబును పలకరిస్తూ—వాడితో ఏవేవో పెద్ద మాటలు మాట్లాడేస్తూ వాడిని నవ్విస్తోంది ఇందిర—వాడు హాయిగా నవ్వుతూంటే సర్వాన్నీ మరిచి ఆనందించిందామె.

"పండంటి మొగపిల్లవాడు పుట్టాలి-" అని అత్తగారి మాటలు జ్ఞాపకం వచ్చాయి—ఎంత తియ్యటి అనుభూతి!-

ఇంతలో ఆమె గుండెల్లోంచి వికటాట్టహాసం వినబడింది—

ఇందిరా!—నీకు ఇంకా భవిష్యత్తు మీద ఆశ-నమ్మకం-చావలేదన్నమాట—నువ్వుతల్లి కావడం అసంభవం-నీ కడుపులోని శిశువు బ్రతికి బయట పడటం జరగనిపని—నువ్వుతల్లిగా అనర్హురాలవు—ఏరోజునయితే నీ కడుపులో పెరుగుతున్న నన్ను తుదముట్టించాలని చూశావో—ఆనాడే నువ్వా స్థానాన్ని కోల్పోయావు-ఐశ్వర్యం అంచుమీద కూర్చున్నంత మాత్రాన ప్రపంచాన్నంతటినీ జయించగలనను కుంటున్నావు కాబోలు-డబ్బుకూ, అధికారానికి, లొంగని నైతికశక్తికి ఎదురులేనిదని మరచిపోకు—ఆశక్తితోనే నేను నీ ఆశల్ని సమూలంగా నాశనం చేస్తాను—నీ కోరికమీద గోరీకడతాను—" కసితో భయంకరంగా నవ్వుతున్నాడు ముక్కలుకాకుండా మిగిలిన ప్రకాశం ప్రతిరూపం.



నిజం పలుకుతున్న కఠోరవాక్యాలు ఇందిర తలను బ్రద్దలు చేస్తున్నాయి. తన క్రిందవున్న భూమంతా గిరగిరా తిరుగుతున్నట్టూ—ఏదో పైశాచిక శక్తి తనను చుట్టుముట్టినట్టూ అనిపించింది—

"నేనెందుకీ పాపం చేశాను?—నాకెందుకీ శిక్ష?—" అంటూ అసహాయతతో తల బాదుకుందామె.

ఇందిర పడుతున్న మానసిక వేదనను ఒక ఆటలాగా భావించి ఆమె వడిలోవున్న పసిబాబు పకపకానవ్వాడు.

ఆ నవ్వు ఇందిరకు భయాన్ని కలిగించింది—

తనపీ—తన పాపాన్నీ ఆ బాబు హేళన చేస్తున్నట్టు అనిపించింది.

"నీకుకూడా లోకువ అయిపోయానా?-నా బ్రతుకు అంత చులకన అయిపోయిందా?—నిన్నేం చేస్తానో చూడు-" అంటూ ఆ పసి బాబు పీక నులిమివెయ్యబోయింది ఇందిర—

సమయానికి అక్కడికి వచ్చిన నీలవేణి ఇది చూచి నిశ్చేష్టురాలయిపోయి "ఇందిరా!—ఏమిటి నువ్వు చేస్తున్న పని?—" అని తీక్షణస్వరంతో అంటూ-బాబుని ఇందిర దగ్గరనించి విసురుగా లాక్కుంది.

"అవును—వీడిని చంపేస్తాను నేను-నేను రాక్షసిని—హంతకురాలిని - నన్ను ఎవరూ అడ్డుపెట్టలేరు—నీకళ్ళ ఎదుటే వీడి పీక నులిమేస్తాను-" భయంకరంగా కేకలు పెడుతోంది ఇందిర—

ఆ కేకలువిని ఇంట్లో వాళ్ళందరూ అక్కడికి పరిగెట్టుకు వచ్చారు.

"ఏమైంది ఇందూ— నీ కేమైంది?-" అంటూ ఖంగారు పడి కోడలి భుజం పట్టుకుంది శాంతాదేవి—

అప్పటికే ఇందిర స్పృహతప్పి పడి పోయింది.

*           *

ఇందిర స్పృహ లేకుండా వుందని తెలియగానే కృష్ణమూర్తి హటాహుటిని ఆఫీసునుంచి వచ్చాడు—

కృష్ణమూర్తి మేడమీదకు వెడుతూండ గానే మెట్ల దగ్గిర డాక్టర్ శర్మ ఎదు రయ్యాడు—"నో, మిసెస్ మూర్తి ఈజ్ ఆల్ రైట్—కొంచెం మెంటల్ షాక్ తగిలింది—మానసికంగా బాగా విశ్రాంతి అవసరం—అంతకు మించి ఆందోళన పడనవసరం లేదు ." అంటూ తన మెడికల్ రిపోర్టు గడగడా చెప్పేశాడు కృష్ణమూర్తికి.

తేలికపడ్డ హృదయంతో కృష్ణమూర్తి ఇందిర గదిలోకి వచ్చాడు—దాదాపుగా నిద్రావస్థలో ఉన్న ఇందిర కృష్ణమూర్తి అడుగుల చప్పుడు విని కళ్లు తెరిచింది—

"ఏమిటి అల్లరిచేస్తున్నావట?—" అన్నాడు కృష్ణమూర్తి ప్రక్కనే వున్న కుర్చీలో కూర్చుంటూ—

నవ్వు రాకపోయినా బలంగా నవ్వు తెచ్చుకుంది ఇందిర——

"అదిగో—మా ఇందిర నవ్వేసింది- ఇంత త్వరలోనే నయమై పోయింది— డాక్టర్ ఏ ఆందోళనా అక్కరలేదన్నాడు-" అన్నాడు భార్యకు ఉత్సాహాన్నిచ్చే ఉద్దేశంతో—

"డాక్టర్ చెప్పనవసరం లేదు—నా కున్న జబ్బు ఏమిటో నాకు తెలుసు— ఈ జబ్బు డాక్టర్ల వల్లా మందుల వల్లా కుదిరేది కాదు—నా కిప్పుడు చావుకన్నా బ్రతుకంటేనే ఎక్కువ భయం వేస్తోంది-" అంది ఇందిర గాద్గదికమైన స్వరంతో—

"ఇందిరా!--ఏమిటిది?—" అన్నాడు కృష్ణమూర్తి ఆమె మాటలను అర్థం చేసుకోలేక—

"అవును—నేను మీకు ఎన్నో చెప్పాలనుకుంటున్నాను—ఏమీ చెప్పలేక పోతున్నాను—నేను పాపాత్మురాలినే కాదు—పిరికిదాన్ని కూడా—" అంది గాద్గదికమైన స్వరంతో—

కృష్ణమూర్తికి ఈ మాటలు కోపాన్ని తెప్పించాయి—

"యుఆర్ టాకింగ్ నాన్సెన్స్—" అన్నాడు ఉద్రేకంతో--"నిజమే—నేను మాట్లాడే మాటలకి అర్థంలేదు—నేను పిచ్చిదాన్ని—నా తప్పుల్ని క్షమిస్తారు కదూ!—" అంది ఇందిర కృష్ణమూర్తి చేతులను తన గుండెలకు బలంగా అదుము కుంటూ—కన్నీళ్లు తిరిగేకళ్ళతో—

"ఏమిటది ఇందూ " అన్నాడు కృష్ణమూర్తి భయంతో కంపించే గొంతుకతో—

"నా కోరిక ఓటి నెరవేరుస్తారా?—" అంది ఇందిర కృష్ణమూర్తి కళ్ళల్లోకి జాలిగాచూస్తూ—




"ఏమిటిది:-" అన్నాడు కృష్ణమూర్తి

బెజవాడలో కామేశ్వరి అని ఒక లేడీ డాక్టర్ వున్నారు. ఆవిడకు ఫోన్ చేసి-నేను రమ్మన్నానని చెప్పి ఇక్కడకు వచ్చే ఏర్పాటు చెయ్యండి."

"అంతేనా? కామేశ్వరి కాదు. ఇంకా ఎంత పెద్ద డాక్టర్నయినా పిలిపిస్తాను. నా ప్రాణమైనా యిచ్చి నిన్ను బ్రతికించుకుంటాను." అన్నాడు కృష్ణమూర్తి భార్య తలను ఆప్యాయంగా నిమురుతూ.

కృష్ణమూర్తి చెయ్యిని తన చెయ్యిలో బలంగా అదుముతూ అంది ఇందిర—

"చాలు-ఈ చల్లని మాటలు చాలు - నాకు ఇక ఏ మందూ అక్కరలేదు. సుఖంగా చచ్చిపోతాను-"

ఇందిర చెక్కిళ్ళమీదుగా ధారలుగా జాలు వారుతున్న కన్నీటినీ, ఆమె మాటలనూ చూచి తెల్లబోయాడు కృష్ణమూర్తి.

* *

డాక్టర్ కామేశ్వరి వచ్చిన తర్వాత కృష్ణమూర్తీ, శాంతాదేవీ, ఎంతో 'రిలీఫ్' ఫీలయ్యారు. ఇందిర చెప్పిన మాటల్ని బట్టి డాక్టర్ కామేశ్వరి ఆ జబ్బును తాస్తా చేత్తోలాగి అవతల పారేస్తుందన్న వెర్రి నమ్మకం కలిగింది వాళ్ళకు.

రాత్రివేళ పడుకోబోయేముందు ఇందిరకు ఇంజక్షన్ ఇవ్వడానికి ఆమె గదిలోకి

వెళ్ళిన డాక్టర్ కామేశ్వరి ఇందిరతో అంది___

"ఇందూ! ___ నువ్వు అదృష్టవంతు రాలవని నాకు తెలుసు గానీ-ఇంత అదృష్ట వంతురాలవని ఊహించలేక పో యా నోయ్___రియల్లీ ఐ ఎన్వీ ఇట్-"

కామేశ్వరి కళ్ళముందు తనకున్న కాడి లాక్ కార్లు-మైకాగనులు - కరెన్సీనోట్లు - విన్యాసం చేస్తున్నాయని ఇందిరకు తెలుసు.

"నేను అదృష్టవంతురాల్నా?-"

"మరి?-" అంది డాక్టర్ కామేశ్వరి మందును సిరంజ్‌లోకి ఎక్కిస్తూ.

ఇక-కామేశ్వరి చేయబోయే దేమిటో ఇందిరకు తెలుసు.

"ప్లీజ్-డాక్టర్-మిమ్మల్ని బ్రతిమాలు కుంటాను. నాకు వైద్యం చెయ్యకండి. నేను మిమ్మల్ని శ్రమపెట్టి ఇక్కడకు రప్పించింది వైద్యం చేయించుకోడానికి కాదు-" అంది ఇందిర కన్నీళ్ళను తుడుచు కుంటూ.

ఇందిర మాటలు కామేశ్వరికి అర్థం కాలేదు.

"దయచేసి ఆ తలుపులు వేసి నా దగ్గ రగా రండి - నా గుండెల్లోని బాధను మీ ఒక్కరితోనయినా చెప్పుకోనివ్వండి___"

"ఏమిటమ్మా అది?-" ఆశ్చర్యంగా అంది కామేశ్వరి తలుపులు వేసి పక్కన కూర్చుంటూ.

"ఆరేళ్ళ క్రితం పాప పంకిలంతో మీ డిస్పెన్సరీలోకి వచ్చిన నన్ను ఆదుకుని కన్న తల్లిలా కాపాడారు జ్ఞాపకం వుందా?-" అంది ఇందిర దీనస్వరంతో.

"అవును-" గంభీరంగా తల పంకిం చింది డాక్టర్ కామేశ్వరి.

"ఆనాడు మీరు నాకు చేసిన ఉపకారమే ఇవాళ నా పాలిట శాపమై నన్ను భయ పెడుతోంది. నన్ను నిలువునా కాల్చే స్తోంది-నే నీ బాధను భరించలేక పోతు న్నాను డాక్టర్-" అంది ఇందిర ముఖాన్ని చేతుల్తో కప్పుకుంటూ.

ఇందిర మాటలు విని ఆమె భుజం తడుతూ అంది కామేశ్వరి - "యు ఆర్ టూ సెన్సిటివ్!-జీవితంలో చేదును మరచి పోలేక పోతే మనిషికి మనుగడే లేదు. అయినా - ఎప్పుడో జరిగిన విషయాల ప్రసక్తి ఇప్పుడెందుకు వచ్చింది?-"

"అదే నాకూ అర్థంకాలేదు డాక్టర్ - నాకు నెల తప్పిందని తెలిసిన నాటినుంచీ ఏదో అదృశ్య శక్తి నన్ను వెన్నాడు తోంది-నేను చేసిన పాపాన్ని భయం కరంగా నా ముందు వుంచుతుంది-నాకు చాలా భయంగా వుంది. నే నీ పాపాన్ని దాచుకోలేను. అది నావల్లకాదు. చేసిన తప్పును నలుగురికీ చెప్పేస్తాను. అందరూ నన్ను అసహ్యించుకుంటేనే కాని తృప్తి లేదు. ఆ నాటినుండి నన్ను వెన్నాడు తున్న ఈ పిశాచం నించి నేను బయట

పడలేను. నేను చేసిన తప్పుకు ఇక్కడే ఈ లోకంలో నేశిక్ష లభించాలి. నా కారణంగా నా బిడ్డ బలి అయిపోతే అది చూచి భరించలేను డాక్టర్!—'' గాద్గదికమైన స్వరంతో అంటోంది ఇందిర.

''ఇందూ-నువ్వు చాలా అమాయకురాలివి. నీ అవేశంవల్ల వచ్చే పరిణామాలను కనీసం వూహించుకోలేక పోతున్నావు-నీ మాటలు వింటూంటే నాకు జాలే కాదు-నవ్వు కూడా వస్తోంది—''

''నవ్వండి డాక్టర్!-కసిదీరా నవ్వండి-జీవితంలో ఒక్కసారి పొరబాటు చేసి చిత్రహింస పడుతున్న నన్ను చూసి నలుగురితోబాటుగా మీరూ నవ్వండి. కాని - ఒక్క కోరిక. ఇది ఒక రోగి కోరిక కాదు డాక్టర్-చావుబ్రతుకుల మధ్య నున్న ఒక అమాయకురాలి అభ్యర్థన. ఈ ఇంట్లో వాళ్ళందరూ గుడ్డిగా నన్ను అభిమాస్తునిన్నారు. నా మీద ప్రేమ, జాలి, చూపడం మినహాగా వాళ్ళకేమీ తెలియదు-నేను ఇప్పుడు ఏం మాట్లాడినా వాళ్ళు నమ్మరు. ఒక రోగిష్టిదాని మాటల్లాగా - ఒక పిచ్చిదాని ప్రేలాపనలాగా కొట్టిపారేస్తారు. అందుచేతనే నేను మిమ్మల్ని ఇక్కడికి పిలిపించాను. మరి కొద్ది క్షణాలలో నేను ధర్మదేవత ఎదుట నిర్భయంగా నిలుచోవాలనుకుంటున్నాను. దానికి మీ సహకారం కావాలి. నేను చెప్పేవన్నీ నిజాలని కృష్ణమూర్తి, అత్తయ్యా నమ్మేందుకుగాను మీ సాక్ష్యం కావాలి-''

ఉద్రేకంతో ఆమె మాటలు తడబడుతున్నాయి.

''నీ మాటలకు అర్థంలేదు - డాక్టర్ వృత్తి ధర్మం మనుషులను బ్రతికించడమే కాని చంపడం కాదు - అనవసరమైన నిజాన్ని ఇప్పుడు చెప్పి నా చేతులతో నేను నిన్ను హత్య చెయ్యలేను. కాని - నువ్వు ఓ విషయాన్ని జ్ఞాపకం వుంచుకోవాలి. నైతికదృష్టితో చూచినప్పుడు మనం ఆలోచించాల్సింది మనిషి తప్పు చేశాడా లేదా అని కాదు. చేసిన పాపానికి పశ్చాత్తాపం పొందుతున్నాడా లేదా అని-నిజమైన పశ్చాత్తాపం ఎంతటి పాపాన్నయినా క్షాళితం చేస్తుంది. అదీకాక-నువ్వు చేసింది పాపం కాదు-పొరబాటు-నైతిక సూత్రాలను తన జీవిత ధ్యేయంగా నమ్మిన మహాత్ముడు కాలుజారిన స్త్రీలపై కరుణ చూపించాడు. కాని-చిత్ర మేమంటే నువ్వు నీ మీదనే జాలి చూపించుకోలేక పోతున్నావు. గర్భస్రావమన్నది ధర్మశాస్త్ర ప్రకారం తప్పిదమే కావచ్చు. కాని-నీ విషయంలో నేను ఆ రోజు ఉదాసీనత చూపించివుంటే ఒక అమాయకురాలి జీవితాన్ని నేను బలిగొన్నదాన్నయి వుండేదాన్ని-చట్టంకన్నా - నీతికన్నా-గొప్పది మానవత్వం. నీతులూ, చట్టాలూ, మనుషులు తయారు చేసినవి. కాని - మానవత్వమే దేముడి శాసనం- ఆ దైవ శాసనాన్నే నువ్వూ, నేనూ, అనుస



రించాం. ఇందులో బాధ పడాల్సిందీ, భయపడాల్సిందీ ఏమీలేదు—''

ఇందిర ఏం మాట్లాడలేదు. మౌనంగా కన్నీళ్ళు తుడుచుకుంది.

*　　　*

డాక్టర్ కామేశ్వరి ఇంతదూరం ప్రయాణం చేసివచ్చి బోలెడన్ని మందులు పోసి ఇందిర బాధ యావత్తూ తీసి పారెయ్యలేక పోయింది—నిజమే—

అయితే—ఆమె ఇందిరకు కొండంత మనస్థయిర్యాన్ని ఈయ గలిగింది.

ఈ మనస్థయిర్యం పాపాన్ని దాచు కునేందుకుగాను ఇందిరకు దట్టమయిన ముసుగును అల్లి పెడుతుందనుకుంది కామేశ్వరి.

కాని—ఆ మనస్థయిర్యంతో ఉన్న ముసుగును కూడా ధైర్యంగా తొలగించ గల బలాన్ని పుంజుకుంది ఇందిర—

ఆశక్తితోనే ఆమె — జరిగిందంతా తెలుపుతూ కృష్ణమూర్తికి ఓ సుదీర్ఘమైన లేఖ వ్రాసింది.—ఓ వారం రోజుల తర్వాత.

తన మనోవ్యధకు అద్దంలావున్న ఆ ఉత్తరాన్ని కృష్ణమూర్తి గదిలో టీపాయ్ మీదవున్న ''వార్ అండ్‌పీస్'' పుస్తకం మధ్యలో పెడుతూ అనుకుంది ఇందిర—''రాత్రి కృష్ణమూర్తి తప్పకుండా ఈ పుస్తకం చదువుతాడు—అప్పుడు తప్ప కుండా నా ఉత్తరం అతనికంట బడు తుంది—ఈ రోజుతో కృష్ణమూర్తి నన్ను అసహ్యించుకుని ఇంట్లోంచి గెంటెయ్య నన్నా గెంటెయ్యాలి. లేదా నిండు హృదయంతో క్షమించి నా పాపాన్ని కడిగెయ్యనన్నా కడిగెయ్యాలి—రెండోదే

తనుక జరిగితే నా అంత అదృష్టవంతులు మరొకరు వుండబోరు—''

* *

రోజులు దొర్లిపోతున్నాయి - మామూలుగానే—

కాని—కృష్ణమూర్తిలో చెప్పుకోదగ్గ మార్పు ఏదీ కనబడలేదు—ఎప్పటిలాగా నవ్వుతూ మాట్లాడుతున్నాడు — చెత్త "జోక్''లు వేసి నవ్వమని ఇందిరను బలవంత పెడుతున్నాడు--నవ్వితే సంబర పడి పోతున్నాడు.

కృష్ణమూర్తి ముఖకవళికల్నీ, భావాల్నీ, శ్రద్ధగా గమనిస్తూ అతడిలో మార్పుకు ఆరాట పడుతున్న ఇందిరను కృష్ణమూర్తి బొత్తిగా "డిసప్పాయింట్'' చేశాడు—

అయితే ఆ "డిసప్పాయింట్ మెంట్'' లోలోపల ఎంత ఆత్రుత కూడా వుంది—

కృష్ణమూర్తి ఉదాత్తుడో—అమాయకుడో—తెలియడం లేదు ఇందిరకు—

ఒట్టి భోళామనిషిలా కనబడే కృష్ణమూర్తిలో ఇంతటి ఉదాత్త స్వభావమున్నదా?—నమ్మలేక పోతోందామె.

నవ్వాలో — ఏడవాలో తెలియని పరిస్థితి.

ఇంతకీ అతగాడు ఉత్తరం చదివాడో లేదో అంతుబట్టడం లేదామెకు—

దీనికి తగ్గట్టుగా ప్రక్కరోజునించీ "వార్ అండ్ పీస్'' పుస్తకం కూడా కృష్ణమూర్తి గదిలో కనబడటం లేదు—ఏమైపోయినట్టు?—

"ఆ ఎర్ర అట్టఉన్న పుస్తకమాండి-బాబుగారు మొన్న ఆఫీసుకు పట్టుకెళ్లారు'' నౌఖరు వెంకన్న సాక్ష్యం చెప్పాడు.

కృష్ణమూర్తి జోళ్ళు పాలిష్ చెయ్యడం దగ్గర్నించి—అతగాడిని కారులో కూర్చో పెట్టడంవరకూ వెంకన్నదే బాధ్యత.

వెంకన్న మాటలు ఇందిరకు ఎంతో సంతృప్తి నిచ్చాయి.

సీరియస్‌గా ఏ పుస్తకాన్నయినా చదవాలనుకున్నప్పుడు ఆఫీసుకు పుస్తకాన్ని తీసుకుపోయి — విశ్రాంతి సమయాల్లో చదువుకోవడం కృష్ణమూర్తికి అలవాటు.

అయితే — సందేహంలేదు — కృష్ణమూర్తి తప్పకుండా తన ఉత్తరాన్ని చదివే వుంటాడు—

గుండెల్లోంచి ఒక్కసారిగా ఎంతో బరువు దిగినట్టయింది—తను ఎన్నో నాళ్లుగా చెయ్యాలనుకుంటున్నపనిని చెయ్యగలిగాననే గర్వము—తన సంగతి తెలిసికూడా కృష్ణమూర్తి మనస్ఫూర్తిగా క్షమించాడనే సంతోషమూ ఇందిరను ఉక్కిరి బిక్కిరి చేశాయి.

"కృష్ణమూర్తీ!—నువ్వు దేవుడివి. అయామ్ రియల్లీ ప్రౌడ్ ఆఫ్ యూ—'' ఆనందంతో గొణుక్కుంది ఇందిర—

గుండెల్లోంచి రక్తాన్నితీసి కృష్ణమూర్తి పాదాలమీద జల్లేయాలని పించిందామెకు ఆక్షణంలో—




ఈ అనుభూతిలోని ఆనందమే ఇందిరకు కొండంత బలాన్నిచ్చింది—

ఆ బలంతోనే ఆమె తనచుట్టూ అల్లుకున్న పైశాచిక శక్తిని పటాపంచలు చెయ్యగలిగింది—

అచ్చం తనలాటి ముక్కువున్న పుత్రికోత్సాహంతో కృష్ణమూర్తిని ముంచెత్తివేయగలిగింది—

కృష్ణమూర్తికి కూతురు పుట్టిందని మేడలోని నాలుగంతస్థులు—కాడిలాక్ కార్లూ-బొచ్చుకుక్కలూ-వెరసి అందరూ పండుగ చేసుకున్నారు (యి).

అయితే—కధ ఇంతటితో అయిపోలేదు.

* *

ఇది జరిగిన ఆరునెల్లకి కాబోలు ఫారెన్ వెళ్ళబోతున్న మిత్రుడికి విందు ఏర్పాటు చేశాడు కృష్ణమూర్తి—ఆ సందర్భంలో ఒకానొక "డ్రాయింగ్ రూమ్ డిస్కషన్"లో కృష్ణమూర్తి అంటాడు కదా—

"ఏమిటోనండి—గొప్ప పుస్తకాలని ప్రపంచమంతా పొగిడే వాటిలో చాలామటుకు పుస్తకాల్ని చాలామంది చదవకుండానే పొగుడుతారని నా ప్రద్దేశం—మొన్నా మధ్య "స్టాక్ బ్రోకర్" విశ్వనాధం- "వార్ అండ్ పీస్" నవలను గురించి గొప్పగా పొగిడేస్తే ఎలావుంటుందోనని లైబ్రరీనించి తెప్పించాను—మూడు పేజీలు చదివి బోర్ కొడితే ప్రక్కరోజున భద్రంగా లైబ్రరీకి అప్పగించాను. నాబోటిగాళ్ళు అంతటి "హార్డ్‌రీడింగ్" చెయ్యలేరు—ఏ పెర్రీమేజన్ పుస్తకమో

అయితే హాయిగా వుంటుంది—ఏమం టారు?—''

అక్కడే వున్న ఇందిర ఈ మాటలకు ఉలిక్కిపడింది—హఠాత్తుగా ఆమె మస్తిష్కంలో ఎన్నెన్నో భావాలు వేగంగా కదలాడి పోయాయి.

'' అంటే మీరా పుస్తకం చదవ లేదా?—''అంది తడబడే గొంతుకతో—

భార్య మాటలకు నవ్వుతూ అన్నాడు కృష్ణమూర్తి—'' అబ్బే—లేదోయి-నాకు అంతపాటి తీరిక ఎక్కడిది?—రెండో పేజీ దాటి అసలు ముట్టనేలేదు - వెంటనే ఆఫీస్ ప్యూన్ రాములుచేత లైబ్రరీకి పంపించే శాను . .''

ఇందిరకు కృష్ణమూర్తి మాటలు విన బడటం లేదు.

తన క్రిందవున్న భూమంతా తిరుగు తున్నట్టని పించింది. అయితే—తను రాసిన ఉత్తరం ఏమైపోయింది?—

కృష్ణమూర్తికి కూడా తను చెప్పుకో డానికి సిగ్గుపడే రహస్యాలు—తని జీవి తంలోని అసహ్యకరమైన సత్యాలు— అందరికీ అందు బాటులో వుండేలాగ— పబ్లిక్ లైబ్రరీలోని పుస్తకంలో ఇక వూహించుకోలేక పోయిందామె.

తను వూహించుకున్న ఆనందం— భయం—రెండూ అసత్యాలే అనే విచిత్ర మైన సత్యం ఆమె కళ్ళ ఎదుటగాలించి వెకిలి నవ్వు నవ్వి నట్టని పించింది.

ఆమె కనుకొలుకుల్లోంచి కన్నీటి బొట్టు జారింది.

ఆమె కన్నీటిని ఒక్క కృష్ణమూర్తి మినహాగా ఆ డ్రాయింగ్ రూమ్‌లో వున్న వ్యక్తులెవరూ చూడలేదు. ఒకవేళ చూసినా ఆ కన్నీరు ఎందుకో-ఎవరికోసమో వారికి తెలియదు.

కాని—కృష్ణమూర్తికి అకన్నీటి కథ తెలుసు!

ఒక్క కృష్ణమూర్తికే కాదు—ఇందిర ఉత్తరాన్ని రహస్యంగా తన కడుపులో దాచుకున్న కృష్ణమూర్తి ఐరన్ సేఫ్‌కీ తెలుసు !!





# పొగ మంచు

మంచుకురుస్తోంది. కిటికీ అద్దాలపై మంచు పేలిపోయింది. బయటి వాతావరణము ఏమాత్రమూ కనిపించటం లేదు. దూరంగా ఫిరంగుల మ్రోత విన వస్తోంది. ఆకాశంలో ఫట్! ఫట్!! మంటూన్న ధ్వనులూ వినిపిస్తోన్నాయి. పేషెంటుల తలలప్రక్కనున్న ఎలక్ట్రిక్ హీటర్సు ద్వారా వార్డ్‌లోని వాతావరణం వెచ్చబడుతోంది.

సిగరెట్ వెలిగించి వార్డ్ యివతలి కొచ్చాడు నర్సింగ్ అసిస్టెంట్ రాజు. దూరంగా హిమాలయాలపై ఓప్రక్క సన్నని నీరెండ ఆవహించిఉంది. మరో ప్రక్క దట్టమైన పొగమంచు పేరుకుని పోయి ఉంది. మంచు ముసుగు వేసుకున్న హిమాలయాలు నీరెండలో ధవళకాంతు లీను తున్నాయి. పొగమంచులోని సన్నని చీకటి దూరంగా ప్రేలుతున్న ఫిరంగుల మంటలు మధ్య మధ్యన చీలుస్తున్నాయి. ఆకాశంలో బాణాసంచా ప్రేలినట్టు జ్వాలలు చెలరేగు తున్నాయి.

రాజు ముఖం జేవురించింది.

ఈ యుద్ధం ఏ పరమార్థాన్నాశించి జరుగుతోంది? పొరుగు దేశాన్ని కబళించా లన్నది ఎదుటి వాడి నిర్ణయం. రక్షించు కోవాలన్న తాపత్రయం యివతలి వాడిది. ఒకణ్ణొకడు చంపుకొని సాధించే గెలుపు యొక్క ఫలితం ఎవరికి దక్కుతోంది? మంచుకొండల్లో మరఫిరంగుల సాన్నిహిత్యంలో రంపపుకోత ననుభవిస్తోన్న

యస్. పురుషోత్తమాచారి

సైనికుడికా? లేక మెత్తని పరుపుల దొంతరలలో మెలికలు తిరుగుతూ అదేశాలిచ్చే రాజకీయనాయకులకా? ఏవిటీ జీవితం? విజయం సాధించాలన్న ఆకాంక్ష, సాధించానన్న తృప్తిలో ఈ సామాన్య సైనికుడి రుధిరం వేగాన్ని పుంజుకుంటుందెందువల్ల?

"రాజూ!" అన్నపిలుపు ఆ రోచల్నుంచి అతన్ని వాస్తవ జగత్తులోకి పడవేసింది.

మంచుకన్నా తెల్లనిదుస్తుల్లో నర్స్ మేరీ వార్డ్ చివరినుంచి పిలిచింది. నడిచాడతను.

"చలిలో ఏవిటా ఆలోచన రాజూ! బెడ్‌నంబర్ సిక్స్ పేషంట్ మంచంలోంచి జారిపడ్డాడు. అసలే ఫ్రాక్చరయిన కాళ్లు!"

వెన్నున చరిచినట్టయింది రాజుకు. తూనీగలా పరిగెత్తాడు వార్డ్‌లోకి. అప్పటికే లేచి నడవగలిగిన పేషెంట్సు కొందరు బెడ్ నెంబరు సిక్స్ పేషెంటును లేవనెత్తి మంచంలో పడుకోబెట్టారు. కాని వారతన్ని కంట్రోల్ చేయలేకపోయారు. మంచంలోంచి ఉరకటానికి ప్రయత్నిస్తున్నాడావ్యక్తి.

"ఆ లాంగ్‌రేంజ్‌గన్ నేను లేందిపని చేయుదు. ఆ సెక్టరును కాపాడాలి. నన్ను వెళ్ళనీయండి ప్లీజ్?" అరుస్తూ నానా గొడవ పెడుతున్నాడతను.

రాజు నిర్ఘాంతపోయాడు.

రెండుకాళ్లూ పోయిన ఈ వ్యక్తికేమిటీ దేశాభిమానం? ఏ శక్తి అతన్నిలా కదిలిస్తోంది? తప్తనయనాలతో మార్ఫియా యిచ్చాడు రాజు.

ఘనఘోంతరాశాలు దద్దరిల్లేంతటిధ్వని వినవచ్చింది పొగమంచున్న దిసనుంచి. ఫిరంగుల మోత ఆగిపోయింది. ఆకాశంలో నిశ్శబ్దం ఆవరించింది. అంటే ఆ ప్రక్కన బాంబుతుపడి ఆ ప్రాంతమంతా భస్మీపటలమయిందన్నమాట. గాఢంగా నిట్టూర్చాడతను.

"అయిపోయింది! సర్వనాశనమయిపోయింది! తూర్పు దిసంతా స్మశానమయిపోయింది!" ప్రక్కవార్డ్‌లోని పేషెంటెవరో అరుస్తున్నాడు. కిటికీ తెరిచి చూచాడు రాజు. తెరచిఉన్న అవతలివార్డ్ తలుపుల్లోంచి కనిపించిన దృశ్యంచూచి తల ప్రక్కకు తిప్పుకొన్నాడతను. అపేషెంట్ తలనిండా తెల్లని ముసుగు కప్పుతోంది నర్స్‌మేరీ!

అరగంట గడిచింది.

అకాశంలో బరబర ధ్వని వినవచ్చింది. పెద్దరాబందుల్లా రెండు హెలికాప్టర్‌లు ఆస్పత్రి వైపు దూసుకొస్తున్నాయి. గుండెలరచేతుల్లో ఉంచుకొని ఆవంకే చూడసాగారంతానూ. దాపులోకొస్తోన్నవానిపై స్వదేశ చిహ్నాలుచూచి తృప్తిగాశ్వాసవదిలారంతానూ. మరుక్షణంలోనే అవి




హాస్పటల్ హెలీపాడ్‌లో వ్రాలాయి. హాస్పటల్ స్టాఫంతా కంగారుగా పరుగులు తీస్తున్నారు. కొందరు వీల్‌ఛైర్స్‌ను త్రోసికెడుతున్నారు. కొందరు స్ట్రెచర్లను మోసుకెడుతున్నారు.

హెలికాప్టర్లనుంచి ఎనిమిది క్షతగాత్రుల స్పృహకోల్పోయిన దేహాలు దించబడ్డాయి. ఆపరేషన్ థియేటర్‌లో హడావిడి. వార్డ్‌నంబర్ ఫోర్ చివర ఉన్న స్టోర్స్‌వైపు పరుగెత్తు కొచ్చారు కొందరు డాక్టర్లు. రాజు వెళ్ళి స్టోర్ తెరిచాడు. చేతికందినన్ని డెక్ట్రోస్ర్టిమ్ బాటిల్స్‌తో వచ్చినంత వేగంగా పరిగెత్తారంతానూ.

ఆ హెలికాప్టర్లో క్రొత్త వార్తను తీసుకొచ్చాయి. తూర్పుదిసన శత్రుస్థావరాలపై మనవాళ్లే బాంబులువేసినట్టూనూ, అవతలి ప్రక్కన అంతా చెల్లబడిపోయినట్టూనూ.

పేషెంట్లంతా అవార్తవిని విజయోత్సాహంతో కేరింతలు కొడుతున్నారు. ప్లేట్లను స్పూన్లతో వాయిస్తూ ఎవరి భాషలో వారు విజయ గీతాలు పాడుకుంటున్నారు.

ఒకడి మరణంలో మరొకడు పొందే మహదానందం!

తూర్పు ప్రాంతం ప్రశాంతంగా ఉంది కాబట్టి సైనికులను త్వరిత గతిని ట్రీట్ చేసి పంపనవసరం లేదనీ వారిని విశ్రాంతి తీసుకోనిమ్మనీ వచ్చిన ఆర్డర్స్ ననుసరించి వార్డ్ డాక్టర్సు కొచ్చిన మెమో కాగితాన్ని చూస్తుండగానే ఎమర్జెన్సీ నైట్స్‌లో వారం రోజుల్నుంచీ నిద్రెరగని రాజుకు





నిద్రమత్తు ముంచుకువచ్చింది. కను రెప్పలు భారంగా మూతవడసాగాయి. మెల్లిగావెళ్ళి డాక్టర్ టేబుల్‌పై ఉంచాడా కాగితాన్ని.

"రాజూ! ఈ బెడ్ సవరించు!" కేప్టెన్ ఆదేశం గంభీరంగా వినిపించింది వార్డ్‌లో. తృళ్ళిపడి పరిగెత్తాడు. సవరించిన బెడ్‌లో అంతకుముందే హెలికాప్టర్‌లో వచ్చిన ఓ పేషెంటుని పడుకోబెట్టి వెళ్ళిపోయారు స్టాఫ్ నర్సులు.

ఆవ్యక్తివంక చూచాడు రాజు.

ఏభై ఏళ్లుండవచ్చు. తలంతా బాండేజితో కప్పబడిఉంది. కేస్‌షీటు తీసి చూచాడు. తలంతా ప్రాక్చరయింది. కిడ్నీలు నలిగిపోయాయి. అతనికి దాపులోని హీటర్ అన్‌చేసి తనటేబుల్‌వైపు వెళ్ళాడు రాజు.

లంచ్ హవర్‌లో వార్డ్‌లోని పేషెంట్లంతా భోంచేస్తున్నారు. క్రొత్తగా వచ్చిన ఆ పేషెంటుకు స్పృహ వచ్చినట్టుంది. ప్రక్కబెడ్‌లోని వ్యక్తితో మెల్లిగా ఏదో మాట్లాడుతున్నాడు.

నర్స్‌మేరీ వార్డ్‌లోకి వచ్చింది.




"సిస్టర్!" పిలిచాడావ్యక్తి మంద స్వరంతో.

మేరీ అతనివైపు వెళ్ళింది.

అతనేదో చెప్పాడామెకు.

"రాజూ!" మేరీ పిలిచింది.

"ఇతను తెలుగువాడు. తెలుగువారెవరన్నా ఉన్నారేమోనని అడుగు తున్నారు. అతని సంగతేవిటో చూడు." అంటూ వెళ్ళిపోయింది. వెళ్ళి అతని ప్రక్కనే ఉన్న టీపాయ్‌పై చతికిల బడ్డాడు రాజు.

"రాజు అంటారండి నన్ను!"

"నేను సూబేదార్ జానకిరాంను! చిర్నవ్వు తెచ్చుకోడానికి చాలా బాధపడ్డాడతను.

"మీదేవూరు బాబూ!"

"గూడెం దగ్గరి మాధవరమండి!"

"సంతోషం బాబూ! మాది ఏలూరు!"

"పిలిచారట!" అన్నాడు రాజు.

ఓ క్షణం కళ్లుమూసుకున్నాడు జానకిరాం. బాధ అతన్ని మెలికలు త్రిప్పటం ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది.

"అవును బాబూ! నాయీ స్థితిలో ఓ తెలుగువాడి పరామర్శ అవసరమని పిలిచాను. ఓ ఉత్తరం వ్రాసిపెట్టే తీరికుందా బాబూ నీకు?"

"అలాగే నండీ! తప్పకుండా వ్రాసి పెడతాను. ఏం రాయాలో మొదట చెప్పండి. తర్వాత నేను వివరంగా వ్రాస్తాను."

"అలాగే బాబూ! ఏవిటో విధి వైచిత్రం? యుద్ధం రాకపోతే వారం రోజుల క్రితం యింట్లోఉండేవాడిని. డిశ్చార్జి

వచ్చింది. యిరవైయ్యేడేళ్ళ సర్వీసులో ఉత్తరం మరోహరి చేత వ్రాయించుకునే అవసరం రాలేదు. ఈ రోజు వచ్చింది. బహుశః జీవితంలో యిదే చివరి ఉత్తరం కావచ్చు.''

''అలాంటి నిరుత్సాహాన్ని పెంచుకోకండిసార్! యిక చెప్పండి!'' అన్నాడు రాజు.

''చెబుతాను నాయనా! చెపుతాను. మనసులో ఉన్న బాధ ఒకరికి చెప్పుకున్నపుడే శాంతి.

''మగనలుసుకై ఎదురు తెన్నుల్లో ఎదురు దెబ్బలుతిన్నాను. ఆరుగురాడ పిల్లన్ని కని ఆలనా పాలనా చూడలేక పోయాను. పిల్లలు తల్లిలేనివాళ్లు కావటం, నేను దూరాన ఉంటం, వారి బాగోగులు చూచేవాళ్ళులేక చెడుదారుల పాలయ్యారు. యింతవరకు కాణీ మిగల్చకుండా పెద్దమ్మాయిపేర డబ్బుపంపుతూ వచ్చాను. అంతా చదువుతున్నారనుకో. వింటున్నావా బాబూ?'' ప్రశ్నార్థకంగా రాజువంక చూచాడాయన.

''వింటున్నానండి!'' అన్నాడు రాజు లేనిఓపికను కొనితెచ్చుకుంటూ!.

''నాలాంటి పేషెంట్లను ఎందరినో చూసి ఉంటావు. అంతా యిలాగే మిమ్మల్ని విసిగిస్తుంటారనుకుంటాను. కాని నా విషయంలో కొంచెం ఓపిక తెచ్చుకో బాబూ! నాకెందుకో నా జీవితానికి చరమదశ దాపులోకొచ్చిందనిపిస్తోంది. ఏక్షణంలో కన్నుమూతపడేది తెలియదు. నా విషయం తెలిసిన వారెవరైనా ఉంటే నా తర్వాత నా బిడ్డలకేమైనా ఉపయోగ పడ గలుగు తారనే నా తాపత్రయం బాబూ!''

''ఈ స్థితిలో యిలాంటి ఆలోచనలు కూడవు సూబేదార్‌గారూ! నావల్లఅయ్యే సహాయం అంటూఉంటే మీకు తప్పక తోడ్పడతాను. యిక చెప్పండి.''

''ఎదిగిన ఆడపిల్లల్ని ఎవరి పంచన ఉంచను బాబూ! ఏదోబంధువులనదగ్గ వారి సహాయంతో యింతకాలం నెట్టుకొచ్చాను. కాని ఈ మధ్యనే మావూరినుంచి ఓస్నేహితుడు వ్రాసిన ఉత్తరం నాగుండెల్ని చీల్చింది. మారెండో అమ్మాయి గతనెల్లాళ్లుగా కనిపించటం లేదట. దాన్ని గురించి అంతా చెడుగా చెప్పుకుంటున్నారని తెలిస్తే ఏ తండ్రి గుండెలు బద్దలవవు బాబూ? నా కుటుంబం రచ్చకెక్కి, అవమానాల పాలవటం ఎలాసహించను? రిలీజు కప్లై చేసాను. అర్డర్లు వచ్చాయి. మూటముల్లే సర్దుకుని బయలుదేరు దామనుకునే సరికి యుద్ధం వచ్చింది. అర్డర్సు కాన్సల్ చేశారు. ఫ్రంట్‌కెళ్ళాలిసి వచ్చింది. దాని ఫలితంగా యిలా ఈ మంచంపై విశ్రాంతి అవసరమయింది.

''బాంబు ప్రేలుడుకు నా తల చిట్లిపోయింది. నేనుయిలా మాట్లాడగలుతున్నాను. కాని యిక బ్రతకను బాబూ!

కాని ప్రాణం పోకముందు నేను చేయాల్సిన పని కేవలం ఈ ఉత్తరం వ్రాయడమే. దాని ద్వారానే నా పిల్లలు తమ అదృష్టాన్ని పరీక్షించుకోవాల్సి ఉంటుంది. నా కథంతా చెప్పి నీకు విసుగు కలిగించాను బాబూ! ఆ! కాస్త కాగితం కలం తీసుకు రాగలిగితే నేను చెబుతుంటాను, వ్రాద్దువు గాని," అంటూ సాభిప్రాయంగా రాజు వంక చూచాడు సూబేదార్ జానకిరాం.

"అలాగేనండి!" అంటూలేచి తన టేబుల్ దగ్గరికి వెళ్ళ బోయాడురాజు. యింతలోనే బెడ్ నంబర్ సిక్స్ పేషెంటు పెద్ద గొడవచేస్తూ మంచంలోంచి ముందుకుతూలాడు. క్రిందపడి గిలగిల్లాడుతున్న అతని ఫ్రాక్చరయిన కాలిఎముక స్థానభ్రంశం పొందింది.

గుండెగుభేల్ మంది రాజుకు. జానకిరాం కథవింటూ తను యితర పేషెంట్ల గొడవ మరచిపోయాడు. తన్ను తాను నిందించుకొంటూ డి. ఎమ్. వో. కు ఫోన్ చేశాడు. డాక్టర్ వచ్చి అతని కాలిని సవరించే సరికి సాయంకాలం ఆరయింది.

రాజు రిలీవర్ బల్‌బీర్‌సింగ్ వచ్చాడు.

సింగును చూడగానే రాజుకు అలసట ముంచుకువచ్చింది. వారం రోజులుగా నిద్రనోచుకోని కళ్లుమూతలుపడసాగాయి. గబగబా డ్యూటీ హాండోవర్ చేశాడు రాజు. వెంటనే వెళ్ళి తనరూంలో మంచంపై వాలిపోవాలనుందతనికి. గడప వైపు అడుగువేయ బోయిన అతనికాళ్ళకు జానకిరాం పిలుపు బంధంవేసింది.

జానకిరాం కథవింటూ తను యితర పేషెంట్ల గొడవ మరచిపోవటమూ, బెడ్. నంబర్ సిక్స్ విషయంలో తనుచేసినపొరపాటు, ఆపై డాక్టరు ద్వారా తిన్న చీవాట్లూ గుర్తుకొచ్చి అతనిపై అకారణ విసుగు జనించింది రాజుకు. కాని జానకిరాం కా విషయం తెలిసి రానివ్వలేదు.

"జానకిరాం గారూ! ఉత్తరం ఉదయం వ్రాసిపెట్టగలనండి. ప్రస్తుతంవీలుకాదు." అంటూనే అతని పల్స్, టెంపరేచరూ చూచాడు. పల్సు తృప్తికరంగానే ఉన్నప్పటికీ కొంచెం టెంపరేచరుంది. మందుల ప్రభావం ఉదయానికి జ్వరాన్ని తగ్గింపవచ్చు. అదీకాక పోస్టు మర్నాడు పదింటికి గాని వెళ్ళదు. ఈ లోపల విశ్రాంతి చాలా అవసరమనిపించింది రాజుకు. ఈ వేళ ప్రశాంతగా ఉంది. రేపుమళ్ళీ శత్రువు లటాక్ చేస్తే యిహ కాజువాలిటీస్‌తో విశ్రాంతి ఉండదు. అదే ఉద్దేశ్యంతో అన్నాడురాజు.

కాని జానకిరాం కళ్ళలోనీళ్లు సుళ్లు తిరిగాయి.

"బాబూ! ఈ రాత్రి గడిచే నమ్మకం మాత్రం నాకులేదు. నేను కన్నుమూయక ముందే ఈ ఉత్తరం వ్రాయాలి. ఈ చిన్న సహాయం నా తుదికోరికగా చేసి పెట్టు నాయనా!"

''జానకిరాం గారూ! ఎందుకలా నిరాశపడతారు. వారం రోజుల్నుంచి నాకు నిద్రలేదు. ఖాళీగా ఉన్న క్షణం కళ్లమూతలు పడతున్నాయి. నన్ను నమ్మండి సార్! రేపు రాగానే మీ ఉత్తరం వ్రాసేకనే మరో పని చూచుకుంటాను.'' అంటూన్న రాజు కళ్ళముందు మసగకమ్ముకొస్తోంది. నిద్రావస్థలోనే ముందుకు తూలాడతను.

తప్త నయనాలతో రాజు అవస్థనుగమనించాడు జానకిరాం, అతని హృదయం జాలితో నిండిపోయింది.

''సరే వెళ్లుబాబూ! ఉదయమే చూతాం!'' అన్నాడు గాద్గదికంగా.

రాజు కళ్లు తెరిచాడు.

''సుబేదార్ గారూ! మీరు ప్రతి నిమిషమూ జీవితంపై ఆశను సన్నగిల చేసుకొంటున్నారు. బ్రతుకుపై ఆశను చంపుకోవటం ఎంతో అవివేకం. మీరు తప్పక కోలుకుంటారు. ధైర్యంగా ఉండండి. వస్తాను.'' వెడుతూనే జానకిరాం వంక చూచాడు రాజు.

జానకిరాం కళ్ళనుంచి రెండశ్రుకణాలతని చుబుకాలపై జారాయి.

* *

ఉదయం వస్తూనే జానకిరాం బెడ్ రోల్ చేసి ఉండటం గమనించి విస్తుపోయాడు రాజు.

''సింగ్! ఆ పేషంటునే వార్డుకు మార్చారు?'' కంగారుగా అడిగాడు.

''కోల్డు రూంకు!'' సింగ్ నిర్వికారంగా జవాబిచ్చాడు. గుండెల్లో గునపం దిగవేసినట్టయింది రాజుకు.

''పూర్ ఫెలో! రాత్రి సడన్‌గా తలలోంచి బ్లీడింగ్ మొదలయింది. ఎంత ప్రయత్నించినా ఆపలేకపోయాము. బిఫోర్ డెత్ అతనేదో ఉత్తరం వ్రాయాలని గొణిగేడు. కాని ఎవరమూ ఆ విషయం పట్టించుకోలేకపోయాం.'' అంటూన్న సింగ్‌ను తప్పించుకు పిచ్చివాడిలా పరిగెత్తాడు రాజు. బయట మసకతో ఫాగ్ దట్టంగా వుంది. ముఖంపైన సన్నని మంచుతెరలు గీతలు వేస్తున్నాయి. రాజు గుండెల్లో పొగమంచు పేరుకుపోయినట్టయింది.



# హరిశ్చంద్రుడి కథ




బి.విద్యాసాగర్

రామారావు ఆఫీసుకు వెళ్ళడానికి బస్ స్టాపు దగ్గర నుంచున్నాడు. ఎంత సేపటికీ బస్సు రావడం లేదు. పది గంటలు దాటింది. ఇంతలో రాజారావు వచ్చాడు. ఇద్దరూ వొక బేంకులో గుమాస్తాలుగా పని చేస్తున్నారు.

“ఏమోయ్ రాజారావు! బస్సు లేదు. ఏమిచేద్దాము! టాక్సీలో వెళ్దామా!” అన్నాడు రామారావు ఖంగారు పడుతూ.

“ఊరికే ఖంగారు పడకు! ఒక పది నిముషాలు ఆలస్యంగా వెళ్తే ప్రమాదం యేమిలేదు” అన్నాడు రాజారావు.

"అలస్యంగా వెళ్తే బాగుంటుందా! ఏజంట్ విసుక్కుంటాడేమో! మన కాతా దార్లు మన కోసం కనిపెట్టుకు కూర్చోవాలి కదా!

"నువ్వు పూరికే భయపడమాకు! ఒక పావు గంట అలస్యం అయినా ఫరవా లేదు. గంట లేటుగా వస్తున్నారు కొంత మంది."

"ఎవరో కొంత మంది ఆలస్యంగా వస్తున్నారని మనం లేటుగా వెళ్తే బాగుంటుందా!"

"బస్సు లేకపోతే యేమి చేస్తాము! అదిగో మాటలోనే బస్సు వచ్చింది. వెళ్దాము పద" అన్నాడు రాజారావు.

ఇద్దరూ బస్సు యెక్కారు. అప్పటికి 10-25 అయింది. బస్సులో జనం బాగా వున్నారు. చాలామంది నుంచుని వున్నారు. కదిలేందుకు సందులేదు. కండక్టర్ అటూ యిటూ తిరుగ లేక వొకచోట నుంచున్నాడు. పావుగంట గడిచింది. బస్ స్టాప్ వచ్చింది. చాలామంది దిగారు. రామారావు రాజారావుకూడా దిగారు. రామారావు కండక్టర్‌ని పిలిచి, "నాకు టికెట్ యివ్వలేదు. నేను ముషీరాబాద్ నుంచి వస్తున్నాను." అంటూ పదిహేను పైసలు యిచ్చాడు. అతను అది జేబులో వేసుకున్నాడు. టికెట్ యివ్వలేదు. రామారావు అదేమి పట్టించుకోకుండా, గబగబా నడుస్తూ, త్వరగా ఆఫీసుకు చేరు కోవాలని ఆదుర్దా పడుతున్నాడు. పక్కన నడుస్తున్న రాజారావు.

"నెమ్మదిగా నడు! తొందర లేదు! మరొక అయిదు నిమిషాలు అలస్యం అయితే కొంపలేమి అంటుకోవు. అదిసరే బస్సుదిగాక కండక్టర్‌ని పిలిచి డబ్బులిస్తా వేమిటి!" అన్నాడు.

"కండక్టర్ నాకు టికెట్ యివ్వలేదు. అందుకని పిలిచి యిచ్చాను." ఉచితంగా ప్రయాణం చేయడం తప్పు కదా!" అన్నాడు రామారావు.

"బాగుంది! ఇప్పుడు మనతోపాటు దిగిన వాళ్ళలో చాలామంది దగ్గర టికెట్లు లేవు. వాళ్ళంతా నీలాగా కండక్టర్‌ని పిలిచి డబ్బులు యిస్తున్నారా? లేదు. వాళ్ళదారిన వాళ్లు పోతున్నారు. కండక్టర్ టికెట్ తీసుకున్నారా అని అడిగితే, చాలమంది తీసుకోక పోయినా తల వూపుతున్నారు. నువ్వు గమనించావో లేదో! నువ్వు హరిశ్చంద్రుడిలాగా, పిలిచి డబ్బులు యిచ్చావు. అది సద్వినియోగం అయిందా? లేదు! కండక్టర్ టికెట్ యివ్వకుండా జేబులో వేసుకున్నాడు," అన్నాడు రాజారావు.

"పోనీ, యేమి చేస్తాము! వాడి కర్మ్మకర్త వాడిది" అన్నాడు రామారావు.

ఇద్దరూ ఆఫీసు చేరుకున్నారు. రాజారావు 10-30 అని మార్కు చేసి సంతకం చేసి తన సీటుకు వెళ్ళి కూర్చు

న్నాడు, రామారావుమాత్రం అకౌంటెంట్ దగ్గరకు వెళ్ళి "క్షమించండి సార్! బస్సు లేక అలస్యం అయింది." అని అటెండెన్స్ రిజిష్టర్‌లో 10-45 గం॥ లు వ్రాసి సంతకం చేశాడు. అవేళ బేంకులో పని బాగావుంది. 2-30 గం॥ అయింది. అంతా టిఫిన్ తీసుకోవడం కోసం లేచారు. కొంతమంది బ్రహ్మచారులు హోటలుకు వెళ్దామని, బయటకు వెళ్ళారు. గృహస్థులు టిఫిన్‌బాక్సు తీసుకొని లంచ్‌రూమ్ లోకి వెళ్ళారు. టిఫిన్, కాఫీ తీసుకున్నాక, అంతా కబుర్లలో పడ్డారు. రాజకీయాలు, సినిమాలు, ఆటలు గురించి వ్యాఖ్యానాలు చేస్తున్నారు. కొంతమంది న్యూస్ పేపర్లు, మేగజైన్స్ చదువుతూ కాలక్షేపం చేస్తున్నారు. ఎవరూ టైము సంగతి పట్టించుకోవడం లేదు. బేంకులో, అరగంటలో టిఫిన్ తీసుకుని మళ్ళీ డ్యూటీలోకి రావాలని నియమం ఉంది. కాని అవి యెవరూ ఖచ్చితంగా పాటించరు. గంటనుంచి, గంటన్నరదాకా ఈ అవకాశాన్ని వినియోగించు కుంటారు. రామారావు అరగంట కాగానే, మళ్ళీ సీటుకు వెళ్ళి పోయాడు.

"ఆగవోయ్ హరిచంశ్చంద్రా! అప్పుడే తొందరేమిటి! ఇంకొక అరగంట పోయాక వెళ్ళ వచ్చును" అన్నాడు రాజారావు.

"పని చాలావుంది.వోవర్‌టైము చేయవలసివస్తుంది, వెంటనే వెళ్ళకపోతే."

"చెయ్యవోయ్! తప్పేముంది! మేమంతా చేయడం లేదా!"

"అనవసరంగా బ్యాంకుకు దండుగ చేయడం దేనికి! ఇప్పుడు వెంటనే డ్యూటీలోకి వెళ్ళిపోతే, 5-30 గం॥ కల్లా పనిపూర్తి చేసుకుని యింటికి వెళ్ళిపోవచ్చును."

"నీలాంటివాళ్లు యెవరూ ఉండరోయ్! చాలామంది పని లేకపోయినా వోవరుటైమ్ చేసి, డబ్బు సంపాదిస్తుంటే, నువ్వు పనివున్నా, వోవర్‌టైమ్ చేయకుండా వెళ్ళిపోతానంటున్నావు. భలే వాడివే!" అన్నాడు రాజారావు.

"నాకు అనవసరంగా ఓవర్‌టైమ్ చేయడం అంటే యిష్టం వుండదు."

"నువ్వు వొక్కడివీ 'సిన్సియర్'గా పనిచేయడం వలన బేంకుకు లాభాలు యేమిరావులే! ఫరవాలేదు కూర్చో!"

"కాదులే! నాకు పనివుంది వెళ్ళాలి!" అని రామారావు తన సీటుకు వెళ్ళి కూర్చుని తన పనిలో నిమగ్నుడయాడు. మిగతా వాళ్ళంతా మరొక ముప్పావుగంట గడిచాక, మళ్ళీ డ్యూటీలో చేరారు. ఏవో కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు కాని, చురుకుగా యెవరూ పని చేయడం లేదు. రామారావు మాత్రం యెంతపనివున్నా, హడావుడిగా చేసి పారేస్తున్నాడు. మిగతా వాళ్ళు 5-30 గం॥ దాకా కాలక్షేపం చేసి వోవర్‌టైమ్ మొదలు

పెట్టారు. రామారావు పని పూర్తి చేసుకుని వెళ్ళి పోయాడు. "వట్టి హరిశ్చంద్రుడు" అని తనలో నవ్వుకున్నాడు రాజారావు. పని లేక పోయినా రాత్రి 7-30 గం॥ దాకా కాలక్షేపం చేశాడు రాజారావు.

మర్నాడు రోడ్ ట్రాన్స్‌పోర్టు కార్పొరేషన్ సిబ్బంది సమ్మె చేయడం వలన బస్సులు లేవు. చాలామంది ఆరోజు శలవు పెట్టారు, కాని రామారావు టాక్సీలో బేంకుకు వెళ్ళాడు. అకౌంటెంటే అతనిని చూసి మెచ్చుకున్నాడు, రాజారావు, ఇంకా కొంత మంది గుమస్తాలు శలవు పెట్టారు.

రామారావు బేంకులోచేరి వొక సంవత్సరం దాటింది. అతనికి వొకసారి అర్జంటుగా డబ్బు కావాలసి వచ్చింది. ఎవరి దగ్గర అప్పు తీసుకుందామా అని ఆలోచిస్తున్నాడు. రాజారావు దగ్గర అతనికి బాగా చనువు వుంది కనుక, అతనిని అడుగుదామనుకున్నాడు. అవేళ బేంకులో అడిగేశాడు.

"రాజారావు! నీ దగ్గర వొక వంద రూపాయలు ఉంటే యివ్వు! అర్జంటుగా కావాలి, వచ్చే నెలలో యిస్తాను." అన్నాడు.

"ఏమిటి సంగతి!"

"బంధువుల యింట్లో పెళ్ళికి వెళ్ళి రావాలి. రైలు ఖర్చులకు, ప్రజంటేషన్‌కీ, వాటికీ వొక వందరూపాయలు దాకా కావాలి."

"చంపేశావే! నాదగ్గర లేదే." అన్నాడు రాజారావు.

"పోనీ మన స్నేహితులు యెవరి దగ్గర అయినా అప్పు పుడుతుందేమో!" అన్నాడు రామారావు,

"ఎవరి దగ్గర ఈ నెలాఖరు రోజుల్లో వుండదు.

"అయితే యేమిటి చేయడం!"

"దీనికింత ఆలోచనదేనికి! అన్నట్లు, ఈ యేడు మెడికల్ బిల్ తీసుకున్నావా,"

"లేదు. తీసుకోలేదు, నా కేమయినా జబ్బు చేస్తేకదా! దుక్కలాగా వున్నాను. మెడికల్ బిల్ యెలా తీసుకుంటాను?" అన్నాడు రామారావు అమాయకంగా.

"వర్రి అమాయకుడిలాగా వున్నావే! మేమంతా జబ్బు చేస్తేనే మెడికల్ బిల్ తీసుకుంటున్నామనుకున్నావా! అదే మీ లేదు. ఎప్పుడు డబ్బు అవసరం అయితే, అప్పుడు డాక్టరుకు వొక పదిరూపాయలు యిచ్చి బిల్లు సృష్టిస్తాము. అది బేంక్‌లో యిచ్చి పాస్ చేయించు కుంటాము." అన్నాడు రాజారావు.

"ఛ! దొంగబిల్సు యిస్తున్నారా! తప్పు కదూ! అన్యాయం కదూ! మీరంతా బేంకును మోసం చేస్తున్నారన్న మాట!"

"నాయనా! హరిశ్చంద్రా! నీ దృష్టిలో అంతా తప్పే! అంతా అన్యాయమే! ఓవర్‌టైము చేయడం తప్పు! మెడికల్ బిల్లు సృష్టించడం తప్పు!! రేపు బేంకు




వాళ్ళు బోనస్ యిస్తే యెందుకు, జీతాలు యిస్తున్నారుగా, అఖ్ఖరలేదు లెండి అనేటట్లు వున్నావు. నువ్వు క్రొత్తగా బేంకులో చేరావుకదా? ఇక్కడ పరిస్థితులు నీ కేమి తెలియవు. మరీ మడిగట్టుకు కూర్చుంటే, బేంకులో పనిచేయడం కష్టం! కాస్త సర్దుకు పోవాలి,''

''అనవసరంగా ఓవర్ టైము చేయడం, దొంగ మెడికల్ బిల్లు తయారు చేయడం అన్యాయం అక్రమం కాదా!''

''అన్యాయమే! కాదనను! కానీ డబ్బు సంపాదించాలంటే కాస్త కక్కుర్తి పడక తప్పదు .... ఇదంతా యెందుకు! నీకు వందరూపాయలు కావాలన్నావు కదా! సాయంత్రం నాతో రా! డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళి బిల్లు తయారు చేయిస్తాను. నీ దగ్గర డబ్బు లేకపోతే, డాక్టరుకు యివ్వవలసిన పది రూపాయలు నేను యిస్తాను. రేపు బిల్లు పాస్అయినాక నాకు తిరిగి యిద్దువు గానీ.''

''నేను బిల్లు తీసుకుంటే, మన ఏజంటే పాస్ చేస్తాడా! దుక్కలాగా వున్నావు. నీకు జబ్బేమిటి'' అని అడుగుతాడు.''

''ఏమి అడుగడు! మెడికల్ బిల్‌తో పాటు, నువ్వు వొకలెటర్ యిస్తే, అది చూసి పాస్ చేస్తారు. సంవత్సరం పోదు.

ాగునా యెవరో వొకరు మెడికల్ బిల్ తీసుకుంటునే వుంటారు. ఏజంట్, అకౌం టెంట్ మాట్లాడకుండా పాస్ చేస్తారు. నీకు యిది మొదటి బిల్ కనుక అంటే క్రొత్తగా వుంది. కొన్నాళ్ళుపోతే, నువ్వే మిగతవాళ్ళకు పాఠాలు నేర్పుతావు.'' అన్నాడు రాజారావు.

''నాకెందుకో బేంకుని మోసం చేసి డబ్బు సంపాదించడం అంటే బాధగా వుంది. అన్యాయం సొమ్ము కదా!''

''ఇవన్నీ ఆలోచిస్తూ కూర్చుంటే నువ్వు బేంకులో పనిచేయడం కష్టం! కాస్త సర్దుకు పోవాలి.'' అన్నాడు రాజారావు.

ఆరోజు సాయంత్రం రామారావు, తన మనస్సును సమాధాన పరచుకుని, తన నియమానికి విరుద్ధమయినా సరేనని, డాక్టరు దగ్గరకువెళ్ళి వొక పదిరూపా యలు యిచ్చి 140 రూపాయలకు మెడి కల్ బిల్లు తీసుకున్నాడు. మర్నాడు బేంకు లోయిచ్చి పాస్ చేయించు కున్నాడు. ఆ విధంగా హరిశ్చంద్రుడికి వ్రత భంగం అయింది.

రామారావుకు తర్వాత కొద్దిరోజులకు వివాహం అయింది. భార్య కాపురానికి వచ్చింది. కుటుంబ నిర్వహణకు వచ్చే జీతం చాలక, వోవర్ టైమ్‌చేసి సంపా దిస్తున్నాడు. ఇదివరలో అనవసరముగా వోవర్‌టైము చేయడం యెందుకని భావిం చినవాడు, ఈనాడు పని ఆలస్యం చేసి సంపాదించడానికి తెగించాడు. దొంగ మెడికల్ బిల్సు సృష్టించడం అలవాటు చేసుకున్నాడు. రాజారావు యిదంతా గమ నించి

''హరిశ్చంద్రుడిలో వొ లా మా ర్పు వచ్చిందే! నువ్వు మాలాగ తయా రయావు'' అన్నాడు వొకరోజు.

''ఏమి చేయమంటావు! మడికట్టుకు కూర్చుంటే కుదరదని, నాధోరణి మార్చు కున్నాను. నలుగురితోపాటు నారాయణ!''

''రామారావు! నేను యివేళ రాయల్ టాకీసులో పిక్చర్‌కి వెళ్తున్నాను. మన క్లైంట్స్‌ని అడిగి 'పాస్' తీసుకున్నాను. నీకుకూడా కావాలంటే తెప్పిస్తాను. ఏమంటావ్!''

''కానీయ్! తెప్పించు! నేనుకూడా నా ఫామిలీ తీసుకువస్తాను'' అన్నాడు రామారావు, వుచితంగా సినిమా చూడటం తప్పని సందేహించకుండా.

———




"పోస్టువాడు వెళ్ళిపోయాడా, శేషూ!"

"ఏమోనమ్మా. అయినా నీ చాదస్తం గాని! మనకి వుత్తరం వస్తే వచ్చి యివ్వడూ?"

"ఏమిటోరా. నా ఆదుర్దాకొద్దీ అలాగ అంటావంతే. అన్నయ్య దగ్గిర నుండి ఉత్తరం వచ్చి పదిహేను రోజులైంది."

"ఉత్తరం వ్రాస్తే యెందుకు రాదూ? వాడు వ్రాయలేదన్నమాట. అంతే."

"అంతే అని అంత తేలికగా అనేశావు గాని వుత్తరం వ్రాయకపోతే యెవళ్ళెలాగ వున్నారో అనిపిస్తూంటుంది. అన్నయ్య ఒక్కడూ వున్నాడు. తాస్త తల నొప్పి వస్తే, పరాయివూళ్ళో వాడిని చూసేవాళ్ళెవరున్నారు చెప్పు. అందుకే మరీ బెంగ వాడి గురించి."

"నీ బెంగకి అర్థం పర్థం లేకుండా పోతోంది. అన్నయ్యకి ఆఫీసు పనులవల్ల తీరికలేకపోతోందని చెప్పాడు యెన్నో సార్లు, "అయ్యో. నేను వ్రాయడం ఆలస్యమై పోయింది" అంటూ వ్రాస్తూంటాడు కూడాను."

"సినిమాలకైతే కావలసినంతతీరుబడి. 'క్షేమం' అని రెండు ముక్కలు వ్రాసి పడెయ్యడానికి తీరికలేదూ?''

''వాడిని అంటావుగాని అక్కయ్యలు సరిగ్గా వ్రాస్తున్నారా?''

''అక్కయ్యలు అత్తవారింట్లోవున్న వాళ్ళాయె. చటుక్కున వ్రాయడానికీ, వెంటనే పోస్టు చెయ్యడానికీ వీలుపడక పోవచ్చు. వీడికే అలాంటి యిబ్బంది లేదు కదూ? అక్కడికే నేను ఖంగారు పడతా నని ఆడపిల్లలు తరచు వ్రాస్తూనే వుంటారు.''

''ఎప్పుడూ వాళ్ళందరి గొడవే సరి పోతుంది. ఇంట్లోవున్న నా గొడవ ఏమీ పట్టదు మీకు.''

''అదేమిట్రా, శేషూ! నీ కేమి లోపం జరిగిందిరా, బాబూ! పిల్లలు కళ్ళయెదుట మసలుతూంటే ఆ తల్లిదండ్రులకు అంత కన్న ఆనందం వుంటుదిరా, పిచ్చి తండ్రీ."

''ఎంతసేపూ ఎదుట వుండాలి, ఎదుట వుండాలి అంటావు. ఎల్లకాలం మీరు మా మీద డామినేట్ చేస్తూ, మీ అదుపాజ్ఞలలో వుండాలనుకుంటున్నారు. మేమూ పెద్ద వాళ్ళమౌతున్నాం, మాకూ ప్రాజ్ఞత తెలి సింది. మా భావాలూ, ఆశయాలూ మాకు వుంటాయి. మా విషయాలలో వీలైనంత మట్టుకు కలుగజేసుకోడం తగ్గించుకోవాలి. మాటకి చెబుతున్నాను, రేపు ఏ ఉద్యోగ మైనా వస్తే నేనూ వెళ్ళిపోవాలి. బైట ప్రపంచంలో మసలుకోవాలి కదా."

''అప్పుడు నీ కోసం బెంగపెట్టు కుంటాను. నీ ఉత్తరానికీ ఎదురు చూస్తూం టాను.''

''అదే కూడదంటున్నాను. బెంగ అనవసరం. ఉత్తరం రానంతసేపూ క్షేమంగా వున్నారనుకుంటే ఎంతహాయి!"

''ఇప్పుడు తెలియదురా ఆ బెంగ అంటే యేమిటో ఒక్క నలుసు బైలు దేరాలి. అప్పుడర్థమౌతుంది. చూస్తున్నా వుగా, అక్కయ్యలు వాళ్ళ పిల్లలకు నేను నీళ్ళు పోస్తుంటే, ''అమ్మా గట్టిగారుద్దకు నొప్పెడుతుంది. నీళ్లు యెక్కువ వేడిగా పొయ్యకు అంటారు. మీ అందరికీ కళ్లు సరిగా తెరవనప్పటి నుండీ నేను నీళ్ళు పొయ్యలేదా? పెంచలేదా? వాళ్ళలాగ అంటున్నారని కోపగించుకుంటున్నానా? దాని ప్రేమ దానిది అనుకుంటాను. నవ్వు కుంటానంతే. అలాగే నీకూను."

''నా కలాంటి బెంగ ఏమీ వుండదు'' అన్నాడు శేషు.

"అదీ చూద్దాం, ఈ కంటి కీ రెప్పలు దూరంకాదు,'' అంది తల్లి.

ఇంతలో పోస్టువాడు వచ్చి ఓ బుక్ పోస్టు యిచ్చి వెళ్ళాడు.

అమ్మా. యివాళ ఉత్తరాలు యేమీ రా లేదమ్మా. నాన్నగారికి భవాన్స్ జర్నలు మాత్రం వచ్చింది. మహాగ్రంధం.''

నాన్న గదిలో వున్నట్టున్నారు, ఇచ్చి రా," అంది తల్లి పార్వతి.

"ఇవ్వాళా రాలేమా ఉత్తరం అబ్బాయి దగ్గిర్నించి," స్వగతంగా పైకి అనుకుని, అక్కడే వసారా గుమ్మంలో కూర్చుండి పోయింది ఆలోచిస్తూ.

గదిలో నుండి శేషు, తండ్రి మాట్లాడు కుంటున్న మాటలు గట్టిగా వినబడు తున్నాయి.

"పోనీలేరా. నిన్ను చదవమన లేదు కదూ? ఎవరికి తగ్గ పుస్తకాలు వాళ్ళకి వుంటున్నాయి. ఈ పుస్తకంలో ఈ ఉపని షత్తుల గురించి, గొప్ప గొప్పగా వేదాం తులు, వాటినిగురించి స్టడీచేసిన విద్యావం తులు యిందులో వ్రాస్తూంటారు. వాటిని చదువుతున్నంత సేపూ ఐహికమైన విషయాలేవీ గుర్తుకిరావు. మనస్సు ఎంతో ప్రశాంతంగా వున్నట్లనిపిస్తుంది. ఈ వయస్సులో యింతకన్న కోరుకునేదీ, కోరుకోవలసిందీ ఏముంది చెప్పు."

"వీటితోనే వేదాంతం వస్తే ఏనాడో ఆపారకులంతాయోగులయేవారే. నాన్సెన్స్. వట్టిడబ్బు దండుగ, ఏ బుక్‌పోస్టైనా పోతుందిగాని, యీ పత్రికమాత్రం బారి స్టరు పార్వతీశం టోపీలాగ వచ్చేస్తుంది ప్రతీనెలా!" ఆక్షేపణ ధ్వనిస్తోంది శేషు గొంతులో.

"ఇంగ్లీషువీ, తెలుగువీ మీరు కొనే పత్రికలు, నవలలూ ఎన్నెన్ని కొంటు న్నారో లెక్కా పత్రంవుందా? వాటికి యెంత ఖర్చవుపోంతో నెల నెలా ఆలో చించావా యెప్పుడైనా? వాటికి డబ్బిస్తున్న వాడిని నేనేకదూ? ఎప్పుడైనా మిమ్మల్ని వద్దన్నానా? పోనీలే. కుర్రవాళ్లు చదువు కుంటారు. ఎప్పుడూ స్టడీస్‌తో సతమత మౌతూంటారు. కాస్త యిటువంటివి మధ్య మధ్య చదువుతే కాస్త మనస్సుకి "రిలీఫ్‌గా వుంటుందని నా అభిప్రాయం. నేను ఒక్క పత్రిక తెప్పించుకుంటుంటేనే యింతకంఠ శోషపడుతున్నావు గానీ!" ఆయన గొంతు.

"సరే. అయితే యిక యిలాంటివి యివ్వాళ మొదలు కొనడం మానేస్తానులే. ఇంతకీ నేను నిరుద్యోగిని కనుక యిల్లాగ మాట్లాడు తున్నారు మీరు. మీ ముద్దుల చిన్నకూతురు కొనే పుస్తకాలకు హద్దు వుందా? ఎప్పుడైనా దాని నేమైనా అన్నారా?"

విసవిసా గదిలోంచి యివతలకి వచ్చి తనగదికి వెళ్ళిపోయాడు శేషు. అతని ముఖం జేవురించి వుంది.

ఆ తండ్రీ కొడుకుల సంభాషణ యింతసేపూ వినబడుతూనే వుంది పార్వ తమ్మకు.

పిల్లవాడు తండ్రిని అన్నమాటలకు ఆమె విలవిల్లాడింది.

భర్త ఏం బాధపడుతున్నాడో!

మెల్లిగాలేచి గదిలోకి వెళ్ళింది పార్వ తమ్మ.

ఆమె భర్త రామనాథం న్యూస్ పేపరు చూసుకొంటున్నాడు.

దగరగా వెళ్ళి నిలబడింది.

"ఏమండీ, బాధ పడకండి. వాళ్ళ అవసరాలు న్యాయంగాను, మన అవసరాలు అన్యాయంగాను కనబడు తున్నాయి వాడికి. ఇంతకీ ఖర్చు పెట్టేది మీరే! వాళ్ళ సంపాదనలో డబ్బు జాగ్రత్త తెలిసి వచ్చి యిటువంటి ఖర్చు లేవీ చెయ్యనే చెయ్యరు. ఏమీ కొనరు. వీళ్ళ అభిప్రాయం మీ కనవసరం. మీకు కావలసినవి నిక్షేపంలాగ కొనుక్కోండి వీళ్లా మీకు చెప్పేవారు?

చదువుకున్న వాళ్ళకు విజ్ఞానం బాగా వుంటుందనుకున్నా నిన్నాళ్ళూ. విద్యవేరు, విజ్ఞానంవేరు. విద్యలేకపోయినా ఎంతో విజ్ఞానం, సంస్కారం కలవాళ్లుంటారని పిస్తోంది యిప్పుడు."

సానునయంగా అన్నది ఆమె.

పేపరునుండి తలయెత్తి చూశాడు రామనాథం.

"ఆఁ! అన్నట్టు పార్వతీ ఈ నెల మన చిన్నమ్మాయి అరుణ పుట్టినరోజు కదూ? దానికి కొత్తబట్టలు కొనవూ?" అన్నాడు.

శేషు అంత లేసిమాటలన్నా ఈయన కించిత్తుకూడా బాధపడ్డం లేదా!

ఏమిటీ వ్యక్తి! . ఒకవేళ తను బాధ పడుతుందని ఆయన ఆవేదన పైకి తెలియనియ్యడం లేదా?

నిర్విణ్ణు రాలైంది పార్వతమ్మ.

* *

"రండమ్మా, రండి చాలా రోజు లైంది మా షాపులోకి వచ్చి, ఇలా కూర్చోండి," అని బల్ల చూపించాడు షాపు యజమాని.

"మరేనయ్యా, కొనడం అంటూ వస్తే మీ షాపులోనే కదా కొనేది," నవ్వుతూ అంది పార్వతమ్మ.

"ఏం చీరలు తియ్యమన్నారమ్మా?" అన్నాడతడు. "ఏవైనా కొత్త చీరలు వస్తే చూపించు," అంది ఆమె.

"మీరు కట్టుకునే చీరలలో రకరకాల కొత్తచీరలు వచ్చాయి. గుంటూరు, పేటేరు, వెంకటగిరి, ధర్మవరం . ఇంకా యింకా చాలా వున్నాయి చూద్దురు గాని," అన్నాడు షాపువాడు.

"నా బట్టలకేం గాని యీ అమ్మాయికి పనికి వచ్చే ఫేషన్‌లో చీరలు చూపించు," అంది ఆమె.

అన్నదే తడవుగా బండెడు చీరలు తెచ్చి వాళ్ళముందు పడేశారు షాపులోని పనివాళ్ళు.

"ఇవి టెర్లిన్,.. .ఇవి నైలాన్,... ఇవి నైలెక్స్,.. .ఇవి టెరీకాట్,....ఇవి



టెరీ వాయిల్, ఇవి సెల్ఫ్ ప్రింట్ ఇవి ఫారన్ నైలెక్స్, ఇవి ఎల్వార్... ఇవి కాలీసింధే, '' చెప్పుకొని పోతు న్నాడు గబ గబా, గుక్కతిప్పుకోకుండా షాపు యజమాని'

అరుణ ఒక్కొక్క చీరతీసి అటు తిప్పి, యిటు తిప్పి, పెదవి విరిచి పక్కను పడేస్తోంది.

''ఈ అంచులోనే యింకా కలర్సు వున్నాయా?. ఈ రంగులో ఆ పైటంచు రకం వున్నవి వున్నాయా? చీరకలరుకి ప్రింటు సూటయిందికాని, అలుక్కు పోయి నట్లుంది మొత్తం ప్రింటు .ఆ ప్రింటు మ యెడంగావుంది... ఫారన్ నైలెక్స్ రామరామ తడి తగిల్తే మోకాళ్ళ మీదికిపోతుంది...'' ఈ విధంగా అన్ని చీరలకు ఇదే పరస!

యక్ష ప్రశ్నలవంటివి లక్ష ప్రశ్నల వర్షం కురిపించింది అరుణ.

షాపువాడు ఆ అమ్మాయి వేస్తున్న ప్రశ్నలన్నిటికీ ఏదో సమాధానం చెబు తున్నాడు ఓపిగ్గా.

అంతసేపూ క్రింది పెదవిమీదికి ఎత్త లేదు పార్వతమ్మ.

కూతురు వేస్తున్న ప్రశ్నలను, షాపు వాని సమాధానాలనూ వింటూ బొమ్మలాగ

కూర్చుండి పోయింది....ఆఖరికి విసుగు అనిపించిందామెకు.

"ఇన్ని చీరలు చూశావు. ఇంచుమించు షాపులోని చీరలన్నీ నీ యెదుట ఉన్నాయి. వీటిలో ఏ ఒక్క చీరా నచ్చలేదా అరుణా? చాలామంది ఇటీవల కట్టుకుంటున్నారు, ఆ చీర చూడు. నీ యెడం చేతివైపు దొంతరలో క్రిందనుండి అయిదవ చీర... ఆ లేతరంగుమీద బోర్డరు చాలా బాగుంది. నువ్వు కట్టుకుంటే చాలా నప్పుతుంది..." అంది తల్లి.

తల్లివైపు కొరకొర చూసింది అరుణ సీరియస్‌గా ముఖం పెట్టి.

"అలాగ గట్టిగా మాట్లాడకు. షాపులో అందరూ వింటారు."

పళ్ళు బిగించి, పెదిమెలు కదపకుండా సణిగినట్లంది అరుణ.

ఇక ఆ అమ్మాయి చీరల ప్రసక్తికి పోలేదు పార్వతమ్మ.

తనకామాత్రం మర్యాద తెలియదా... తనచేతి మీద కొన్ని వేల రూపాయలు విలువైన చీరలు కొంది! అరుణ కట్టుకుంటున్న బట్టలు తను సెలెక్టు చేసినవి కావా? తోటి విద్యార్థినులంతా ముచ్చట పడతారే దాని చీరలు చూసి! ...తనది మంచి సెలెక్షను అంటారే పిల్లలంతా. ఏమిటీనాడు ఈ వైపరీత్యం? ...

ఏవేవో ఆలోచనలతో పరధ్యాన్నంగా కూర్చుండి పోయింది పార్వతమ్మ.

"అమ్మగారూ....మీ చీరలు చూపించమన్నారా?" అన్నాడు షాపువాడు.

"వద్దులే. అమ్మాయిలు పండగకి వస్తారు. అప్పుడు తీసుకుంటాలే," అంది ఆమె.

"పండగవరకూ యీ కొత్త సరుకు ఆగదండి. ఎగరేసుకుని పోతారు మీకు నచ్చినవి పట్టుకువెళ్ళండమ్మా," అన్నాడు వాడు.

పార్వతమ్మ లేచి ఆ బీరువాల దగ్గరకు వెళ్ళి చీరలు చూసింది. చీరలన్నీ చాలా బాగున్నాయి .కాని పెద్ద అమ్మాయిలు వచ్చాక వాళ్ళకి నచ్చినవి కొనవచ్చు ..

తువ్వాళ్ళు, దుప్పట్లు చూపించమంది.

కన్ను చెదిరేలాగ రకరకాల తువ్వాళ్ళు, దుప్పట్లు చూపించారు షాపులోని కుర్ర వాళ్ళు. వాటిలో నాలుగు తువ్వాళ్ళు, నాలుగు దుప్పట్లు ఎంచి తీసుకుంది ఆమె... సొమ్ము యిచ్చేసింది....

ఇదంతా అయేసరికి అరుణ లేచింది.

"నాకు కావలసిన రకం లేవు. మరో షాపులో ఉన్నాయేమో చూసి వస్తాం. ఈ అరడజను చీరలూ ఒకచోట ఉంచండి," అంది అరుణ కొన్ని చీరలు చూపించి.

తెల్లబోయింది తల్లి.

"ఎంతో బాగున్నాయి చీరలు. ఒక్కటీ నచ్చలేదా?" అంది షాపులోంచి బైటకు వస్తూ ఆమె.

– ఈ మూడు మందులూ చెరొక అరటీస్పూను, నీళ్లు 5 టీస్పూన్లు, చక్కెర ఒకగ్రాము, గ్లూకోజు అరగ్రాము, ఆ టానిక్ 5 cc లు – ఖచ్చితంగా ఈ కొలతలప్రకారం మూడుపూటలా మీరే స్వయంగా కలుపుకొని తాగండి రెణ్నెల్లపాటు- తర్వాతరండి!



ఇంట్లో ఉండే నీకు యేం తెలుస్తుంది ఫ్యాషన్? బైటకు వెళ్ళి చూడు, తెలుస్తుంది. ఇలాంటి చీరలు కట్టుకుంటే మా కాలేజీ విద్యార్థినులు, చాటుగా కాదు, ముఖంమీదే నవ్వేస్తారు, తెలుసా?'' అంది మెల్లిగా అరుణ.

అంటూ ఇటూ అటూ చూసింది, ఎవరైనా తన మాటలు వింటున్నారేమోనని!

''అమ్మాయిగారు చెప్పిన చీరలు బల్ల మీద ఉంచమన్నారా?'' షాపులోని కుర్రవాని గొంతు.

''వెర్రిముఖమా! అలాగ అంటే అక్కర్లేదన్న మాట. బీరువాలలో సర్దేసెయ్యి,'' యజమాని గొంతు.

తల్లీ కూతుళ్ళ చెవిని పడ్డాయి.

పార్వతమ్మకు చాలా చిన్న తన మనిపించింది.

ఆఁ పోదూ....వీళ్ళ మాటలు కాతరు చేసేవాళ్ళెవరు? తుక్కులాంటి గుడ్డలు తెప్పించి కొనమంటే యెవరు కొంటారు? వూరు గొడ్డుపోలేదు,'' అంటూ విసురుగా మరో షాపులోకి దారితీసింది అరుణ.

''నా చీరకోసం వచ్చి మరో బేరం చెయ్యడం యేమిటి? కావలిస్తే మళ్ళీ రాకూడదా మరొక రోజున? కొనుక్కోకూడదా? నాతో వచ్చినప్పుడికముందు యెప్పుడూ అలాగ చెయ్యకు,'' గట్టిగా మందలించింది తల్లిని అరుణ.

దుప్పట్లు, తువ్వాళ్ళు ఆమెకొన్నదన్న కోపంతో.

అంత అవసరం కాకపోయినా కుమార్తె వరసచూస్తే ఏమీ కొనేటట్లు కనబడ్డంలేదు. ఇంతసేపు చూసి ఏమీ కొనకుండా వెళ్ళడానికి అమెకు మనస్కరించ

లేదు. అందువల్ల తీసుకుంది వాటిని పార్వతమ్మ.

నాలుగు షాపులు తిరగవేయించి, చివరకు ఒక చీర తీసుకుంది అరుణ.

ఇంటికి వచ్చేటప్పుడు కూడా పార్వతమ్మ ఏమీ మాట్లాడ లేదు.

అరుణ గంభీర ముద్ర దాల్చింది.

మధ్యాహ్నం రెండు గంటలకు వెళ్ళిన వాళ్లు సాయంత్రం ఆరున్నరకు యింటికి చేరుకున్నారు.

పార్వతమ్మ కోసం పని మనిషి కని పెట్టుకుని కూర్చుంది .. వంటచేసుకోవాలి .పనిలో మునిగి పోయింది వచ్చిందే తడవుగా పార్వతమ్మ.

* *

"అమ్మా, అరుణా! నువ్వు కొనుక్కున్న చీర ఏదీ చూపించు, అన్నాడు రామనాథం భోజనం అయి తీరికగా పడక కుర్చీలో కూర్చుని.

అరుణ యిచ్చిన ప్యాకెట్ విప్పి చూశాడు.

"నీకు నచ్చిందా? మీ అమ్మ సెలెక్షనా? మీ అమ్మ బలవంతపెట్టి కొనిపించలేదు కదా?" అన్నాడాయన.

"ఆఁ. అనుకుంటూనే ఉన్నాను, అప్పుడే చెప్పేసిందన్నమాట! నేను చీరలు తీసుకుంటూంటే తను తువ్వాళ్లు, దుప్పట్లు బేరం, అక్కడ బీరువాలోని చీరలు బీరువాల దగ్గిర నిలబడిచూడ్డం, ఎంత ఇన్సల్ట్? కావాలంటే వాళ్లు తెచ్చిగుట్టుగాపడేస్తారే: మర్యాద తెలియని వాళ్ళలాగ అక్కడికి వెళ్ళి చూస్తున్నారనుకోరూ యెవరైనాను? .పైగా అన్ని చీరలు తీయించావు. ఒక్కటీనచ్చలేదా?" అని తోమేసిందను కో నన్ను. చీరలు తీయిస్తేమాత్రం మనకి నచ్చడం అంటూ వుందాలేదా చెప్పండి, నాన్నా మీరేను. తెల్లవారింది మొదలు షాపులలో వాళ్ళకి వాళ్ళ సరుకులు చూపించడమేకదాపని? వాళ్ళమీద జాలి యెందుకు? మొగమాటం యెందుకు? ఏమన్నా గట్టిగా అంటే 1950 సం, లో పెద్దక్క పెళ్ళికి అవి కొన్నాను, 1954 లో నీ బారసాలకి యివి కొన్నాను ఇద్దరు అక్కయ్యల అత్తవారు నా బట్టల సెలెక్షనుకి యెంతో మెచ్చుకున్నారు. ఊఁ ముచ్చటపడి పోయారు వాళ్ళకి పెట్టిన బట్టలుచూసి, "అన్నీ ప్రారంభిస్తుంది. ఇక ఎన్నడూ అమ్మతో బజారుకి వెళ్ళకూడదు."

ఖచ్చితంగా చెప్పేసింది అరుణ.

"నువ్వు యింతదండకం చదివావు గాని, మీ అమ్మనాతో ఏమీచెప్పలేదమ్మా. నా మాట నమ్ము. మీ అమ్మ సెలెక్షను బాగుంటుందని మీరంతా అంటూంటారని వేళాకోళానికి అన్నానమ్మా'" అన్నాడు తండ్రి నవ్వుతూ.

"వట్టిదేనే, అమ్మ నాన్నతో చెప్పే ఉంటుంది. అందుకే నాన్న నిన్న అడి

గారు. ఇంక కాస్తసేపటికి అమ్మవచ్చి ఏమిటే అరుణా నాన్నాతో అన్నావుట?'' అని అడుగుతుంది. దానితో సర్కిల్ పూర్తవుతుంది. వెర్రిదానా, నాన్నతో చెబితే ఉత్తర క్షణంలో అమ్మకి తెలుస్తుంది. అమ్మకి తెలిసినా అంతే!'' అన్నాడు పకపకా నవ్వుతూ శేషు.

రామనాథం ఏమీ సమాధానం చెప్ప లేదు.

పనులన్నీ పూర్తి చేసుకుని అప్పుడే అక్కడికి వచ్చిన పార్వతమ్మ శేషు మాటలువిని నిర్ఘాంత పోయింది.

* *

పండగకు దూరానవున్న కొడుకు శేఖరం, అత్తవారింటో వున్న యిద్దరు ఆడపిలలు, మనుమలు వచ్చారు. పార్వతమ్మకు వూపిరి సలపడం లేదు. వంట వాళ్ళని ఏర్పాటు చేస్తే వాళ్ళు ఏదో డ్యూటీగా చేసేస్తారు గాని యింట్లోవాళ్ళు సుఖించి తినాలి అన్న ఆకాంక్ష వాళ్ళకి వుండదు. అందువల్ల కష్టమైనా తనే చేసి పెటాలి బిడ్డలకు అని ఆమె వుద్దేశం.

''అబ్బాయీ, శేఖరం! నీకు యిష్టమని పచ్చిటొమాటో, వుల్లిపాయకూర చేశాను. నూపప్పు వేయించి పొడుం కొట్టాను. లేత కొబ్బరి పెరుగు పచ్చడి చేశాను.'' అంటూ పార్వతమ్మ పీట వేసుకుని యెదురుగా కూర్చుని, ఆపేక్షగా వడ్డించి, తినమని బలవంతం చేస్తోంది కొడుకును.

''వద్దమ్మా, అభిరుచులతో బాటే రుచులూ మారుతూంటాయి వయస్సు పెరిగినకొద్దీ,'' అన్నాడు శేఖరం. కూర కంచంలోంచి క్రిందకు తోసేశాడు. నూపొడుం, కొబ్బరిపచ్చడి వేలుతోతాకి, పెరుగు పోసేసుకున్నాడు.

తెల్లబోయి చూస్తూ వుండిపోయింది ఆ తల్లి.

''ఏ బిడ్డకి యిష్టమైనవి ఆ బిడ్డకి చేసి పెడితే తల్లికి తృప్తి. ఆ సంగతి బిడ్డకు తెలియదు.... తెలుసుకునేందుకు ప్రయత్నించనైనా ప్రయత్నించరు కదా,'' అనుకుంది పార్వతమ్మ.

ఆమె మనస్సుకి గట్టి దెబ్బతగిలినట్లైంది.

వట్టి పెరుగుఅన్నంతిని పిల్లవాడు వెళ్ళిపోతే ఆమెలోని పేగులు చుట్టుకుపోయినట్లు బాధపడింది.

"ఏదీ పనికిరాకపోతే ఎలాగ? పోనీ నీకు కొత్తగా ఏది యిష్టమైతే అదే చేస్తానురా,'' అని ప్రాధేయపడింది.

"అమ్మా, నీ చాదస్తం చూస్తే నవ్వొస్తోంది. ఈ రెండు రోజులూ నువ్వైతే చేసిపెడతావనుకో, జన్మంతా హోటలు బ్రతుకే కదా! ఆవేళ కేది విస్తరిలోకి వస్తే దానితో సరిపెట్టుకోవాలి..! ఆ విధంగా అలవాటు పడ్డం

మంచిది. అందుకే నువ్వు వడ్డించినవన్నీ రుచి చూడకుండా వదలలేదు. కాస్తో, కూస్తో తిన్నానుగా,'' అన్నాడు కొడుకు.

ఇంకేం మాట్లాడగల దామె!

సాయంత్రం కూతుళ్ళను, మనుమలను తీసుకుని సినీమాకు వెళ్ళింది పార్వతమ్మ. తన కుమార్తెలను పిల్లలు సరిగా చూడనివ్వరని వాళ్ళ సదుపాయం కోసం వెళ్ళిందామె. ఆమెకు యిరువైపులా మనుమలు కూర్చున్నారు.

సినీమాపూర్తయి యింటికి వచ్చేసరికి పదిన్నర అయింది.

"పిల్లలునిద్రపోలేదుటే, అమ్మాయీ'' అని పెద్దకూతురు విశాలను అడిగారు రామనాథం.

''మామూలుగా అయితే నిద్రపోయే వారేగాని, నాన్నా, వాళ్ళ అమ్మమ్మ తెర మీద విలన్ వచ్చేసరికల్లా, ''ఏంభయం లేదు. వూరికేనే అలాకత్తి ఒకసారి, తుపాకీ వొకసారి పట్టుకుంటాడంతే. అవైనా అట్టవేగాని నిజంవి కావు? అని ధైర్యం చెబుతూంటే వీళ్ళకేకాదు. హాల్లో యెవరికీ కూడా భయం లేకుండా పోయిందంటే నమ్ము!'' అని గలగలా నవ్వేసింది పెద్దమ్మాయి. మిగిలినవారు ఆమెతో శృతి కలిపారు.

వాళ్ళని చూడ నివ్వరనికదా తనుకూడా వెళ్ళింది! అంతేగాని తనకు తీరిక ఉండి కాదు, ఓపికాలేదు. అంతసేపు కూర్చుంటే నడుం నొప్పి బైటవేస్తుంది తనకి ... వాళ్ళ దృష్టిలో తను అంత మేనర్స్ తెలియనిదా! వాళ్ళ చిన్నప్పుడూ సినీమాలో వాళ్ళు భయపడి బిక్కముఖాలు వేస్తే సరదాగా కబుర్లు చెప్పలేదాతను!

మనస్సు చివుక్కుమంది ఆమెకు.

నాలుగు రోజులు ఉంటాడనుకున్న శేఖరం ఒక్క రోజు ఉండి, సెలవు లేదంటూ వెళ్ళిపోయాడు. వెడుతూ వెడుతూ రెండు వందలు తండ్రి నడిగి తీసుకొని మరీ వెళ్లాడు! ఉద్యోగం చేస్తున్నాడు. ఒక్క వ్యక్తికి ఖర్చెంత అవుతుంది? వచ్చిన జీతం అంతా ఏమైపోతోంది! .ఏమిటి అనడం?... ఎలాగ అడగడం అడిగితే నిష్ఠూరం తప్ప కించిత్తు ప్రయోజనం శూన్యం

నోరు మెదపలేదు తండ్రి రామనాథం.

పండుగ లయాక కూతుళ్లు, అల్లుళ్లు, మనుమలు ప్రయాణాలయ్యారు. కూతుళ్ళిద్దరూ వెడుతూ వెడుతూ, ''అమ్మా, నీకొక్క విషయం చెబుతాం. ఏమీ అనుకోకు, ఈ మధ్య నీకు విసుగెక్కువై పోయింది. నీకు చెప్పవలసిన వాళ్ళం కామనుకో, మేము మాత్రం పిల్లలతో చేసుకోడం లేదా? అస్తమానం పనివాళ్ళమీద, పాలవాళ్ళ మీద, కూరలవాళ్ళమీద కేకలు వేస్తున్నావు. ఎదురుతిరిగి వాళ్లేమైనాఅంటే మనకి అవమానం కాదా? ..శాంతంగా ఉంటే నీ అరోగ్యానికి మంచిదే!'' అని సలహాయిచ్చి మరీ రిక్షాలు యెక్కారు.




"అరుణ మళ్ళీ సరిగ్గా అమ్మలాగ తయారౌతోంది," అన్నాడు శేషు.

పార్వతమ్మ విభ్రాంతి చెందింది.

ఆమె తల తిరిగి పోతోంది.

సుమారు నలభై సంవత్సరాలనుండి సంసార బాధ్యత వహించింది తను. గృహిణీ ధర్మ నిర్వాహణలో ఏ కించిత్తు లోపం రానియడం సహించలేదే! బిడ్డలను, చిన్నప్పటినుండి ఆదర్శవంతంగా పెంచాలని చక్కని భావాలు వారిలో పెంపొందింప జేయాలనీ భావించి వాళ్ళ పెంపకంలో యెంతో శ్రద్ధతీసుకున్నదే తను! అటువంటి తను యిప్పుడు కన్న బిడ్డలదృష్టిలో అసమర్థురాలు, పేచీకోరు! ఎన్నడో బి. సి. లో పుట్టవలసిన వ్యక్తిగా కనబడుతోందా తను.

ఇన్నాళ్లుగా శ్రమపడి, తన ప్రాణానికి ప్రాణంగా పెంచుకున్న దానికి యిదా చివరకు తనకు దక్కింది!

ఇన్నాళ్ళ సంసారంలో. పనివాళ్ళు పనులు చెయ్యలేదా? ఇంటిపనులకు, పైపనులకు పనివాళ్ళను పెట్టి పిల్లలకు ఏ లోటూ రానియ్యకుండా చేయించలేదా! వాళ్ళంతట వాళ్ళు మానుకోవలసిందేగాని ఏ ఒక్కరూ తన కారణంగా మానలేదే! పైగా, "మీ యిల్లు లాంటిది దొరకదమ్మా, పనివాళ్ళ కష్టసుఖాలు కనుక్కుంటారు. చూసీ చూడక యింత తిండికి పడేస్తారు. అడగకుండా నెల అయేసరికి మాకివ్వవలసిన డబ్బు ఇచ్చేస్తారు!" అంటారేగాని ఎన్నడూ తన గురించి మరొక విధంగా అనడం వినలేదే!

పిల్లలు పెద్దవాళ్ళయారు. ఇకమీదట నిశ్చింతగా కాలక్షేపం చేయవచ్చును జీవిత శేషం అనుకుంది తను.

కాలం యెలాగైనా గడిచిపోతుంది. ఎవరికోసం, ఎందుకోసం ఆగదు. కాని, తాను ఆశించిన నిశ్చింతకి బదులుగా తీరని




నిరాశ, నిస్పృహ, ఆవేదన, అవమానం హృదయాన్ని ఆక్రమించు కొన్నాయి

"అలాగ నిలబడి ఎంతసేపు చూస్తావు వాళ్ళని? రిక్షాలు వీధి మళ్ళిపోయాయి, ఈ పాటికి స్టేషన్‌కి కూడా వెళ్ళి ఉంటారు. రా లోపలికి," అన్న రామనాథం పిలుపుతో ప్రకృతావస్థకు వచ్చింది పార్వతమ్మ.

ఇంట్లోకి వచ్చింది.

ఆయన ఆమె ముఖం చూశారు.

ఆమె ముఖం జేవురించి ఉంది. మనిషిని నిలువునా వణికిపోతోంది వర్షించడానికి సిద్ధంగా ఉన్న నీటి మేఘాల్లాగ ఉన్నాయి ఆమె నేత్రాలు,

ఏమండీ. నేను ఔట్ ఆఫ్ డౌట్ అయిపోయాను," అంది. ఆమె కంఠం రుద్ధమైంది. ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి.

"నేనూ అంతే. పార్వతీ!" అన్నారాయన ఆమె కన్నీరు తుడుస్తూ.

———



# అసమర్థుడు

కోట రాధాకృష్ణమూర్తి

ఉదయం పదిన్నర కావస్తోంది. అదరా బాదరా భోంచేసి ఆఫీసుకు వచ్చేను. వచ్చి కూర్చున్నదే తడవుగా ఫైల్సులో మునిగిపోయాను. ఇంతలో ప్యూను ఆఫీసు తపాల్సు తీసుకొని వచ్చాడు. నా సీటుకు సంబంధించిన కాగితాలు తీసుకొని సంతకం పెట్టి ప్యూనును పంపించేశాను. వచ్చిన కాగితాలను తిరగేస్తుంటే నా దృష్టి ఒక కాగితం మీద నిలిచిపోయింది. అది ఎవరో శేఖర్ అనే

వ్యక్తియొక్క అర్జీ. ఉద్యోగానికై పెట్టుకో బడిన పిటిషన్. దానిమీద "Appointed putup proceedings immediately." అని వ్రాసి యున్నారు. దానిని చూస్తుండ గానే నా మనస్సు ఆరు నెలల క్రితానికి తిరిగిపోయింది.

నేను ఉద్యోగం లేక నానా బాధలు పడుతున్న రోజులవి. కాళ్ళు వాచేలా తిరిగాను. నోరు నొప్పిపుట్టేలా ప్రతి ఆఫీసరునీ బ్రతిమాలాను. కనిపించిన ప్రతి అడ్వర్టైజ్ మెంటుకూ ఒక అర్జీ పడవేశాను. కాని ఫలితం శూన్యం. నిరాశ, నిస్పృహలతో సంచరిస్తున్న నాకు ఆపద్బాంధవుడిలాగా ప్రత్యక్షమైనాడు ఆనందం. నా చిన్ననాటి స్నేహితుడు, గొప్ప ధనికులబిడ్డ. వాళ్ళ నాన్న గారి ద్వారా ఆఫీసరుకు చెప్పించాడు. ఆఫీసరు సరేనన్నాడు. ఆనందం నాచేత ఒక అర్జీ వ్రాయించి వాళ్ళ నాన్నగారిచే ఒక ఉత్తరం వ్రాయించి రెండూ ఆఫీసరుకు పర్సనల్‌గా ఇమ్మని చెప్పాడు. పట్నం పోవడానికి నా దగ్గర డబ్బులు లేవు. గుటకలు మ్రింగుతుంటే నా పరిస్థితి గ్రహించిన ఆనందం ఒక వంద రూపాయలిచ్చాడు. పట్టరేని సంతోషంతో ఆనందంకు మరీమరీ కృతజ్ఞతలు తెల్పి పట్నం బయలుదేరాను. ఆఫీసరును కలుసుకొని అర్జీ, ఉత్తరం రెండూ అందజేశాను.

అర్జీమీద వారు "Appointed in the existing vacancy, putup immediately a detailed note" అని అర్డరువేసి ప్యూనును పిలిచి Headcleck గారికి ఇమ్మని తపాలులో క్లర్క్‌కు పంపమని చెప్పారు,నన్ను ఎష్టాబ్లిష్ మెంట్ గుమాస్తాయైన బి 1 ను కలుసుకోమని చెప్పారు. నేను అలాగే బి 1 సీటుదగ్గరకు వెళ్లాను. టైం 10-30 అయింది, కాని ఇంకా బి, గారు రాలేదు. పదిహేను నిముషాలు అలాగే కూర్చున్నాను. కాని వారు ఇంకా రాలేదు విషయ మేమిటా అని వాకబుచేయగా వారు అంటే సదరు బి 1 గారు అవర్ పర్మిషన్ పెట్టారని తెలిసింది. గడియారంవైపు చూస్తూ అలాగే కూర్చున్నాను. 11-30 అయింది. కాని వారు రాలేదు. నాలో ఆతృత ఎక్కువైంది. వారు వస్తారా? రారా? అని ఎవరిని అడిగినా సరియైన సమాధానం రాలేదు. వారు సరిగా ఒంటిగంటకు వచ్చారు.

వచ్చినదే తడవుగా ముఖము తుడుచుకొంటూ కుర్చీమీద కూర్చొన్నారు. నమస్కారం పెట్టాను. ఎవరు మీరు "అని అడిగారు. పరిస్థితి వివరించాను. నాకు త్వరగా పోస్టింగ్ ఆర్డరు ఇమ్మని సవినయంగా మనవిచేశాను. వారి పెదవుల మీద చిరునవ్వు కన్పించింది. అప్పుడే ప్యూను ఇచ్చిన టపాల్ కాగితాలన్నీ




చూశారు. నాకాగితం పైకి తీసి సొంతం చదివారు. "ఇప్పుడే నేను వ్రాయవలసిన ఫైల్సు అర్జంటివి చాలా ఉన్నవి. మీరు రేపురండి" అని శెలవు ఇచ్చారు. నాకు చెమటలు పోశాయి ఎంతో నిరాశ చెందాను. నేను చాలా దూరం నుంచి వచ్చాననీ, పోయిమళ్ళీరావడం కుదరదనీ, ఎంతో ఆశతో వచ్చాననీ, ఎదేదో బతిమాలాను. వారి ముఖంలో మళ్ళీ చిరునవ్వు కన్పించింది. లేని చెమటను తుడుచుకొంటూ, చొక్కా కాలరును తడుముకొంటూ లేచారు వారి వెంట నేనూ లేచాను. వారు నేరుగా హోటల్‌లోనికి వెళ్ళారు. నేను భోంచేసి వచ్చాను. కాని వారితోటి అక్కడిదాకావచ్చి ఆగిపోవడం మర్యాదకాదు గనక, నేనుకూడా వారితోటి హోటలోనికి వెళ్లాను. ఇద్దరం ఎదు రెదురుగా ఆసీనులమయ్యాము. మీరేమన్నా తీసుకొంటారా? అని అడిగారు. ఏమీ తీసుకొనకపోతే బాగా ఉండదనుకొని కాఫీ అని చెప్పాను. వారుమాత్రం స్వీటు, హాట్ తీసుకొన్నారు. బోర్నవీటా త్రాగారు. సర్వర్ బిల్లు మా ఇద్దరిమధ్య పెట్టివెళ్లాడు. వారు బిల్లుచూచి కూడా చూడనట్లు లేచి బయలుదేరారు. నాకు తప్పలేదు. బిల్లు తీసుకొని చూచాను. రెండూ రూపాయయిలు! గుండె ఆగిపోయినంత పనిఅయింది. కాని ఏం చేయను. బిల్లు చెల్లించి బయట పడ్డాను. వారు బయట నిలబడి నాకోసం ఎదురు చూస్తున్నారు. నేను వారిని కలుసుకొన్నాను. వారు జేబులన్నీ తడుముకొన్నారు. ఏమిటి సార్ అని అడిగాను అర్థంగాక. "సిగరేట్ ప్యాకెట్, వక్కపొడి ఎప్పుడూ నా జేబులోనే ఉండేవండీ. ఇప్పుడు వెదకితే కనబడ్డంలేదు. బహుశా

ఇంట్లో పెట్టేసివచ్చి ఉంటాను. మీదగ్గర డబ్బులుంటే సిజర్ ప్యాకట్, కిళ్లీ ఒకటి తీసుకోండి'' అన్నారు. నాకు వళ్ళుమండింది. కాని తమాయించు కొన్నాను. '—అతని అవసరం నాకు ఇప్పుడు చాలా ఉంది. నా భవిష్యత్తు అతని చేతిలో ఉంది. మంచిగా ఉండి తొందరగా పని చేయించుకో వాలనుకున్నాను.'—సిజర్ ప్యాకట్, కిళ్లీకొని అతనికి ఇచ్చాను.

కిళ్ళీ వేసుకొని, సిగరేట్ కాలుస్తూ బయలుదేరారు. వారి వెంబడే నేనూను. నా గురించి అన్ని విషయాలు అడిగి తెలుసుకొన్నారు. సీటులో కూర్చున్నారు. అంతే, అంతకుముందున్న నవ్వు మాయమయింది. సీరియస్ ఫోజ్ పెట్టారు. ముఖం వంచేసుకొని ఏదేదో రాస్తున్నారు. "సార్, నా కాగితం ముందు వ్రాయండి. మీకు పుణ్య ముంటుంది.'' అని బ్రతిమాలాడాను. "నిన్న వచ్చిన కాగితాలే ఇంకా వ్రాయలేదండీ, ఏ పనిఅయినా సీరియస్‌గా చేయాలి కదండీ. రేపు తప్పని సరిగా వ్రాస్తాలేండి'' అన్నారు. నాకు మతి తిరిగి పోయింది. హెడ్‌క్లార్క్‌తో పోయి చెప్పాను. వారుకూడా బి 1 గారినే సపోర్టు చేశారు. నాకేమీ బోధపడలేదు. నిరాశగా ఆఫీసుముందు చెట్టుదగ్గర కూర్చున్నాను. నాలో ఆలోచనలు రేగుతున్నాయి. ఎంతో ఆశతో వచ్చాను. రేపుకూడా ఇక్కడ ఉండాలంటే బోలెడంత ఖర్చు. ఆనందం ఇచ్చిన 100 రూపాయలతో ఛార్జీలకు, ఇక్కడ బి 1 ను మేపినందుకు మొత్తం పది రూపాయలు అప్పుడే అయిపోయినవి. ఉద్యోగంలో చేరి, 1 వ తారీఖు జీతం వచ్చేంతవరకు ఈ డబ్బుతోనే కాలం గడపాలి. రేపు కూడా ఇక్కడే ఉంటే ఇంకెంత అవుతుందో? అని. ఇంతలో ప్యూను నా దగ్గరకువచ్చి .సంగతి ఏమిటని అడిగాడు. జరిగిన విషయమంతా చెప్పాను. "నేను చెప్పినట్లు చేస్తే మీకు తొందరగా పని అవుతుంది.'' అని చెప్పాడు. ఆ మాటతో నాకు ఏనుగంత బలం వచ్చింది. "నీవు ఏమి చెప్పినా చేస్తాను. గంగలో దూకమన్నా దూకుతాను. అన్నాను.'' అంతపని అక్కరలేదు సార్, హెడ్ క్లార్క్‌కు ఒక 50 రూ॥లు గుమాస్తాకు 25 రూ॥ లు నాకు రెండు రూపాయలిస్తే మీపని నిముషాలలో అయిపోతుంది సార్.'' అన్నాడు. నాకు భూమి తిరిగి పోతున్నట్లన్పించింది. తమాయించుకొని నిలబడ్డాను.--'అఫీసరుతో రిపోర్టుచేస్తే'-- అని మనసులో అనుకొన్నాను. నా మనస్సులోని భావాన్ని పసిగట్టి నాడేమో? ప్యూను "మీరు అఫీసరు దగ్గరకువెళ్ళి చెప్పుకొన్నా ఏమిలాభంలేదు సార్. క్లార్క్, హెడ్‌క్లార్క్, ఏదో సాకులు చెప్పి అసలికే మోసం తెస్తారు. మీరు ఏమియిచ్చినా ఇప్పుడే గదండీ ఇస్తారు.

అటు తర్వాత మీరూ పుచ్చుకొనే వారేగదా అవుతారు'' అన్నాడు. క్షణం ఆలోచించాను. ఎంతో కాలంనుంచి ఎదురు చూస్తున్న ఉద్యోగం రాబోతుంటే కాలదన్నుకోవడం తెలివి తక్కువ అన్పిపించింది. దేవుడు వరమిచ్చినా, పూజారి వరమివ్వ లేదనేది ఇదేనని అప్పుడు తెలిసివచ్చింది. ఏమైనా సరే అనుకొని జేబులోంచి 77 రూ॥ లు తీసి ప్యూనుకు ఇచ్చాను. వాడు సలాంకొట్టి వెళ్లిపోయాడు.

అంతే! ఒక గంటలో నోట్ అప్రూవ్ గావడం, ప్రొసీడింగ్స్ పెట్టడం, ఫైవ్ అయి సంతకం గావడం నాదగ్గరకు రావడం అంతా జరిగిపోయింది. నన్ను రాయవేలూరుపోస్టు చేశారు. నేను వెంటనే వెళ్ళి జాయినయ్యాను. కాని ఆనందం ఇచ్చిన 100 రూ॥ లు అప్పుడే అయిపోయినవి. ఎంతోబాధపడవలసి వచ్చింది. ఉద్యోగ జీవితం అప్పులతో ప్రారంభం అయింది. అప్పు చేయడం, మళ్ళీ తీర్చడం, మళ్ళీ చేయడం, మళ్ళీ తీర్చడం ఇలా చక్రంలాగా నా జీవితం ఇప్పటికి తిరుగుతూనే ఉన్నది. మిగులు అన్నది ఎండమావులయిపోయింది. రాయవేలూరునుండి నన్ను మళ్ళీ ఇప్పుడు పట్నానికే మార్చారు. ఆ బి I సీటులోనే నన్ను వేశారు. కాని ఆ హెడ్ క్లార్కు, ఆ ప్యూన్ ఇప్పు డిక్కడ లేరు. బదిలీ అయి వెళ్ళిపోయారు. గతాన్ని తల్చుకొంటూంటే, ఆనాడు నేను పడిన ఆతృతి, ఆవేదన నెమరువేసుకొంటూంటే, కళ్ళల్లో నీళ్లు వస్తున్నాయి.

ఆ అర్జీని మళ్ళీ ఒకసారి చదివాను. నా మాదిరి ఈ శేఖరం బాధ పడడానికి వీల్లేదు. ఇతని పని వెంటనే చేసేసి తృప్తితో నిండిన అతని కళ్ళనుచూసి ఆనందించాలనుకున్నాను. నోటువ్రాసి నేనే స్వయంగా హెడ్ క్లార్కు దగ్గరకు తీసుకుని వెళ్ళాను. ఆయన ఆ ఫైలుచూసి దీని కిప్పుడేం తొందర. నీ మామూలు నీకు ముట్టిందేచాలా! మిగతా వారందరు ఏమి కావాలి. అక్కడ పెట్టిపో'' అన్నారు. నేను చాలా బాధపడ్డాను. మాట్లాడకుండా ఆ ప్యాడు అక్కడే పెట్టేసి వచ్చేశాను.

'ఛీ, ఈ లోకం ఎంత నీచమైంది' అని ఆలోచిస్తూ కూర్చున్నాను. గుడ్ మార్నింగ్ అన్నమాట వినగానే తల పైకెత్తి చూచాను. తెల్లచొక్కా, నల్ల ప్యాంటు తొడుక్కొని, చామన చాయ కల్గిన ఒక యువకుడు ఎదురుగా నిలబడియున్నాడు. ''నా పేరు శేఖర్ సార్. నన్ను అపాయింటుచేస్తూ ఆఫీసరువారు ఆర్డరుచేశారు. మీకు కాగితం వచ్చేఉండవచ్చు. మీరు పోస్టింగ్ ఆర్డరు ఇచ్చివేస్తే నే వెళ్ళిపోతాను. అరే అసలు మ్యానర్సే మరచిపోతున్నాను. రండిసార్ కాఫీకి పోతాం'' అన్నాడు ఏక ధాటిగా. ''వద్దండీ




నేను ఫోంచేసి వచ్చాను'' అన్నాను. ''సిగరెట్ త్రాగుతారా?'' అంటూ ఒక సిగరెట్ ఇవ్వబోయాడు ''Thanks. వద్దండీ'' అన్నాను అతను తెల్లబోయాడు. కొంచెం సేపటికి సర్దుకొని మీరుచాలా Honest గా ఉన్నట్లున్నది. నా ఫైల్ కొంచెం........''అంటూ చేతులు నలుపు కొంటూన్నాడు. మీ ఫైల్ వ్రాసి హెడ్ గుమాస్తాగారి బల్లమీద పెట్టాను. వారు చూడడం లేదు.'' అని చెప్పాను. అతను వెంటనే హెడ్ గుమాస్తాగారి దగ్గరకు వెళ్ళాడు. అటు తిరువాత ఏం జరిగిందో నాకు తెలియదు. 10 నిముషాలలో నోటు అప్రూవ్అయి వచ్చింది. వెంటనే ప్రొసీడింగ్సు కూడాపెట్టి హెడ్క్లార్క్ బల్లమీద పెట్టడానికి వెళ్ళాను. హెడ్క్లార్క్‌గాని, ఆ రూంలో కెళ్ళిన శేఖర్‌గాని అక్కడ లేరు. ప్యాడ్ బల్లమీద పెట్టేసి వచ్చాను. ఒక అరగంటలో ప్రొసీడింగ్సు కూడా అప్రూవయి వచ్చింది. వెంటనే టైప్ చేయించాను. ఆర్డరు తీసుకోవడానికి శేఖర్ దగ్గరకు వచ్చాడు. నేను ఆశించిన తృప్తి అతడి కళ్ళల్లో కన్పడడం లేదు. అతని కళ్ళల్లో కన్పిస్తున్నదల్లా ఒక రకమైన డంబము. ''యీఫైల్ ఇంత త్వరగా హెడ్క్లార్క్ దగ్గరనుండి కదుల్తుందనుకోలేదండి.'' అన్నాను ఉండబట్టలేక. ''అవునుసార్, తైలం ఉంటే కొండమీది కోతినైనాదింపింపవచ్చునండీ.'' అన్నాడు. నాకు అర్థమైంది. నేను మౌనం వహించాను. ఆర్డరు తీసుకొని వెళ్తున్న అతనికి కిటికీ దగ్గర ప్యూన్ ఎదురైనాడు. అతనికేదో ఇస్తున్నాడు శేఖర్. నాకు వాళ్ళమాటలేవీ వినబడలేదు. శేఖర్ అన్న చివరి మాటలు మాత్రం వినబడ్డాయి. ''ఏమిటోయ్ మీ బి 1 వట్టి అసమర్థుడిలా ఉన్నాడు. ఏమీ పుచ్చుకోలేదు.''

———



# నవవిధాన

శరత్‌బాబు

శైలేశ్వర ఘోషాల్ కలకత్తాలోని ఒక కాలేజీలో తత్వ శాస్త్రాధ్యాపకుడు. ఆయన తత్వ శాస్త్రంలో పాశ్చాత్య విశ్వ విద్యాలయాల డిగ్రీకూడా సంపాయించాడు. అధ్యాపకుడుగా ఆయన నెల జీతం ఎనిమిదివందలు. ఆయన వయసు ముప్పైరెండు సంవత్సరాలు. షుమారు అయిదు నెలలక్రితం ఆయన భార్య తొమ్మిది సంవత్సరాల కొడుకును యీ లోకంలో విడిచి, పరలోకం చేరింది,

భార్య మరణించిన కొద్ది రోజులకే శైలేశ్వరుడు, తిరిగి వివాహం చేసుకునే ప్రయత్నాలు ప్రారంభించాడు. ఈ ప్రయత్నం అతడి మిత్రుల్లో, పరిచయస్తుల్లో చాలా సంచలనానికి కారణమైంది. అలా జరిగివుండకపోతే, యీ కథ మరెలా పరిణమించేదో చెప్పటం చాలా కష్టం.

కలకత్తా నగరంలోని పటల్‌డాంగా పేటలో కొన్ని తరాలుగా శైలేశ్వరుడి పూర్వుల నివాస స్థానం. అక్కడ అతడికి పితరులదైన ఒక పెద్ద ఇల్లు కూడా ఉంది. ఆ యింట్లో శైలేశ్వరుడూ, అతడి తొమ్మిదేళ్ళ కొడుకు సోమేంద్రుడూ కాక నౌకర్లు నలుగు రైదుగురు దాకా ఉన్నారు.

భార్య పోయిన తొలి దినాల్లో శైలేశ్వరుడికి మళ్ళీ వివాహమాడాలన్న కోర్కె ఉండేది కాదు. తరవాత తరవాత ఆ అభిలాష కలిగిందతడికి. ఆ సమయంలో అతడికి భవానీపూర్‌లోని భూపేంద్ర బెనర్జీగారి రెండవ కూతురు మెట్రిక్యులేషన్ పాసయిం దనీ, అంతేకాక ఆమె చాలా అందకత్తె అనీ అతడికి తెలిసింది.

పెద్ద చదువులు చదివిన శైలేంద్రుడికి, బెనర్జీగారి కూతురును గురించిన ఆసక్తి గురించి, ఆ రోజున అతడి మిత్ర గోష్ఠిలో ప్రసంగం ప్రారంభమయింది. అది సాయంకాల సమయం. శైలేశ్వరుడి మిత్రులంతా అతడి గదిలో కూర్చుని టీ తాగు తున్నారు. ఆ సమయంలో ఏదో చిన్న స్కూల్లో పనిచేస్తున్న పండితు డొకాయన కూడా వాళ్ళ మధ్య ఉన్నాడు. ఆయన శాస్త్ర వాదస్తపు మనిషి. ఆ కారణంచేతనేమో శైలేశ్వరుడి మిత్రులైన ప్రొఫెసర్లంతా అతణ్ణి దిగ్గజంలాంటి పండితు డంటూంటారు.

ఈ పండితుడు ఏ మాటా వెనకాముందు ఆలోచించి మాట్లాడటం కాని, సందర్భా సందర్భాలు చూడటంగాని చేయడు. ఈ దిగ్గజంలాంటి పండితుడికి ఇంగ్లీషురాదు. ఫలానా వాళ్ళపిల్ల ఫలానా పరీక్ష పాసయిందని వినటం జరిగిందో, అతడి వళ్ళు భగ్గు మంటుంది.

ఆ రోజున టీ గోష్ఠిలో భూపేంద్ర బెనర్జీగారి అమ్మాయి ప్రసక్తి వచ్చేసరికి, పండితుడు తబ్బిబ్బయిపోతూ, "శైలేంద్రబాబు మొదటి భార్యను ఇంట్లోంచి తరిమే శాడు; మరొక భార్యను మింగేశాడు. ఇప్పుడు తిరిగి పెళ్ళి చేసుకోవాలనుకోవటం కొరివితో తల గోక్కోవటమే అవుతుంది. ఒకవేళ గృహస్థ జీవితం గడపాలని ఉంటే, వెళ్ళగొట్టిన మొదటి భార్యనే ఎందుకు తెచ్చుకో కూడదు?" అన్నాడు.

శైలేశ్వరుడి మిత్రుల్లో చాలామందికి, యీ మొదటి భార్య సంగతి తెలియదు. పండితుడిలా అనేసరికి వాళ్లు చాలా ఆశ్చర్యపోయారు. అది గమనించిన దిగ్గజం







మరింత వుత్సాహంగా, "పాపం, ఆవిడ్నే పిలుచుకొచ్చుకోండి, ధర్మంగా ఉంటుంది. మళ్ళీ మరో పెళ్ళి మాత్రం చేసుకోకండి. బెనర్జీగారమ్మాయి మెట్రిక్యులేషన్ పాస యితే—అన్నీ తెలిసినట్టేనా?" అన్నాడు.

శైలేశ్వరుడు వచ్చే కోపాన్ని అణచుకుంటూ".. ఆమె పిచ్చి మనిషండీ!" అన్నాడు.

ఎవరైనా మరొకర్ని పిచ్చి వాళ్ళంటే పండితుడికి పట్టలేని ఆగ్రహం వస్తుంది. శైలేశ్వరుడి మాట వింటూనే ఆయన ఆగ్రహావేశుడై పోయి, "అందరూ పిచ్చివాళ్ళే! కాని వాళ్ళెవరు? లోకులు నన్నూ పిచ్చివాడనే అంటారు. అయితే ఏం? వాళ్ళలా అన్నంత మాత్రాన నేను పిచ్చివాణ్ణయిపోయానా?" అన్నాడు.

ఆ మాటలకు అందరూ విరగబడి నవ్వారు. ఆ నవ్వుతో అసలు సంగతి అడుగున పడిపోలేదు. శైలేశ్వరుడు ఎంతో లజ్జపడుతూ, మొదటి భార్య గురించి జరిగిన సంఘటనలన్నీ వివరించి, "నా జీవితంలో అది చాలా దుఃఖకరమైన సంగతి. నేను చదువు కోసం ఇంగ్లండు వెళ్ళటానికి ముందే ఆ వివాహం జరిగిపోయింది. ఆ వివాహ సమయంలో మా మామగారికీ, నాన్నగారికీ ఏదో విషయమై పోట్లాట వచ్చింది. అంతేకాక ఆమెకు మనసు సరిగా ఉండని కారణంచేత నాన్నగారామెను యీ ఇంట్లో ఉండనివ్వలేదు. ఇంగ్లండు నుంచి తిరిగివచ్చాక ఆమెను మళ్ళీ నేను చూడలేదు," అన్నాడు.

మిత్రులంతా ముఖా ముఖాలు చూసుకున్నారు. శైలేశ్వరుడు బలవంతాన నవ్వటానికి ప్రయత్నిస్తూ, "పండిట్‌జీ! జరిగిందిది. నిజంగా ఆమెకు మనస్సేకనక బావుంటే,

పుట్టింటివారు యిక్కడికి పంపేందుకు ప్రయత్నం ఎందుకు చెయ్యరు? ఒకవేళ ఆమె ఈ ఇంటికి రావటం జరిగితే, మీరు మాత్రం యిక్కడ టీ తాగే ఆశ వదులుకోవచ్చు. గంగాజలం చిలికి, ఆవుపేడతో గదంతా అలికి, ఇల్లంతా శుద్ధిచేసి కాని మరీ విడిచి పెట్టదు. కనక మీ ముందే అందరికీ హెచ్చరిక చేస్తున్నాను," అన్నాడు.

తతిమ్మా మిత్రులంతా వూరుకున్నా, పండిత దిగ్గజం మాత్రం, "అలా ఎన్నటికీ జరగదు!" అంటూ బల్ల గుద్దాడు. ఈ చర్చ అంతా ముగిసేసరికి రాత్రి బాగా పొద్దు పోయింది. అందరూ ముఖాలు చిన్నబుచ్చుకుని ఇళ్ళకు బయలుదేరారు.

తన మిత్రులెవరూ తన తృతీయ వివాహ ప్రయత్నాన్ని అమోదించలేదనీ, ఒక విధంగా తృణీకరించి మరీ వెళ్ళారని శైలేశ్వరుడు అనుకున్నాడు. అతడికి ఎంతో బాధ, సిగ్గూ కూడా కలిగాయి. ఈ సంగతి మరి కొందరికి తెలుస్తుందన్న భయం అతణ్ణి బాగా కలవరపరిచింది.

శైలేశ్వరుడి మొదటి వివాహం అతడి పద్దెనిమిదవఏట జరిగింది. అప్పుడతడి భార్య ఉష వయస్సు పదకొండేళ్ళు. పిల్లచాలాఅందంగా వుండేది. ఆకారణం చేతనే శైలేశ్వరుడి తండ్రి కాశీపదబాబు కొడుకును చవకగా, విక్రయించేశాడు. బహుకొద్ది కట్నం తీసుకుని. కాని, అ యిచ్చి పుచ్చుకోవటాల్లో కాశీపదబాబుకూ, అతడి వియ్యంకుడికీ తీవ్రమైన అభిప్రాయ భేదాలు ఏర్పడినై. ఆ సమయంలో శైలేశ్వరుడు ఇంగ్లండులో చదువు తున్నాడు. తండ్రి బలవంతంగానే కోడల్ని పుట్టింటికి పంపేశాడు. అందువల్ల శైలేశ్వరుడు తిరిగివచ్చాకకూడా ధైర్యంచేసి భార్యను తెచ్చుకునే ప్రయత్నం చేయలేదు. అలాచేయటం బావుంటుందన్న ఆలోచనకూడా అతడికి కలగలేదు.

శైలేశ్వరుడి మామగారైన ఉమేశ తర్కాలంకారుడుకూడా. చాలా స్వాభిమానం కల మనిషి. తన కుమార్తెను తీసుకుపోయేందుకు ఎవరూ రానప్పుడు తనకుతానై ఆమెను అత్తవారింటికి తీసుకపోవటానికి అతడు ససేమిరా అంగీకరించలేదు. పైగా నాలుగు సంవత్సరాలు విదేశాల్లో గడపటంతో శైలేశ్వరుడి స్వభావంలో కూడా కొంత మార్పు వచ్చింది. ఆకారణంవల్లనే రెండవ వివాహం ప్రసక్తివచ్చి నప్పుడు అతడు, కాబోయే భార్య చదువు సంధ్యలున్న మనిషనీ, ఆమె తండ్రికూడా విదేశాలకు వెళ్ళివచ్చిన వాడనీ—అక్కడి ఆచార ధోరణులకు బాగా అలవాటు పడ్డ వాడనీ విని—చప్పున ఆ వివాహానికి అంగీకరించాడు.

ఈ రెండవ వివాహం జరిగిన కొద్దిరోజులకే శైలేశ్వరుడి తండ్రి కాశీపదబాబు స్వర్గస్థుడయాడు. అతడి మొదటి సంబంధపు మామగారైన తర్కాలంకారుడు కూడా




పరలోకగతుడయాడు. అప్పటి వరకూ శైలేశ్వరుడికి తన మొదటిభార్యను గురించిన సంగతులేవీ తెలియవనేందుకువీల్లేదు. ఉష తన అన్నల ఇంటవుంటున్నదని అతడికి తెలుసు. ఆవిడ అక్కడ జపతపాలలో, పూజా పునస్కారాలతో, గంగా స్నానాలతో రాత్రిం బగళ్లు గడిపివేస్తున్నది ఆమె యీ నియమనిష్ఠలు అన్నగారినికూడా ఆశ్చర్య చకితుణ్ణిచేస్తున్నాయి. ఉషను గురించి శైలేశ్వరుడు విన్నవాటిల్లో అతడు సంతోషపడే సంగతులేమీలేవు.

ఇలాంటి కఠిన ఆచారాల్లో మునిగి తేలే స్త్రీల విషయంలో లోకులు దోషాలు వెతకరని మాత్రం సంతృప్తిచెందవచ్చు. అలాంటి దోషాలేమైనా ఉషలోవున్నట్టు ఎవరైనా చెప్పినా శైలేశ్వరుడి మనస్సు బాధపడుతున్నదేమో కనుక్కోవటం కూడా కష్టమే. కాని ఒకాటి, ఆమెనుగురించి యీనాటివరకూ చెడ్డసంగతులేవీ అతడి చెవిని పడలేదు.

భూపేంద్ర బెనర్జీకూతురు విషయమై శైలేశ్వరుడు రకరకాల ఆలోచనలు చేయసాగాడు. తను కావాలంటే యీ సంబంధం వదులుకోవచ్చు. కాని, అంతమాత్రాన తన సమస్యలన్నీ పరిష్కారమైపోతాయా? ఛాందస వాతావరణంలో పల్లెపట్టున పెరిగిన ఇరవై అయిదు ఇరవైఆరేళ్ళ వయసు స్త్రీని తీసుకువచ్చి గృహనిర్వహణ బాధ్యత ఒప్పచెపితే, ఇన్నాళ్ళనుంచీ ప్రశాంతగావున్న గృహవాతావరణం—దక్షయజ్ఞంలా ధ్వంసమై పోతుందేమో? అంతే కాక తన తొమ్మిదేళ్ళ కొడుకు ఆ ఉషకు కంటకంలా

కనబడవచ్చు. వాడి తల్లే తన బాధలన్నిటికీ కారణం అనుకుని, ఆమె వాణ్ణి యాతనల పాలుచేసే ప్రమాదంకూడా వుంది—అలాకాక కొడుకును శ్యాంబజారులోవున్న తన చెల్లెలు విభా యింట వదిలితే ఎలావుంటుంది? ఆమె భర్త బారిష్టరు. వాళ్ళకు పిల్లలు కూడా లేరు .ఇలాంటి సమస్యలతో ఉక్కిరి బిక్కిరై పోతున్న శైలేశ్వరుడికి— ఆ దిగ్గజ పండితుడిమీద ఎక్కడలేని కోపం వచ్చింది. అతడి పరుషవాక్యాలవల్లనే, శివానీపూర్ సంబంధాన్ని గురించి యింత లేనిపోని గొడవరేగింది!

శైలేశ్వరుడు మనిషివస్తుతా చెడ్డవాడేంకాదు; కాని దుర్బల స్వభావంకలవాడు. ఆకారణంగా అతడు ఏ విషయంలో అయినా తను పొరబడ్డానేమో అని భావిస్తే, దాన్ని యితరులముందు తనమీద తాను చేసుకునే కటువిమర్శద్వారా, రెండింతలుగా ప్రదర్శిస్తాడు. చదువూ, సంస్కారాలమీద అతనికెంతో అభిమానంవుంది. తాను కావాలని ఎవ్వరికీ అన్యాయంచెయ్యననీ, ఎవరిగురించీ పరుషాలు మాట్లాడననీ మనసులో పెద్ద ధీమాఒకటుంది. కాని, అనుకోకుండా ఉషవిషయమై చర్చవచ్చేసరికి తన మిత్రులు ముఖం మీద ఏమీ అనకపోయినా, వాళ్ళ మనసుల్లో మాత్రం తాను అపరాధి నన్న భావం వున్నదని అతడు గ్రహించాడు.

ఆ రోజు రాత్రంతా శైలేశ్వరుడికి నిద్రపట్టలేదు. కుర్చీలో చేరగిలబడి ఎన్నో ఆలోచనలు చేశాడు. తెల్లవారే సమయానికి అతడికి ఓ మంచి ఉపాయంతోచినట్టయింది. ఉషను పిలిపించేందుకు ఎవరినైనా పంపితే, అన్నిసమస్యలూ పరిష్కారం అయిపోత వని నిశ్చయించుకున్నాడు. అసలామె యిక్కడికి వస్తుందో రాదో అన్నసంశయం కలిగిందతడికి. ఒకవేళ వచ్చినా, ఇది మ్లేచ్ఛుల కొంపగదా! ఒకటి రెండు రోజుల్లో ఆమెకై ఆమే ఇక్కణ్ణించి పారిపోతుంది. అప్పుడు ఎవరూ తనను దోషికింద జమకట్టి విమర్శించరు! ఆ నాలుగైదు రోజులపాటు సోమేంద్రుణ్ణి వాడి మేనత్త యింటికి పంపితే సరిపోతుంది. తను అక్కడా ఇక్కడా ఆ సమయం కాస్తా గడిపేయవచ్చు—

ఇంత సులభసాధ్యమైన పరిష్కార మార్గం ఉండగా, తా నింతకాలం ఎందుకు ఉదాసీనం వహించానా అని బాధపడ్డాడు శైలేశ్వరుడు. ఆ మర్నాడు అతడు కాలేజీకి వారంరోజులపాటు సెలవుపెట్టాడు. ప్రయాగలో అతడికో బాల్య మిత్రుడున్నాడు. తాను ప్రయాగకు వస్తున్నట్టు అతడికి టెలిగ్రాం ఇచ్చాడు. తరవాత చెల్లెలైన విభకు ఓ ఉత్తరం రాశాడు. అందులో తాను ఉషను తీసుకువచ్చేందుకు నందీపురం మనిషిని పంపుతున్నాననీ, ఆమె రావటం జరిగితే, ఇంటికివచ్చి సోమేంద్రుణ్ణి తీసుకు




పొమ్మనీ, తాను ప్రయాగనుంచి తిరిగిరావటానికి కనీసం వారం రోజులు పడుతుందని తెలియపరిచాడు.

శైలేశ్వరుడికి పినతండ్రి కొడుకొకడున్నాడు. వాడిపేరు భూతనాథ్. అతడేదో మెస్సులో తింటూ, ఏదో కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. అతణ్ణిపిలిచి శైలేశ్వరుడు, "భూతనాథ్! నువ్వు నందీపూర్‌పోయి, మీ వదినను తీసుకురా!" అని చెప్పాడు.

ఆ మాటలకు భూతనాథ్ ఉలిక్కిపడి, "వదిన ఎవరు, అన్నయ్యా!" అన్నాడు.

"మలిగుడుపులకు మా వెంట నువ్వూ వచ్చావుగదరా! జ్ఞాపకం లేదా ఏం?" అన్నాడు.

"నాకు జ్ఞాపకం లేకేం! వుంది. కాని అక్కడివాళ్లు నన్ను గుర్తు పట్టగలరో లేదో మరి? వదిన నా వెంట యిక్కడి కెలా వస్తుందీ!" అన్నాడు భూతనాథ్.

"రాకపోతే పోనీ. నీ వెంట మన నౌకరు చెహరా వస్తాడు, దాసీదీ వస్తుంది. ఒక వేళ ఆవిడ రానంటే, మీరు వెంటనే తిరిగిరండి," అన్నాడు శైలేశ్వరుడు.

ఆ తరవాత శైలేశ్వరుడు, భూతనాథ్‌కు కొంత డబ్బూ, ఒక తాళంచెవీయిచ్చి, "నేను రాత్రి బండికి ప్రయాగ వెళుతున్నాను. వారం తరవాత వస్తాను. మీ వదిన రావటం జరిగితే ఆవిడకు యీ తాళం చెవియిచ్చెయ్యి. బీరువాలో డబ్బుంది. ఆ డబ్బుతో యీ నెలంతా గడిచిపోవాలి," అన్నాడు.

భూతనాధుడు తాళం చెవితీసుకుని, "అది సరే కాని చిన్నన్నయ్యా, అసలు నీకీ ఆలోచన ఎలా వచ్చింది? హాయిగా ఉంటున్నవాడివి ఆపదనేదో నెత్తికి తెచ్చుకో వటం లేదు గదా!" అన్నాడు.

శైలేశ్వరుడు ఒక పెద్ద నిట్టూర్పు విడిచి, " ఆసలామె రానేరాదు. కాని నలు గురి దృష్టికి, నేను కాస్త ధర్మబుద్ధితో చేసిన పనంటూ ఒకటి కనపడాలి. సరే, నువ్వు కాస్త శ్యాంబజారుకూ్కడా వెళ్ళి, విభతో సోమేంద్రుణ్ణి తీసుకు పొమ్మని చెప్పాలి." అన్నాడు.

ఆ రాత్రే పంజాబ్ మెయిల్లో శైలేశ్వరుడు ప్రయాగకు వెళ్లాడు.

## 2

కొద్దిరోజులు గడిచినై. ఒక మధ్యాహ్నంవేళ కారొకటి వచ్చి శైలేశ్వరుడి ఇంటి ముందాగింది. అందులోనుంచి ఇరవై రెండు ఇరవై మూడేళ్ళ స్త్రీ ఒకామె దిగి, ఇంటిలోకి వెళ్ళింది. హాల్లో పరిచివున్న తివాసీ మీదకూర్చుని సోమేంద్రుడు తన కొత్త అమ్మకు ఏదో ఆల్బం ఒకటి పేజీలు తిప్పి చూపిస్తున్నాడు. హాల్లోకి వస్తున్న స్త్రీని చూస్తూనేవాడు, "అమ్మా! ఈవిడ మా అత్త:" అని కొత్త అమ్మకు చెప్పాడు.

ఉష గబ గబా లేచి నిలబడింది. ఆమె ఎర్రంచుగల చాలా సాదా అయిన చీర కట్టుకుని వుంది. ఆమెమెళ్లో, చేతులకూ కొద్దిపాటి నగలున్నాయి. కాని, ఆమెలో ఏదో అస్వాభావికమైన సౌందర్యంఉంది. ఆ రూపాన్ని చూస్తూనే విభ వెల వెల బోయింది.

ఉష, సోమేంద్రుడితో, "నువు అత్తకు నమస్కారం చెయ్యవేం, నాయనా?" అన్నది.

సోమేంద్రుడికి యీ పద్ధతులు అలవాటు లేనివి. అయినా అతడు తలవంచి చేతితో మేనత్త తొడుక్కున్న పాదరక్షలు తాకి, నమస్కరించానని పించాడు.

"ఇంకా అలా నించునే ఉన్నారేం, వదినా! కూర్చోండి." అన్నది ఉష.

"మీ రెప్పుడొచ్చారు?" అన్నది విభ.

"ఇవాళ బుధవారం గదా—సోమవారంనాడు వచ్చాను. అలా ఎంత సేపని నించుంటారు, కూర్చోండి, వదినా!" అన్నది ఉష.



విభ కూర్చోలేదు. ఆమె వదినగారితో మర్యాదగా మాట్లాడి, ఆపేక్షలు చూపేం దుకు రాలేదు. ''నాకు కూర్చునే తీరికలేదు, అవతల చాలా పనులున్నాయి. సోమేం ద్రుణ్ణి తీసుకు పోదామని వచ్చాను,'' అన్నది.

విభ ఆమాటల్ని చాలా కటువుగా అన్నది. కాని ఉష చిరునవ్వు నవ్వుతూ, ''వదినా, ఒంటరిగా ఎలాఉండగలను?—అక్కడ మా అన్నయ్య పిల్లల పోషణ భార మంతా నేనే చూసేదాన్ని, ఇక్కడ నాతోపాటు మరొక రుండకపోతే, అసలిక్కడ ఉంటడమే సాధ్యం కాదు,'' అన్నది.

విభ కోపంగా సోమేంద్రుణ్ణి దగ్గిరకుపిలిచి," సోమేన్, మీ నాన్న నిన్ను మా ఇంటికి తీసుకు వెళ్ళమన్నాడు. వెళ్ళి త్వరగా గుడ్డలు వేసుకునిరా. నాకు న్యూ మార్కెట్‌కు వెళ్ళవలసిన పనికూడా వుంది," అన్నది.

కుర్రవాడు ఏమి చేసేందుకూ పాలుపోని స్థితిలో పడ్డాడు. వాడికి సవతితల్లి గురించి తెలిసినంతగా మేనత్త గురించి తెలియదు. ఆ కారణంవల్ల వాళ్ళిద్దరిమధ్యా చిక్కుకుని బిక్కమొహంతో, "అమ్మ రానివ్వదు, అత్తా!" అన్నాడు.

ఈ మాటలువిని ఉష, "నేను నిన్ను వెళ్ళవద్దనటం లేదు, సోమేన్! నువ్వు కూడా లేకపోతే ఇంట్లో నా కొక్కత్తెకూ ఏమీ తోచదని అన్నాను, అంతే," అన్నది.

సోమేంద్రుడు మౌనంగాపోయి సవతితల్లి కొంగుపట్టుకుని నిలబడ్డాడు. ఉష వాడి తల నిమురుతూ, "వీడికి రావటం యిష్టమైనట్టు లేదు, వదినా!" అన్నది.

కోపంతో విభ ముఖం వివర్ణమైంది. విభ బాగా చదువుకున్న మహిళ. అయినా ఉష మాటల్తో అమె, అలాంటి మహిళలు అవసర సమయాల్లో కనబరిచే నిగ్రహశక్తిని ప్రదర్శించ లేకపోయింది. ఆమె ముఖం కందగడ్డలా చేసుకుని, "వీడు నావెంట వచ్చితీరాలి. వీడికి మీరేదో నూరి పోసిఉండకపోతే, వాళ్ళనాన్న ఆజ్ఞను అక్షరాలా పాటించి నావెంట వచ్చేవాడే!" అన్నది.

ఈ కటువాక్యాలు ఉషను ఏమంతగా కలవరపరచలేదు. కొంచెంగా పెదవి విరిచింది, అంతకన్న ఆమె ముఖంలో కోప లక్షణాలు ఏమీ కన్పించలేదు. ఆమె శాంత స్వరంతో, "సోమేంద్రుడు నా దగ్గిర ఉన్నందుకు మీరేం ఆదుర్దా పడవలసిన పని లేదు, వదినా!" అన్నది.

"సరే, మా అన్నయ్యకు ఉత్తరం రాస్తాను," అన్నది విభ తీవ్ర స్వరంతో.

"అలాగే రాయి. వారు ప్రయాగలో కూర్చుని పంపే ఆజ్ఞలకన్న, కలకత్తాలో వున్న వారి చెల్లెలి ఆజ్ఞల్నే నేనెక్కువగా మన్నిస్తున్నానని రాయి. చూడు, విభా! నీకన్న పెద్దదాన్ని నేను. ఈ విషయంలో నువ్వు నా మనసు బాధపడేలా మాట్లాడకు. కోపం కొద్దీ కూర్చోనయినా కూర్చోలేదు నువ్వు. కాని నీ అంత నువ్వువచ్చి యీ వదినదగ్గిర కూర్చునేరోజు రాకపోదు," అన్నది ఉష.

"ఇవాళ నాకేం తీరికలేదు, నమస్తే!" అంటూ విభ గిరుక్కున వెనుదిరిగి హాల్లో నుంచి బయిటికిపోయి కార్లో కూర్చున్నది.

* * *

కాలేజీకి వారంరోజులపాటు సెలవు పెట్టిపోయిన శైలేశ్వరుడు ప్రయాగలో దాదాపు రెండు వారాలుగడిపి, హఠాత్తుగా ఒకనాటి పన్నెండు గంటలవేళ ఇంటికి తిరిగొచ్చాడు. ఇంట్లోకి వస్తూనే అతడు హాల్లో కూర్చునిఉన్న సోమేంద్రుణ్ణి చూశాడు. వాడు కొన్ని వెదురుబద్దలూ, రంగు కాయితాలూ, మైదాపిండీ ముందర వేసుకుని కూర్చుని ఉన్నాడు. తండ్రిని చూస్తూనే వాడు సిగ్గుతో కాస్త తటపటాయించి, చటుక్కున వెళ్ళి ఆయన పాదాలు తాకి నమస్కరించాడు. కొడుకు అలా చేయటం శైలేశ్వరుడికి ఏమంత వెగటుగా తోచలేదు. కాని అతడి దృష్టి రంగు కాయితాలమీదా, వెదురు బద్దలమీదా పడగానే కొంచెం ఆశ్చర్యపోతూ, "ఈ సరంజామా అంతా ఎందుకురా, సోమన్" అని ప్రశ్నించాడు.

"ఇవన్నీ ఎందుకో నువ్వే చెప్పు చూద్దాం, నాన్నా!" అన్నాడు సోమేంద్రుడు.

"నా కెలా తెలుస్తుంది!" అన్నాడు శైలేశ్వరుడు.

సోమేశ్వరుడు చప్పట్లుకొట్టి, ఉత్సాహంగా, "ఇవి, ఆకాశ దీపం కట్టేందుకు. ఆకాశం ఎందుకో తెలుసా?" అంటూ వాడు తండ్రి ముఖం కేసి చూశాడు. ఆనాటి ఉదయమే వాడు ఆకాశ దీపం మహత్తు తెలుసుకుని ఉన్నాడు. ఆ కారణంగా మరింత హుషారు తెచ్చుకుని, "ఇవాళ సంక్రాంతి. ఆకాశ దీపం తయారుచేసి దాన్ని రేపు సాయంత్రం ఒక పొడవాటి వాసం పాతి దానికి కట్టాలి. స్వర్గంలో వున్న మన తాతలూ వాళ్ళూ, ఆ దీపం చూసి చాలా సంతోషించి, మనల్ని ఆశీర్వదిస్తారు—ఈ సంగతి అమ్మ చెప్పింది," అన్నాడు.

శైలేశ్వరుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతడు రంగు కాయితాల్నీ, వెదురు బద్దల్నీ కాలితోతన్ని చిందర వందర చేశాడు. తర్వాత కొడుకుతో, "తాతలు ఆశీర్వదిస్తారా? లోకంలోని ఛాందసాలన్నీ నీకూ అబ్బుతున్నాయన్నమాట! పోయి చదువుకో, ఊఁ" అన్నాడు కఠినంగా.

సోమేంద్రుడి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. వాడు బావురుమని ఏడవబోయేంతలో, మేడపై అంతస్థులోని మెట్లమీదినుంచి, "నాయనా, సోమేన్! ఏడవకు. రేపు బజారు నుంచి నీకో మంచి ఆకాశ దీపం కొని తెప్పిస్తాను. ఇటు నా దగ్గిరకు రా!" అన్న పిలుపు వినిపించింది.

సోమేంద్రుడు కళ్ళు తుడుచుకుంటూ మెట్లెక్కి మేడపైకి పోయాడు. శైలేశ్వరుడు సరాసరి తన రీడింగ్ రూమ్‌లోకి పోయి, టేబిల్ ముందు కూర్చుని, కాలింగ్ బెల్ నొక్కాడు. ఎవరూ గదిలోకి రాలేదు. ఒక్క క్షణం ఆగి, "అబ్దుల్!" అని పిలిచాడు.



జవాబులేదు. "గిరిధారీ!" అని కేక పెట్టాడు. జవాబులేదు. మళ్ళీ అతడు బెల్ నొక్క బోతూండగా బెంగాలీ నౌకరు గోకుల్ వచ్చి, కర్టెన్ కొంచెం తొలిగించి చూస్తూ, "హుజూర్!" అన్నాడు.

"అందరూ చచ్చారాఏం? పలకరేం?" అన్నాడు శైలేశ్వరుడు విసుగ్గా,

"....లేరు, హుజూర్!" అన్నాడు గోకుల్.

"లేరా? అబ్దుల్ ఎక్కడికి పోయాడు?"

"అమ్మగారు అతణ్ణి మాన్పించేశారు. అతను ఇంటికి వెళ్ళిపోయాడు."

"అబుల్‌ను వెళ్ళగొటిందా?మరి గిరిధా రేమయాడు?"అన్నాడు శైలేశ్వరుడుకోపంగా.

అతణ్ణి అమ్మగారు పంపేశారు, హుజూర్! వాడూ ఇంటికి వెళ్ళిపోయాడు.''

ఈ జవాబుకు శైలేశ్వరుడు ఉలిక్కిపడి, "అంటే, ఇంట్లో నౌకర్లనూ చాకర్లనూ ఎవర్నీ లేకుండా చేసిందా ఏం?" అని అడిగాడు.

"తతిమ్మా వాళ్లంతా ఉన్నారు, హుజూర్!" అన్నాడు గోకుల్ తలాడిస్తూ.

"వాళ్లకు మాత్రం యిక్కడేంపని?—పో, నువ్విక్కణ్ణించి!" అంటూ కసురు కున్నాడు శైలేశ్వరుడు.

ఆ తరవాత అతడు బూట్లు స్వయంగా విప్పుకుని, కోటు తీసి టేబుల్‌మీద పడే శాడు. నెక్‌టై ఊడదీసి దగ్గర్లో ఉన్న కుర్చీమీదికి విసిరివేశాడు. దణ్ణెం పైనుంచి ధోవతి తీసుకుని కట్టుకుని, టేబిల్ ముందున్న కుర్చీలో కూర్చున్నాడు. ఆ సమ యంలో అతడి దృష్టి టేబిల్‌మీద ఉన్న ఒక తెల్ల కాయితాల పుస్తకంమీద పడింది. దాని అట్టమీద, ఇంటి జమా ఖర్చు—అని రాసి ఉంది.

శైలేశ్వరుడు పుస్తకం తీసుకుని పేజీలు తిరగవేశాడు. అందులో అతడి భార్య బజారు నుంచి తెప్పించిన వస్తువుల వివరాలూ, వాటి ఖరీదులూ రాసి ఉన్నది. అత డా వివరాలు చూస్తూండగా, వెనక వైపునున్న కర్టెన్‌ను మెల్లిగా పక్కకు నెట్టి ఉష గదిలోకి వచ్చింది. వస్తూనే భర్త పాదాలకు నమస్కరించి, "మీ రిప్పుడు టీ తాగుతారా? ఆ తరవాత ఎన్నింటికి భోజనం చేస్తారు?" అని అడిగింది.

"భోజనం చెయ్యను," అన్నాడు శైలేశ్వరుడు ముక్తసరిగా.

"భోజనం చెయ్యకపోవటం ఏమిటి? లేచి, కాళ్లూ చేతులూ కడుక్కుని మేడ మీదికిరండి, ఫలహారం ఏర్పాటు చేశాను. కుముదతో చెప్పి వచ్చాను—అది యీ లోపల షర్బత్ చేసి తెస్తుంది," అన్నది ఉష.

"ఇప్పుడవేం వద్దులే!" అన్నాడు శైలేశ్వరుడు తలవంచుకునే విసుగ్గా.

"నేను ఉషనండీ, పెద్దపులినీ, ఎలుగుబంటునూకాను. కొంచెం తలెత్తి నాకేసి చూస్తే అందరూ ఆడిపోసుకుంటారా?" అన్నది ఉష.

"నేను నిన్ను పెద్దపులివనిగాని, ఎలుగుబంటివనిగాని అనలేదు. విభతో ఎందుకు పోట్లాడావ్?" అని అడిగాడు శైలేశ్వరుడు.

"ఇది బహుశా మీరు కల్పిస్తున్న అభియోగం. నేను ఆమెతోపోట్లాడానని విభ మీకు రాసివుండదు," అన్నది ఉష.

"అబ్దుల్‌ని ఎందుకు వెళ్ళగొట్టావ్?" అన్నాడు శైలేశ్వరుడు.



''నేనేం వెళ్ళగొట్టలేదు. గడచిన సంవత్సరంనుంచీ అతడికి జీతం ముట్టలేదు. స్వగ్రామానికి వెళ్ళాలన్నాడు. లెక్కచూసి జీతం డబ్బిచ్చిపంపాను,'' అన్నది ఉష.

ఆ జవాబుకు కైలేశ్వరుడు ఆశ్చర్యపోతూ, ''వాడికి బకాయి డబ్బంతా యిచ్చేశావా? అయితే వాడు తిరిగిరాడు. మరి గిరిధారి కూడా ఎందుకు వెళ్లిపోయాడు?'' అన్నాడు.




"మీరు నౌకర్లకు జీతాలివ్వకుండా యిక్కడ కట్టి పడవేసి ఉంచటం చాలా అన్యాయం. వాళ్లకూ సంసారాలుంటాయి. గిరిధారి కూడా లెక్కచూసి డబ్బిచ్చి పంపాను."

"చాలా మంచిపనులే చేశావ్. ఇక ఈ ఇంటిని వసిష్ఠాశ్రమంగా తయారు చెయ్యి," అన్నాడు శైలేశ్వరుడు. అతడు జమా ఖర్చు లెక్కల పుస్తకం పేజీలు తిప్పుతూనే ఇదంతా మాట్లాడుతున్నాడు. హఠాత్తుగా అతడి దృష్టి ఒక పెద్ద మొత్తంమీద పడింది. అతడు ఉలిక్కిపడుతూ, "ఇదేమిటి? ఇంత పెద్ద మొత్తం .. నాలుగువందల ఆరు రూపాయిల చిల్లర "

ఉష అతడు మాట పూర్తి చేయకుండానే అందుకుని, ఆ మొత్తం కిరానా కొట్లో జమ కట్టించాను," అన్నది. ఇంకా రెండు వందలదాకా బాకీఉంది. వచ్చే నెలలో యిస్తానని కబురు చేశాను," అన్నది.

"ఆ కిరానా కొట్టువాడికి ఆరువందల రూపాయిల బాకీయా?" అన్నాడు శైలేశ్వరుడు తెల్లబోతూ.

ఉష నవ్వి, "ఆ కొట్టువాడి బాకీ మీరేనాడూ పూర్తిగా చెల్లించలేదు. అందువల్లే అంత పెద్ద మొత్తమయింది," అన్నది.

అప్పటికి శైలేశ్వరుడు తల ఎత్తి ఉష ముఖం చేసి చూస్తూ, "వాడి లెక్కంతా జాగ్రత్తగా చూశావా?" అని అడిగాడు.

''చూడక తప్పుతుందా మరి!'' అన్నది ఉష.

శైలేశ్వరుడు కొంచెంసేపు తలవంచుకుని ఆలోచిస్తూ వూరుకుని తరవాత, ''నువ్వు, డబ్బంతా ఖర్చుచేసేశావు. యింకా పదిహేను రోజులకుగాని జీతం చేతికిరాదు ఎలా?'' అన్నాడు.

ఉష తలాడిస్తూ, ''ఆ మాత్రం నాకు తెలియదా ఏం? ఈ పదిహేను రోజుల్లో మిమ్మల్ని డబ్బడగను. ఇంకా మీరెక్కడైనా బాకీలు చేశారా? నాదగ్గర దాచకండి,'' అన్నది.

''పోయిన వేసవిలో సిమ్లా వెళుతూ ఒకతని దగ్గిర నోటురాసి రెండువేలు తీసుకున్నాను. అందులో ఒక్క రూపాయయినాచెల్లువేయలేదు,'' అన్నాడు శైలేశ్వరుడు.

ఉష బుగ్గమీద వేలుపెట్టుకుని ''ఇది చాలా అన్యాయంగాఉంది.'' అంటూనవ్వి, ''మీమూలంగా మరోసంవత్సరం వరకూ నేను ఋణవిముక్తురాల్ని కాలేనట్టున్నది. సరే, గుర్తుతెచ్చుకోండి, మరెవరికైనా యివ్వవలసిన బాకీలున్నయ్యా?'' అని అడిగింది.

''ఉహుం, ఏమయినా చిన్న బాకీలుంటే వుండొచ్చు. కాని నేను యీ జన్మలో ఋణవిముక్తుణ్ణికాలేననుకుంటూండేవాదిని,'' అన్నాడు శైలేశ్వరుడు.

''నిజంగా . మీ రెప్పుడైనా యీబాకీలగురించి ఆలోచించారా?'' అని అడిగింది ఉష.

''నేనంతగా ఆలోచించననుకో. కాని, ఒకోసారి అర్ధరాత్రివేళ మెళకువ వస్తే, యీ బాకీల సంగతి గుర్తుకొచ్చి మనస్సు వికలమై పోతూండేది వచ్చే జీతమా సరి. పోతూండటంలేదు! సరేకాని, ఉషా! నువ్వు నాకు లేనిపోని ఆశలుపెట్టకు. నిజంగా నీకు యీ ఋణమంతా తీర్చగలనన్న ధైర్యం వుందా?'' అని అడిగాడు శైలేశ్వరుడు.

ఉష నేత్రాలు చెమ్మగిల్లాయి. భర్త తనకోసం అంతో యింత హృదయవేదన పడుతున్నట్టు ఆమె గ్రహించింది. ఆమె లేని నవ్వును కనబరుస్తూ, ''మీరు అందరు గృహస్థులలాగానే గృహనిర్వహణకు అవసరం అయిన ఖర్చులే చేస్తూ అప్పుల పాలయ్యారు. అవేం తీర్చటానికి అలవికానంత అప్పులుకావు. అంతా తీర్చటానికి ఎంతకాలం పడుతుంది అనేసింది.

''మనం మరీ పొదుపు ప్రారంభించి. అందరం యిబ్బంది పడతామేమో?'' అన్నాడు శైలేశ్వరుడు.

''అలాంటి ఇబ్బందేమీ ఉండదు. గృహనిర్వహణలో నేను చేసినమార్పులసలు మీరు కనుక్కోనేలేరు,'' అన్నది ఉష.






శైలేశ్వరుడు మౌనంగా, తృప్తిగా కుర్చీలో కదలా మెదలక కూర్చుండిపోయాడు. ఎంతోకాలంగా మేఘావృతమై ఉన్న ఆకాశంనుంచి, తనమీదికి ఏమూలనుంచో సూర్య రశ్మి వచ్చిపడుతున్నట్టు తోచిందతడికి.

ఆ మర్నాడు అతడు తన రీడింగ్ రూములో కూర్చుని ఏదోపుస్తకం చదువుకుంటూండగా, పనిమనిషి కుముద వచ్చి, "బాబుగారూ! అమ్మగారు తమకు భోజనం వడ్డించామని చెప్పమన్నారు," అని చెప్పింది.

శైలేశ్వరుడు తలఎత్తి గోడగడియారం కేసిచూసి, "నాకింకా భోజనానికి వేళ కాలేదు. మరీ యాభై నిషాలగ్గాని భోజనం చెయ్యను. అబ్దుల్ లేకపోవటంతో ఏపనీ సక్రమంగా జరగటంలేదు," అన్నాడు.

కుముద మారుమాటాడకుండా వెనుదిరిగి వెళ్ళబోయేంతలో, శైలేశ్వరుడు ఆవిణి వెనక్కు పిలిచి, "ఇప్పుడే వస్తున్నాననిచెప్పు!" అన్నాడు.

ఇవాళ భోజనాలగదిలో టేబిలూ, కుర్చీలులేవు. అతడి పడకగదికి ఎదురుగా వున్న వరండాలో, పీటలూ అవీ వేసిఉన్నాయి. అంతా బెంగాలీ పద్ధతిలో వంటకాలు తయారుచేయ బడిఉన్నాయి. లోగడఉన్న గాజుగ్లాసులూ, పింగాణీప్లేట్ల స్థానంలో, శుభ్రంగా తోమిన చెంబులూ, గ్లాసులూ పెట్టిఉన్నాయి. వెండి కంచానికి చుట్టూ, చిన్న చిన్న గిన్నెల్లో కూరలన్నీ పెట్టిఉన్నాయి. దాపుగిగా ఉష కూర్చునివుంది. ఆమె దగ్గిర సోమేంద్రుడు కూర్చుని ఉన్నాడు.

శైలేశుడు పీటమీద కూర్చుంటూ, "నువ్వు నాతో కలిసి భోజనం చెయ్యవు. ఆ సంగతి తెలుసనుకో, కాని సోమేంద్రుడిమాటేమిటి? వాడూ తినకూడదా?" అన్నాడు.

ఉష జవాబిచ్చేలోపలే కుర్రవాడు, "నేను రోజూ అమ్మదగ్గిరే భోంచేస్తున్నాను, నాన్నా!" అన్నాడు.

"ఈ కూరలూ యివీ అన్నీ నువ్వేతయారు చేశావా?" అని అడిగాడు శైలేశ్వరుడు.

"ఊఁ," అన్నది ఉష.

"అయితే యిక వంటబ్రాహ్మడి అవసరం కూడా ఉండదన్నమాట! అతడికీ బకాయిడబ్బంతాయిచ్చిపంపేశావా?" అని అడిగాడు శైలేశ్వరుడు.

ఉష వచ్చేనవ్వాపుకుంటూ, "నౌకర్లకు బకాయీడబ్బులివ్వటమేకాదు, అవసరం అయితే బయానాడబ్బులుకూడా యివ్వవలసి ఉంటుంది. కాని, వంటబ్రాహ్మణ్ణి పంపెయ్యలేదు. యిక్కడే ఉన్నాడు. పిలవమంటారా?" అనడిగింది.

శైలేశ్వరుడు తల అడ్డంగాతిప్పుతూ, "వద్దు, వద్దు. కాని, నువ్వోరోజునా అతణ్ణి వంటచెయ్యనివ్వకపోతే మాత్రం, నేర్చుకున్నవంట కాస్తా మర్చి పోతాడు. అలా జరిగితే పాపం, అతడికి చాలానష్టం!" అన్నాడు.

ఇవాళ శైలేశ్వరుడు కూరలూ అవీ చాలా రుచికరంగాఉన్నట్టు తెలుసుకున్నాడు. అతడికి తనతల్లి జీవించివున్నరోజులు జ్ఞాపకం వచ్చాయి. ఒక చిన్నకూరగిన్నె దగ్గిరకు తీసుకొని, "ఆహాఁ! ఎంత చక్కనివాసన వేస్తోందిది! సన్యాసులు మాంసం తినరుగాని, సొరకాయ కూరలో మాత్రం మషాళా అవీ బాగావేసి మాంసం కూర లాగానే తయారుచేస్తారు. సొరకాయ నాకెంతో యిష్టం. కాని, మేక మాంసంలా తయారుచేసిన సొరకాయకూర అంటే మాత్రం నాకు గిట్టదు." అన్నాడు.

ఉష కిల కిలా నవ్వింది. ఆ నవ్వుకు కారణం సవతితల్లి ఒడిలో కూర్చునిఉన్న సోమేంద్రుడి తెలియలేదు. అతడు తల్లిముఖంకేసి చూస్తూ, "అమ్మా, ఆ కూర మేకమాంసంలా ఎట్టా చేస్తారు?" అని అడిగాడు.

ఉష కుర్రవాణ్ణి గుండెలకు హత్తుకుంటూ భర్తతో, "ముందు ఆ కూరతిని చూడండి!" అన్నది.

శైలేశ్వరుడు కూర కొంచెం కలుపుకుని నోట్లో పెట్టుకుని, "ఇది సొరకాయ కూరకాదు, మేకమాంసమే. దీన్ని ఇంత బాగా వండటం ఎక్కడ నేర్చుకున్నావ్?" అని అడిగాడు.

ఉష ముఖం సంతోషంతో విప్పారిల్లింది. "వంటచేయటం ఒక్క మీ అబ్దుల్‌కే చేత నవుననుకున్నారా? మా నాన్నగారు సిద్ధేశ్వర దేవికి పూజారి. నేను గోసాయీల ఇంటినుంచి వచ్చాననుకుంటున్నారా ఏం మీరు?" అన్నదామె.




"ఈ కూర తింటూ అలా అని నేనెందు కనుకుంటాను? అయినా ఇక్కడ సిద్ధేశ్వరీదేవి లేదు. మరి నాకు రోజూ ఇంత రుచిగల కూరలు దొరుకుతూంటాయా?" అని అడిగాడు శైలేశ్వరుడు.

"ఎందుకు దొరకవు? మనం యీ మాత్రం తిండికూడా తినలేని స్థితిలో ఉన్నామా?" అన్నది ఉష.

"మొదట్లో అబ్దుల్ వెళ్ళిపోయాడని తెలిసి నాకు కొంచెం విచారం వేసింది. ఈ కూరల రుచిచూసిం తరవాత మరేం విచారం లేదు. కాని, నామీద కొంత రుణభారం పడిఉన్నది గదా," అన్నాడు శైలేశ్వరుడు.

ఆ మాటలకు ఉష కాస్త మనస్సుకు బాధ కలిగిన దానిలా, "నేను భర్తకీ, కొడుక్కీ కడుపు మాడ్చి రుణం తీరుస్తానని చెప్పానా మీతో? దానిసంగతి మీరేనాడూ తేకండి. అదంతా నేను చూసుకుంటాను," అన్నది.

"ఉషా! అసలేకారణంవల్ల నేనింత అప్పుల పాలయ్యానో నాకు తెలీదు." అన్నాడు శైలేశ్వరుడు.

"అది తెలుసుకోవలసిన అవసరం కూడా మీ కెన్నడూ రాదు. దయవుంచి, నన్ను పిచ్చిదని మాత్రం మళ్ళీ దూరంగా పంపెయ్యకండి," అన్నది ఉష.

శైలేశ్వరుడి మనస్సు చివుక్కుమన్నది. అతడేం జవాబు చెప్పలేక, తలవంచుకుని భోజనం చెయ్యసాగాడు. సోమేంద్రుడు తల్లి చెయ్యి పట్టుకులాగుతూ, "అమ్మా, పద. నువ్వు భోంచెయ్యవా ఏం? నిన్న సగం చెప్పి వదిలేసిన జటాయు పక్షి కథ అంతా యివ్వాళ చెప్పాలి. జటాయు పిల్లలు ఏం చేశాయప్పుడు?" అని అడిగాడు.

శైలేశ్వరుడు తలఎత్తి, "జటాయువు పిల్లలు ఏమైనా చెయ్యనీయ్ కానీ, ఈ పిల్లవాడు మాత్రం నీకు పూర్తిగా మాలిమై పోయాడు," అన్నాడు.

ఉష మాట్లాడకుండా పిల్లవాడి తల నిమరసాగింది "ఉషా! కారణం ఏమిటో నీకు తెలుసా?" అని అడిగాడు శైలేశ్వరుడు.

"అంత తెలియని కారణం ఏముంది? వీడికి తల్లిలేదు. ఇంట్లో ఆడుకునేందుకూడా ఎవరూ లేరు పాపం. ఇంకా పసివాడేనాయె!" అన్నది ఉష.

"అది నిజమే. కాని తల్లి బతికివుండగా కూడా వీడింత ప్రేమాదరాల్ని పొంది ఉండడు," అన్నాడు శైలేశ్వరుడు.

ఉష ముఖం కాస్త ఎర్రనైంది. "మీరే మాటపట్టుకున్నా ఓ పట్టాన వదలరు. మరి కొంచెం మాంసం కూడా తెమ్మని చెప్పనా? ఆ రెండు మిఠాయి వుండలూ తినకుండా మాత్రం లేవకండి," అన్నదామె.

శైలేశ్వరుడు కొంచెం విసుగ్గా ఉష ముఖంకేసి చూశాడు. భోజన సమయంలో యింత బలవంతం అదీచూసి, అతడికి చిన్ననాటి సంగతులు జ్ఞాపకం వచ్చాయి. అతడు తల్లికి ఒక్కడే కొడుకు ఆ స్మృతులు అతడి హృదయాన్ని ఉద్వేగపరిచినై. అతడొక మిఠాయి ఉండను చిదిపి నోట్లోవేసుకుని, "ఉషా! నే నేనాడూ ఏ ఖర్చుగురించీ జమాఖర్చులు చూసుకోలేదు. ఈ భారమంతా యికనీదే. నేనిక నిశ్చింతగా ఉంటాను," అన్నాడు.

# 3

ఒకవారం రోజులు గడిచి పోయినై. తిరిగి ఆదివారం వచ్చింది. ఆ ఉదయం భర్త కొంచెం తీరిగ్గా ఉన్నప్పుడు, ఉష అతడితో, "మీకు రోజూ చెబుతూనే ఉన్నాను. విభను ఒకసారి మన ఇంటికి తీసుకురండి. ఆమె నన్ను గురించి ఏమనుకుంటున్నదో మరి! మీ రామెకూ నాకూ వైరం పెట్టదలిచారా ఏం?" అన్నది.

"నాకు కాలేజీ పనితో తీరటం లేదు," అన్నాడు శైలేశ్వరుడు.

"అది నిజమే అనుకోండి. కాని, కాలేజీనుంచి తిరిగి వచ్చేప్పుడు, ఓసారి అటు కేసి వెళ్లి రాకూడదా? ఇవ్వాళ ఆదివారం కదా—ఒకసారి అటు వెళ్ళిరండి," అని ఉష గుర్రబ్బండివాణ్ణి కేకవేసి, "బాబుగారిని బండీలో శ్యాం బజారుకు తీసుకు పోయి, అక్కడదించి, నువ్వు వెంటనే తిరిగిరా. నాకు బండీతో పనుంది." అన్నది.

గుర్రబ్బండి వాకిట్లోకి రాగానే, శైలేశ్వరుడు కొడుకుతో, "పదబాబూ! నువ్వు కూడా నాతోవచ్చి, అత్తయ్యను మనింటికి తీసుకువద్దువు గానిరా," అన్నాడు.

కాని సోమేంద్రుడు తండ్రిమాటవింటూనే సవతితల్లి దగ్గిరకుపోయి నించున్నాడు. వాడికి మేనత్త ఇంటికి వెళ్ళటంఅంటే కాస్త భయం. ఉష వాణ్ణిదగ్గిరకు తీసు కుంటూ, "సోమేన్‌ను యిక్కడే ఉండ నివ్వండి. మరోసారి ఎప్పుడైనా అత్తయ్య వాళ్లింటికి వెళ్తాడులే," అన్నది.

మధ్యాహ్నం రెండున్నర గంటలవేళ శైలేశ్వరుడి వెంట అతడి చెల్లెలు విభా. ఆమె భర్త క్షేత్రమోహనుడూ, అవివాహితఅయిన పదిహేడూ పద్దెనిమిదేళ్ళ అతడి చెల్లెలు ఉమా ఉన్నారు. విభను ఇంటికి తీసుకురావాలని శైలేశ్వరుడికి లేదు. తన భార్యనుగురించి ఆమెకు చాలా ఫిర్యాదు లున్నాయని అతడు అనుమానించాడు. ఆ అనుమానం చాలావరకు నిజం. ఇవాళ అందరి ఎదటా తన వదినె ఉష వట్టి మూర్ఖు రాలని రుజువు చేయాలన్న పట్టుదలతో వచ్చింది, విభ. పల్లెటూరి ఛాందస వాతా వరణంలో పెరిగిన తన వదినతో ఏదోవాదం పెట్టుకుని, ఆవిడవట్టి అమాయకురాలని తేల్చి పారెయ్య దలుచుకున్న దామె. ఇంతకాలం జరిగిపోయాక తన అన్న ఆమెను ఇంటికి తెచ్చుకోవటం అంటే—తమ తండ్రి స్మృతికి అపచారం చేయటమే అన్న నమ్మకం కూడా ఆమెకున్నది.

విభ తన అన్నగారితో ఉషను గురించిన ప్రస్తావనతెచ్చి, "ఆవిడకు చదువూ, సంస్కారాల్లాంటి వేమీలేవు. హైసొసైటీ మహిళలతో తిరిగే నేను, ఆవిడ మా వదినెగారని ఎలా చెప్పుకునేది? సభలకూ, విందులకూ నాతోపాటు ఆవిణ్ణి తీసుకు పోవటం అసంభవం!" అన్నది.

ఆ సమయంలో పక్కనేఉన్న క్షేత్రమోహనుడు—ఉషతో ఏమాత్రం పరిచయం లేని వాడయినా, ఆమెతరఫున ఒకటి రెండు మాటలు మాట్లాడాలని ప్రయత్నించాడు. కాని భార్య గట్టిగా దబాయించేసరికి, అతడు నోరెత్తలేక పోయాడు.

విభ ఎంతో కోపంగా భర్తతో, "ఇలాంటి విషయాల్లో నాకున్న పరిజ్ఞానం ఏపాటిదో మా అన్నయ్యకు బాగా తెలుసు ఆవిడఇంట్లో కాలుపెడుతూనే, ఎంతో కాలంగా ఉన్న అబ్దుల్‌ను, ముసల్మానన్న కారణంతో వెళ్లగొట్టింది. తక్కువ కులస్థుడని గిరిధారిని కూడా పంపేసింది. జాతి కులాల విషయంలో ఇంత మూర్ఖత్వంఉన్నావిడతో దగ్గరసంబంధం పెట్టుకోవటం అంటే మనం చిక్కుల్లో పడటమే అవుతుంది. ఇలాంటావిణ్ణి వదినెగా ఒక్క క్షణకాలం అయినా నేను ఒప్పుకోను—ఇలా అన్నానని ఎవరికి కోపంవచ్చినా సరే," అన్నది.

"అబ్దుల్, గిరిధారీ వాళ్ళజాతి కారణంగా వెళ్ళగొట్ట బడలేదులే. వాళ్లెప్పుడూ తమ గ్రామాలకు వెళ్లాలని గునుస్తూండేవాళ్ళు," అన్నాడు శైలేశ్వరుడు.

అన్నగారి యీ సమాధానం విభకు ఏమాత్రం తృప్తి కలిగించలేదు. ఆవిడ మరింత కోపం తెచ్చుకుని, "ఆ చచ్చిపోయిన వదిన బతికుండగా వీళ్లెవరికీ ఇళ్ళకు పోవాలన్న ఆదుర్దా ఉన్నట్టులేదు. ఈవిడ ఇంటికి రాగానే వాళ్ళల్లో అలాంటి ఆదుర్దా పుట్టుకొచ్చింది. మరి కారణం ఏమైఉంటుంది?" అన్నది.

ఈ ప్రశ్నకు ఏం జవాబుచెప్పాలో తెలియక శైలేశ్వరుడు మౌనంగా వూరుకున్నాడు. విభ అంతటితో ఆగక, "ఇంట్లోనుంచి నౌకర్లూ చాకర్లూ—అంతావెళ్ళిపోయారు గదా, మరి ఇంటి పనులెలాసాగుతున్నాయి?" అని అడిగింది.

"పనులకేం, ఏదోవిధంగా సాగిపోతున్నాయి," అన్నాడు శైలేశ్వరుడు,

"అన్నయ్యా, వాళ్ళిక తిరిగిరారు, నాకు తెలుసు! కాని, ఒహటి ఇంటిని పురోహితుల కొంపలామారిస్తే లాభంలేదు. సంఘంలోని నలుగురితో పాటే మనమూనూ. ఎక్కడైనా ప్రయత్నంచేసి మళ్ళీ మంచి నౌకర్లను తెచ్చుకో!" అని సలహాయిచ్చింది, విభ.

"పనులు సక్రమంగా జరక్కపోతే అది ఎలానుతిప్పదు," అన్నాడు శైలేశ్వరుడు.

"అసలీ గొడవంతా రేపిందావిడే! అది నాపుట్టిల్లు: వెళ్ళక తప్పలే. తీరావెళ్ళింతరవాత కాస్త టీ అయినా దొరుకుతుందో లేదో," అన్నది విభ విసుగ్గా.

అన్నా చెల్లెళ్ళ సంభాషణలో తను కల్పించుకోవటం ఎందుకని యింతసేపూ నోరు మెదపకుండా వూరుకున్న క్షేత్రమోహనుడు, భార్య అన్న యీ మాటతో, చిరుకోపం తెచ్చుకొని, "ముందక్కడికి వెళ్ళిచూడు! అంత టీ దొరక్కపోతే అనవలసిన మాటలేవో అప్పుడే అందువుగాని," అన్నాడు.




"ఆ చూడవలసింది మొదటినాడే చూశాను. అమె తత్వం ఏమిటో ఆరోజే గ్రహించాను," అంటూ విభ ఏదోపనిమీద తనగదిలోకి పోయింది.

భార్య యిలాఅనేసరికి, క్షేత్రమోహనుడు కొంచెం ఆశ్చర్యపోతూ, "శైలేశ్ః ఈ వ్యవహారం అంతా ఏమిటి? నౌకర్లందర్నీ పంపేసి, ఏమన్నా బాబాజీవి అయిపో దలిచావా ఏం? మరి ఇంట్లో భోజనం ఏర్పాట్లవీ ఏలానడుస్తున్నై," అని అడిగాడు.

"ఆవిడ. .పప్పు, కూరలూ తయారుచేస్తున్నది. అవే తింటున్నాం," అన్నాడు శైలేశ్వరుడు.

క్షేత్రమోహనుడు నవ్వుతూ, "కేవలం పప్పూ, కూరా తిని నువ్వు సంతృప్తిచెందటం మాత్రం నాకేం బావులేదు. ఇదే ఏర్పాటు స్థిరంగా ఉంచదలచు కున్నావా?" అని అడిగాడు.

శైలేశ్వరుడు ఒక్కక్షణం వూరుకుని, "గృహనిర్వహణ బాధ్యత అంతా ఆవిడే తనకుతానై మీదవేసుకున్నది. అందులో నేనేం జోక్యం కలిగించుకో దలుచుకోలేదు," అన్నాడు.

క్షేత్రమోహనుడు, భార్యఉన్న గదికేసిచూసి, గొంతు తగ్గించి, "పెద్దగా అనకు. ఈ నీ నిర్ణయమేదో మీ చెల్లెలికి తెలియటం మంచిదికాదు," అన్నాడు.

"మంచిదో కాదో—ఈ ఏర్పాటువల్ల ఆదాయంకన్న ఖర్చు ఎక్కువవుతున్నదనే భయం ఉండదు. లోగడ రాత్రిం బగళ్ళు డబ్బు గురించే అలోచిస్తూండేవాణ్ణి, పది

హేనోలేదీ గడిచీ గడవకముందే జీతం అంతా ఖర్చయిపోతూ ఉండేది. తరువాత అక్కడా యిక్కడా చేబదుళ్లు. ఆవిడ చెప్పటం, యీ వచ్చేజీతంలోనే సుఖంగా బతక వచ్చని. ఆమాట నాకెంతో తృప్తికలిగిస్తున్నది,'' అన్నాడు శైలేశ్వరుడు.

''ఓహోఁ, అదా నీతృప్తి! డబ్బుకోసం అవస్థలు పడుతున్నది నువ్వొక్కడివే అనుకున్నావా? నేనూ అప్పులతో కంఠం వరకూ మునిగి ఉన్నానని, నీకు తెలియదా?'' అన్నాడు క్షేత్రమోహనుడు.

''మరి ఎలాగో యీ డబ్బుచిక్కుల్నుంచి బయట పడాలిగదా! నేను ప్రయాగవెళ్లే రోజున ఒకనెల జీతం బీరువాలో పెట్టిపోయాను. ఆ డబ్బుతో నెలంతా గడవాలని చెప్పి మరీవెళ్లాను. సోమేన్‌తల్లి బతికివుండగాగాని, ఆ తరవాతగాని ఆ మొత్తంతో నెల పాటు ఇల్లుగడవటం మాత్రం జరగలేదు. ముసల్మానూ, తక్కువ జాతివాడు అనీ అబ్దుల్‌నీ, గిరిధర్‌నీ పనినుంచి తొలిగించిందని విభ చెప్పే మాటల్లో ఉన్న నిజం ఎంతో నాకు తెలీదు. కాని ఒహటి, వాళ్ళ బకాయి జీతం డబ్బంతా యిచ్చేసింది. కిరాణా కొట్టుబాకీ కొంత తీర్చింది. ఆలెక్కంతా ఒక పుస్తకంలో వివరంగా రాసి పెట్టింది. ఇక భోజనం విషయంలో—అంతా మామూలుగానే జరిగిపోతున్నది. ఆవిడ తయారుచేస్తున్న మామూలు కూరలు అమృతంలా ఉన్నవంటే నమ్ము, క్షేత్ర మోహన్!'' అన్నాడు శైలేశ్వరుడు.

క్షేత్రమోహనుడు ఏదో అనబోయేంతలో, విభ గదిలోంచి బయిటికి వచ్చింది. ఆవిణ్ణిచూసి అతడు మాట్టాడకుండా వూరుకున్నాడు.

*　　　*　　　*

వాకిటిముందు కారాపి శైలేశ్వరుడూ, క్షేత్రమోహనుడూ, విభా, ఉమా ఇంట్లోకి అడుగు పెడుతూనే, చిన్నసుత్తె ఒకటి తీసుకుని తన బొమ్మరైలుబండి చక్రాన్ని రిపేరుచేస్తున్న సోమేంద్రుణ్ణి చూశారు. వాడి ఆకారంచూస్తూనే వాళ్ళందరూ ఆశ్చర్య చకితులై పోయారు.

కలకత్తాలోని గంగ ఒడ్డున ఒరియా ఘాటీలు కూర్చునిఉంటారు. వాళ్ళదగ్గిర అన్ని రకాలదేవుళ్ళపేర్లుగల ముద్రలుంటాయి. స్నానం చేయటానికి వచ్చినవాళ్ళ శరీరాల మీద అర్ధణో అణో తీసుకుని ముద్రలకు చందనంపూసి అద్దుతూ వుంటారు. సోమేంద్రుడి శరీరం మీద అలాంటి ఒరియా ఘాటియా ఒకడు పూరీ జగన్నాధస్వామి పేరు దగ్గిర్నుంచి సీతారాముల పేర్లవరకూ ముద్రలు వేసేశాడు.



విభ మేనల్లుణ్ణి యీ అవతారంలో చూస్తూనే, "భలేవేషం వేశావురా, నాయనా। చిరంజీవీభవ।" అన్నది.

బావమరదీ, చెల్లెలిముందు శైలేశ్వరుడు సిగ్గుతో నిశ్చేష్టుడై పోయాడో క్షణంపాటు. అతడు కొంచెం సాత్విక స్వభావం కలవాడవటంతో వేళాకోళాలను భరించలేడు.

చెల్లెలి వెటకారం విని అతడు కొడుకును ఒక్క చెంపదెబ్బవేసి, ''దౌర్భాగ్యుడా! ఇవన్నీ ఎక్కడ అద్దించుకువచ్చావ్?'' అన్నాడు కోపంగా,

పెద్దగా ఏడుస్తూ వెక్కుతూ వాడు చెప్పిందాన్ని బట్టి తేలిం దేమిటంటే—వాడు ఇవాళ పొద్దున్నే సవతి తల్లితో కలిసి గంగా స్నానానికి వెళ్ళాడుట! ఆ మాట వింటూనే శైలేశ్వరుడు వాణ్ణి మెడ పట్టుకుని తోస్తూ, ''ఫో! సబ్బు పెట్టి అవన్నీ కడిగేసుకురా!'' అన్నాడు.

తరవాత అందరూ శైలేశ్వరుడి రీడింగ్ రూమ్‌లోకి వెళ్లారు. క్షేత్రమోహనుడు చిరునవ్వు నవ్వుతూ, ''ఏం, శైలేశ్ మహాశయా! నువ్వు హఠాత్తుగా టీ కప్పులో తుఫాను లేపావే! కుర్రవాణ్ణి అలా కొట్టా వెందుకు?'' అన్నాడు.

విభ భర్త మాటలు విని కాస్త కోపం తెచ్చుకుని, ''టీ కప్పులో తుఫాను ఏమిటి? ఒంటిమీద ఆ ముద్రలన్నీ కుర్రాళ్ల ఆటకింద మీరు జమకట్టారా?'' అని అడిగింది.

''కాకపోవచ్చు. అయినా కుర్రాడు చేసిన ఆ పని అంత పెద్ద నేరమా?'' అన్నాడు క్షేత్ర మోహనుడు.

''పెద్ద నేరం కాకపోవచ్చు. కాని యిలాంటి అలవాట్లు దేనికి దారితీస్తయ్యో ఆలోచించారా?'' అన్నది విభ.

''దేనికీ దారితియ్యవు. కడిగేసుకుంటే అవే పోతవి.'' అన్నాడు క్షేత్రమోహనుడు.

''అంతేనా! ఒకవేళ మీ పిల్లవాడయితే అలా ఛండాలంగా ఒళ్ళంతా ముద్రలు వేయించుకోనిచ్చేవాళ్లా?'' అని అడిగింది విభ.

నా కసలు పిల్లలంటూనే లేనప్పుడు, ఈ ప్రశ్న అడగటంలో అర్థం ఏమీలేదు.'' అన్నాడు క్షేత్రమోహనుడు విసురుగా.

ఈ జవాబు విభ మనస్సును చాలా కలవరపరిచింది. ఆవిడ కాసేపు మౌనంగా వూరుకుని, ''కడిగేసుకుంటే పోతుంది, నిజమే! కాని పిల్లల భావిజీవితం గురించి ఆలోచించి మరీ ఏ పనైనా చెయ్యటం అవసరం. ఇలా అన్నందుకు మీ రంతా ఏమను కున్నా సరే!'' అన్నది.

''మీరంతా—అంటావెందుకు? ఈ జరిగిందానికి అభ్యంతరం చెప్పిన వాణ్ణి నే నొక్కణ్ణే. మీ అన్న కుర్రాణ్ణి ఒక్క చెంప దెబ్బ కొట్టి ప్రాయశ్చిత్తం చేసేశాడు .. కాని చిన్నప్పటినుంచీ ఆచారనిష్ఠల్లో పెరిగిన ఒక బ్రాహ్మణ యింటి బిడ్డ కాపరానికి వస్తూనే, దొరసానిగా అయిపోతుందని, నే నే నాడూ నమ్మను. ఏ మయినా, మీ అన్నా




చెల్లెళ్లు తీరిగ్గా కూర్చుని ఆ భావి జీవితం, పరిణామాల గురించి ఆలోచించుకోండి- నే నిప్పుడేవస్తా!'' అంటూ కుర్చీలోంచి లేచాడు క్షేత్రమోహనుడు.

ఇంతవరకూ మౌనంగా కూర్చున్న శైలేశ్వరుడు, ''ఎక్కడికి వెళ్తున్నావు?'' అని అడిగాడు బావమరిదిని.

''మేడపైకి వెళ్లి ఇంటి యజమానురాలితో హాస్త పరిచయం చేసుకువస్తాను. అస లావిడ నాతో మాట్లాడుతుందో లేదో చూడాలి,'' అంటూ క్షేత్రమోహనుడు గదిలోంచి బయిటికి నడిచాడు.

అతడు పై అంతస్థులోకి వెళ్లి, పడక గది గుమ్మందగ్గిర నిలబడి. ''అక్కగారూ! నమస్కారం!'' అని పెద్దగా పిలిచాడు.

గదిలో కూర్చుని ఏదో పని చేసుకుంటున్న ఉష ఆ పిలుపు వింటూనే, తల మీదికి కొంగు లాక్కుని, లేచి నిలబడింది. సోమేంద్రుడు ఆమె దగ్గిరే కూర్చుని ఉన్నాడు. వాడు తల ఎత్తి క్షేత్రమోహనుడి కేసి చూసి, సవతి తల్లితో, ''మామయ్య వచ్చాడమ్మా!'' అన్నది.

ఉష గదిలో ఉన్న ఓ కుర్చీ చూపిస్తూ, ''కూర్చోండి!'' అన్నది క్షేత్రమోహనుడితో.

గదిలో ఉన్న రెండు బీరువాలూ బార్లా తెరిచి ఉన్నాయి. అందులో నుంచి లాగి కింద పడవేసిన ధోవతులూ, చొక్కాలూ, కోట్లూ, పంట్లాములూ, టైలూ—గుట్టగా ఉన్నవి.

"వీటన్నిటినీ ఏం చేయబోతున్నారు?" అని అడిగాడు క్షేత్రమోహనుడు కుర్చీలో కూర్చుంటూ.

ఉష జవాబివ్వ బోయేంతలో, సోమేంద్రుడు గుట్టలోంచి ఒక జత మేజోళ్లు బైటికి లాగి, "ఇవి చిరుగులు పడ్డాయి, కొంచెం కుట్టి పెట్టమ్మా!" అన్నాడు.

ఉష మేజోళ్లు తీసుకుని, "అలాగే కుడతాన్లే, నాయనా!" అని వాటిని పక్కన పెట్టింది. తరవాత గుట్టలోంచి ఒక్కొక్క చొక్కానీ, ధోవతినీ బయిటికి లాగి వేరు వేరుగా పెట్టసాగింది. క్షేత్రమోహనుడు కొంచెంగా ఆశ్చర్యపోతూ, "వీటన్నిటినీ ఏదైనా అనాధ శరణాలయానికి పంపబోతున్నారా?" అని అడిగాడు

ఆ క్షణంవరకూ క్షేత్రమోహనుడికి, ఉషను గురించి వేరే ఒక అభిప్రాయం ఉన్నది. ఆవిడ పల్లెటూరి నుంచి వచ్చిన కొత్త కోడలుగనక, తనను చూడగానే సిగ్గుతో ఏ మూలకో జరిగి కూర్చుంటుందనుకున్నాడు. కాని, ఉష ప్రవర్తనలో అలాంటి ధోరణేమీ అతడికి కనిపించలేదు.

"వీటన్నిటినీ దర్జీ దగ్గిరికి పంపి, కొంచెం మరమ్మతు చేయించాలనుకుంటున్నాను. ఒక్క మేజోళ్ళే మరి పది సంవత్సరాలవరకూ కొననవసరంలేనన్ని ఉన్నాయి," అన్నది ఉష.

ఆ జవాబుకు క్షేత్రమోహనుడు తృప్తిగా తలాడించి, "అక్కగారూ! సమయాని కిక్కడ ఎవరూలేరు గనక, మీతో ఒక మాట చెప్పదలిచాను. మీ ఆడబిడ్డను చూసి ఆమె భర్త కూడా అలాంటి వాడేనని మాత్రం ఊహించకండి! నా వేష భాషలు చూసి క్రైస్తవుడనుకునేరు! ఇదంతా నా బాహ్యస్వరూపం తప్ప మరేంకాదు. నా అంతఃకరణ మాత్రం పూర్తిగా హిందూ అంతఃకరణం. గంగాస్నానం చేసి వచ్చిన వాణ్ణి కొట్టే తత్వంకాదు నాది," అన్నాడు.

ఉష మౌనంగా వూరుకున్నది. క్షేత్రమోహనుడు ఓ క్షణం ఆగి, ఇవాళ సోమేంద్రుడి ఒంటిమీద పడిన దెబ్బ—మీ మీదేపడినట్టు ఒకవేళ మీ రనుకుంటే, అది పొరబాటవుతుంది. వస్తుతః శైలేన్ అంత చెడ్డవాడు కాదు," అన్నాడు.

ఉష ముందు పడివున్న దుస్తులు సర్దిపెట్ట సాగింది. క్షేత్రమోహనుడు చిన్న గొంతుతో, "మీ నుంచి గృహనిర్వహణ పద్ధతులు నేర్చుకోవాలనుకుంటున్నాను." అన్నాడు.

ఉష నవ్వి, "ఇవన్నీ బీదవాళ్లు చేసుకునే పనులు. మీవంటివారికి వీటిని నేర్చుకోవలసిన అవసరం ఏనాడూ కలగదు," అన్నది.

క్షేత్రమోహనుడు దీర్ఘంగా నిట్టూర్చి, "అక్కగారూ! పై పటాటోపం చూసి మీరూ పొరబడకండి. నేను ఇక్కడికి మా చెల్లెల్ని వెంట బెట్టుకువచ్చాను. ఆమె నిక్కడ కొన్నాళ్ళపాటు ఉంచుదామనిపిస్తోంది మీ లాగా సంసారం దిద్దుకోవటం ఏ మాత్రం చాతనయినా, ఆమె అత్తవారింటికి వెళ్లాక భర్త జీవితాన్నీ తన జీవితాన్నీ కూడా సుఖప్రదం చేసుకోగలదు," అన్నాడు.

ఉష జవాబేమీ చెప్పలేదు. క్షేత్రమోహనుడు తిరిగి ఏదో మాట్లాడబోయేంతలో మెట్లదగ్గిర బూట్ల చప్పుడు వినిపించింది. అతడు అటుకేసి తల తిప్పి చూసి, "అందరూ పైకి వస్తున్నారులా ఉంది. అక్కగారూ! శైలేశ్వరుడి చెల్లెలి వేషభాషలూ, నా చెల్లెలి వేషభాషలూ చూసి—ఇద్దరి మనస్తత్వం ఒకటేనని మాత్రం అనుకోకండి," అన్నాడు.

# 4

శైలేశ్వరుడు, విభ, ఆమె ఆడబిడ్డ ఉమా మేడపైకి వచ్చారు. ముందుగా శైలేశ్వరుడూ, విభా గదిలోకి వచ్చారు వాళ్ళవెనకాలే వస్తున్న ఉమనుచూసి క్షేత్రమోహనుడు చెప్పులు బయటవిడిచి రమ్మని సౌంజ్ఞ చేశాడు. అది గమనించిన విభ భర్తకేసి తిరిగి, "చెప్పులు బైట విడిచేయాలా ఏం?" అని అడిగింది

"అలా చేసినందువల్ల వచ్చే నష్టం ఏమీలేదు గదా. అవి కాళ్ళకు లేకపోతే యిక్కడ ముళ్ళు గుచ్చుకుంటాయన్న బాధలేదు," అన్నాడు క్షేత్రమోహనుడు.

ఆ సంగతి నాకు తెలియంది కాదు. అవి బయటవదిలి రావలసిన అవసరం ఏం కలిగింది అని అడుగుతున్నాను!" అన్నది విభ.

"అక్కగారు ప్రాచీన ఆచారాలనూ, సాంప్రదాయాలనూ గౌరవిస్తారు. అంచేత ఆవిడ గారున్న గదిలోకి చెప్పులతో రావటం నాకు ఉచితంగా కనబడలేదు," అన్నాడు క్షేత్రమోహనుడు.

భర్త యిలా అనేసరికి విభకు ఎక్కడలేని కోపంవచ్చింది. "పూజనీయులూ, గురువులూ అయినవాళ్ళపట్ల మీకు భక్తి గౌరవాలుంటే నాకేం అభ్యంతరంలేదు. నిజంగా యిది దేవుడిగదే గనక అయితే, యింత గోమయాన్నిమింగి గదిలోకి అడుగుపెట్టి పవిత్రులం అయామనుకునే వారేమో!" అన్నదామె.

భార్య కోపంచూసి క్షేత్రమోహనుడు నవ్వి, "ఆ గోమయం, దేవుళ్ళ సంగతి అలావుంచు" అని ఉషతో, "అక్కగారూ! లోగడ యీ గదిలో ఒక కార్పెట్ పరిచి ఉండేది, దాన్నెందుకని తీసేశారు?" అని అడిగాడు.

"అదిఉంటే గది కడగటానికి వీలుండదు. పైగా దానికింద చాలా దుమ్ము చేరుతుంది," అన్నది ఉష.

విభ భర్త ముఖంలోని తీవ్రతచూసి ఏం మాట్లాడకుండా వూరుకున్నది. ఇవాళ క్షేత్రమోహనుడు భార్య ఎంత మొండిగా వాదించినా విని వూరుకునే స్థితిలో లేడు. ఏ అపరాధం చేయని ఉషమీద తన భార్య ఏదో పగపట్టినట్టుగా మాట్లాడటం అతడు సహించలేకుండా ఉన్నాడు. ఎంతో దుఃఖాన్ని అనుభవించి, అదృష్టంకొద్దీ యీనాడు ఉష భర్తయింట్లో రవంత స్థానం సంపాయించుకున్నది. ఆ స్థానంనుంచి ఆమెను తొలగించాలని చేసే ప్రయత్నంలో తనభార్య ఉన్నట్టు అతడికి గట్టి నమ్మకం ఏర్పడిపోయింది ఉష విషయమై శైలేశ్వరుడిలో కొంచెం మంచిమార్పు వచ్చేసరికి, విభ దాన్నిరూపు మాపటానికి ప్రయత్నిస్తున్నది భార్య కనబరిచే యీ సంకుచిత స్వభావం క్షేత్రమోహనుడికి ఎంతోబాధ కలిగించింది

క్షేత్రమోహనుడు తన చెల్లెలైన ఉమతో, "ఉమా! నువ్వు రోజూ కనీసం రెండు గంటల పాటైనా యీ పల్లెటూరి అక్కగారి దగ్గిరకు వచ్చి కూర్చున్నావంటే, నువ్వు వివాహమై ఎలాంటి ఇంట్లో కాలుపెట్టినా, ఏమాత్రం విచార పడవని నాకు నమ్మకం వుంది," అన్నాడు.

ఉమ చిరునవ్వు నవ్వి వూరుకున్నది. ఉష తలవంచుకుని, "ఈమె నా దగ్గిరకు వచ్చి కూచోటం మొదలెడితే, మీరు తిరిగే మనుషులమధ్య ఆమె కెలాంటి స్థానమూ ఉండదు," అన్నది,

"ఆ సంగతేమో కాని, ఆమెభర్త జీవితంమాత్రం సుఖంగా గడిచి పోతుంది. ఆ సంగతి నేను ఢంకామీద దెబ్బకొట్టి మరీ చెప్పగలను," అన్నాడు క్షేత్ర మోహనుడు.

శైలేశ్వరుడు వేళాకోళంగా, "ఢంకా కొట్ట నవసరంలేదు, నోటితో అంటే అంత పనీ నువ్వు చేసినట్టే!" అన్నాడు.

విభ ఉప్పొంగే కోపాన్ని అణుచుకుంటూ, "బహుశా ఆమె వెళ్ళే అత్తారింట మేజోళ్ళు అతుకులు వేసుకు తొడుక్కొనే అవసరం ఉండకపోవచ్చు. ఇవన్నీ ఉంఛ వృత్తితో బతుకులు వెళ్ళ మార్చేవాళ్లు చేసేపనులు," అన్నది




ఉష తలఎత్తి ఆమెకేసి చూస్తూ, "విభారాణీ! భర్త స్థితిగతులు తెలుసుకుని అందుకు అనుకూలమైన ఏర్పాట్లవీ చేయటం, ఉంఛవృత్తనా నీ అభిప్రాయం?" అని అడిగింది.

ఈ ప్రశ్నతో విభ ఉక్కిరి బిక్కిరైపోయి, భర్త ముఖంకేసీ, శైలేశ్వరుడి ముఖంకేసీ ఓమారుచూసి, ఏడ్పుగొంతుతో, "ఇక యిక్కడికి ఎనాడూ రాను, అన్నయ్యా! ఇదే నేను ఆఖరుసారిగా రావటం నీ ఇంటికి," అంటూ బయలుదేరింది.

చెల్లెలు యిలా అనగానే శైలేశ్వరుడు చాలా వ్యాకులపడ్డాడు ఉష కూడా మనస్సులో చాలా నొచ్చుకుంటూ లేచి నిలబడి, విభ చేయి పట్టుకుంటూ, "ఇక్కడ నిన్నెవరూ ఏమీ అనలేదు గదా, వదినా!" అన్నది.

ఈ లోపల క్షేత్రమోహనుడు గదిలోంచి బయిటికి వెళ్ళిపోయాడు. విభ చేయి గట్టిగా విదిలించుకుని, కళ్లు తుడుచుకుంటూ, "మీరు నాతో శత్రువులా ప్రవర్తించినప్పుడు, మరి యీ ఇంటికి రావటం ఏమాత్రం బావుండదు," అన్నది.

"ఈ మాత్రానికే మనసులో యింత బాధపడతావని నేననుకోలేదు, విభారాణీ!" అన్నది ఉష.

"మా చనిపోయిన వదినతోనే నాకు, యీ పుట్టింటి రుణంతీరి పోయింది!" అంటూ విభ గబ గబా మెట్లుదిగి కిందికి వెళ్ళిపోయింది. ఆమెకు వెనగ్గా శైలేశ్వరుడు కూడా కిందికిపోయి, చెల్లెలితో, "విభా! నా రీడింగ్ రూమ్‌లో కొంచెంసేపు కూర్చుందువు గాని పద," అన్నాడు



విభ కోపంగా తలాడించి, ''ఇక యిక్కడ కూర్చోను. కాని, నీకోమాట చెప్ప దలిచాను, అన్నయ్యా! పోయిన వదెన్ని మాత్రం పూర్తిగా మర్చిపోకు ఆమె సోమేంద్రుణ్ణి విదేశాలకు పంపించి చదివించాలని ఎంతగానో ఆశపడుతూండేది. వాణ్ణి తప్పకండా వృద్ధిలోకి తీసుకురా, విద్యావంతుణ్ణి చెయ్యి ఇవాళ ఇంట్లోకి వస్తూనే వాడి శరీరం నిండావున్న దేవుళ్ళ బొమ్మలూ అవీచూసి ఎంత బాధ పడ్డాననుకున్నావు. అలాంటి శిక్షణతో వాడు పెరగటం మొదలిడితే, నేను నలుగురిలో తలెత్తుకు తిరగ లేను,'' అన్నది.

శైలేశ్వరుడికి చెల్లెలిమిద ఎక్కడలేని జాలీ కలిగింది. అతడు బతిమాలు తున్నట్టు. ''రీడింగ్ రూంలోకి పచ్చి కాసేపు కూర్చో, చెల్లీ'' అన్నాడు.

విభ మరింతగా కన్నీళ్ళు పెట్టుకుని, "నే నిప్పు దెక్కడా కూర్చోలేను, అన్నయ్యా! ఒకటిమాత్రం మరవకు. నాన్నగారి వంశంపేరు నిలపవలసినవాడు, సోమేంద్రు డొక్కడే. వాడి విషయంలో కాస్త శ్రద్ధచూపు." అన్నది.

తరవాత ఆమె మౌనంగా వెళ్ళి కార్లో కూర్చున్నది. ఆమె మరదలు ఉమ కూడా వెళ్ళి వదినగారి పక్కనే కారెక్కింది. శైలేశ్వరుడు కారుదగ్గరకుపోయి, "విభా! సోమేంద్రుణ్ణి నివ్వు తీసుకుపోతే బావుంటుంది. నీకూ పిల్లలు లేరుగదా. వాణ్ణి నీ సొంత బిడ్డగానే, నీ ఇష్టం వచ్చిన పద్ధతుల్లో పెంచి పెద్దచేయటం బావుంటుంది," అన్నాడు.

ఆ మాటలకు విభా, ఉమాకూడా ఆశ్చర్యంగా అతడి ముఖంకేసి చూశారు. విభ అన్నతో,

"నువ్వసలీ ప్రస్తావన తేవలసిందిగాదు. వాణ్ణి నువ్వలా పంపలేవు. పంపమని నే నడగను కూడా," అన్నది.

"నే నెందుకు పంపించలేను?" అని ప్రశ్నించాడు శైలేశ్వరుడు.

"అలా అయితే పంపించు చూస్తాను. నీ దగ్గర డబ్బులేక వాణ్ణి పెద్ద చదువులు చదివించ లేకపోతే, ఆభారమంతా నేను తీసుకొని, ఎంత ఖర్చయినాసరే వాణ్ణి చదివిస్తాను," అన్నది విభ.

శైలేశ్వరుడు వెంటనే ఏమీ జవాబు చెప్పలేక పోయాడు. కారు బయలుదేరబోయే ముందు విభ తలఎత్తి మేడకేసి చూసింది. పైనవున్న వరండాలో నిలబడి ఉష వాళ్ళ కేసే చూస్తున్నది. ఆమె అన్నా చెల్లెళ్ళ సంభాషణఅంతా విన్నది. శైలేశ్వరుడు తల వంచుకుని ఇంట్లోకిపోయి తన రీడింగ్ రూమ్‌లో కూర్చున్నాడు. అతడికి మేడమీదికి వెళ్ళ బుద్ధికాలేదు. ఒక రకంగా అతడి కాసమయంలో అక్కడికి వెళ్ళేసాహసం లేక పోయింది.

ఆ రాత్రి ఉష భర్తకు భోజనం వడ్డించి, రోజూ మామూలుగా కూర్చునట్టే అతడికి కొంచెం ఎడంలో కూర్చున్నది. ఆమె పక్కన యీ రాత్రి సోమేంద్రుడు మాత్రం లేడు. బహుశా వాడు గదిలో నిద్రపోతూండవచ్చు. శైలేశ్వరుడు మౌనంగా కూర్చుని భోజనం చేయసాగాడు. ఇవాళ జరిగిపోయిన గొడవల్లో తనకు తెలియని వాటి గురించి ఉష భర్తను అడగలేదు, ఏ మాత్రం కుతూహలాన్ని కనబరచలేదు. ఈ కొద్ది రోజుల్లో అతడికి తన భార్య స్వభావంలో యీ భాగం మాత్రం బాగా అర్థమైంది.

ఏదో ఆలోచిస్తూ భోజనం చేస్తున్న శైలేశ్వరుడు క్రమంగా తనలో తాను కోపం పెంచుకో సాగాడు. అతడు వుండుండి భార్య ముఖలక్షణాలెలా ఉన్నాయో పరీక్షించా లని చూశాడు. కాని, ఆమె కావాలనే దీపానికి కొంచెం చాటుగా కూర్చున్నది. అతడి కివాళ భోజనం సహించటం లేదు. అతడు హఠాత్తుగా భార్యకేసి తలతిప్పి, "మనిషి ఎలాంటితిండీ, బట్టా కట్టడానికి అలవాటు పడతాడో—దానికి భిన్నంగా అతడికి మరొక తిండీ, వస్త్రధారణా అలవాటుచేస్తే, నాలుగైదు రోజులకన్న ఎక్కువ భరించలేడు అది అత్యాచారంగా కూడా తయారవుతుంది," అన్నాడు

ఈ మాటల్లో వాదానికి పనికివచ్చే అంశాలుతప్ప, వాస్తవం మాత్రం లేదు. ఈ సంగతి ఉషకుతెలుసు ఆమె మెదలకుండా వూరుకున్నది. శైలేశ్వరుడు భోజనం ముగించి పడకగదిలోకివచ్చి, భార్యతో, "ఒకప్పుడు మేం నీకు చాలా అన్యాయం చేశాం ఆకారణంగా యిప్పుడు నువ్వు యీ ఇంటి నిర్వహణలో నీకుతప్ప మరెవరికీ ఎలాంటి అధికారం లేదని ప్రవర్తిస్తే—అది నువ్వుచేసే అన్యాయం అవుతుంది," అన్నాడు.

భర్త యింత కఠినంగా మాట్లాడేసరికి ఉష చాలా విస్మయించెంది, "ఈ సంగతి నేను తెలుసుకోలేక పోయాను," అన్నది.

"నువ్వు తెలుసుకుని వుండవలసింది. ఇక్కడ మా అలవాట్లూ, జీవిత విధానం అంతా ఒక్కసారిగా మార్చేసి, యీ ఇంటిని మీ తండ్రిగారి ఇల్లులా మార్చేయాలని చూస్తే మాత్రం—శిష్టసమాజంలో తిరిగే మాకు చాలా బాధగావుంటుంది సోమేంద్రుణ్ణి బహుశా రేపు వాళ్ళ మేనత్త ఇంటికి పంపేయవలసిరావచ్చు. దీన్ని గురించి నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు శైలేశ్వరుడు.

"వాణ్ణి అక్కడికి పంపటం, వాడి అభివృద్ధికి తోడ్పడుతుందని తోస్తే—అలాపంపటమే బావుంటుంది," అన్నది ఉష.

"బావుండటం కాదు—అందరూ అలాచేయమనే అంటున్నారు ఈ ఆచారాల మధ్యా, ఛాందసాల మధ్యా అన్నా చెల్లెళ్ళకు అభిప్రాయ భేదాలువస్తే, నలుగురూ నవ్వుతారు," అన్నాడు శైలేశ్వరుడు.

ఇందులో తననేరం ఏమీ లేదని చెప్పేందుకు ఉష ప్రయత్నించలేదు. ఆమె ఒక్క నిట్టూర్పు మాత్రం విడిచింది. జరిగిన గొడవ ఏమైనాఉంటే, అది క్షేత్ర మోహనుడి మధ్యా, అతడి భార్య విభ మధ్యా జరిగింది. అందుకు తన బాధ్యత ఏమీ లేదు, అను కున్నది ఉష.




శైలేశ్వరుడు కాసేపు వూరుకుని, "విదేశాలకు పంపి చదివించ వలసిన సోమేంద్రుణ్ణి, అలాంటి ఆంగ్లేయ వాతావరణం, వేష భాషలూ అలవడిన వారి మధ్య పెంచటం చాలా అవసరం. ఛాందసాచారాలు యీ వయసులో వాడి హృదయంలో ప్రవేశపెట్టటం వాడిపట్ల చాలా అన్యాయం అవుతుంది" అన్నాడు.

ఉషనుంచి ఎలాంటి జవాబూ రాకపోయే సరికి తిరిగి శైలేశ్వరుడు, "ఈ విషయంలో నువ్వు చెప్పవలసిందేమీ లేకపోతే చిక్కేలేదు. కాని, వూరికే నిట్టూర్పులు విడవటం మాత్రం సమాధానం కాదు," అన్నాడు.

"ఇందాకనే చెప్పాగదా—వాడి శ్రేయస్సుకోరే నిశ్చయించేసి ఉంటారు। మంచిది, అలాగే చెయ్యండి," అన్నది ఉష.

శైలేశ్వరుడు ఎలక్ట్రిక్ లైటు ఆర్పివేసి తన మంచం మీదికి వెళ్ళిపడుకున్నాడు. ఉష దాపులోనున్న మరో మంచంమీద పడుకున్నది. సోమేంద్రుడు ఆమె కానుకుని పడుకుని కునుకు తీస్తున్నాడు. గదిలో ఒక మూలగా చిన్న దీపం వెలుగు తున్నది. శైలేశ్వరుడు ఆ గుడ్డి కాంతిలో భార్య ముఖలక్షణాలు పరికించిచూస్తూ, "విభ, సోమేంద్రుడి చదువుకయ్యే ఖర్చంతా తానే భరిస్తానంటున్నది అది సామాన్యమైన సహాయమా!" అన్నాడు.

తన కంఠస్వరంలో ఎలాంటి పరిస్థితుల్లోనూ కటుత్వాన్నీ, ఉత్తేజాన్నీ కనపరచక పోవటం ఉష స్వభావం. ఆమె దేనికైనా శాంతస్వరంతోనే జవాబిస్తుంది. "ఆమె

తన ఖర్చుమీద మన పిల్లవాణ్ణిపెంచి చదువు చెప్పించే షరతుమీద, సోమేన్‌ను అక్కడికి పంపటం నాకేం యిష్టంలేదు,'' అన్నదామె.

''మరి వాణ్ణి విదేశాలకు పంపి చదువు చెప్పించాలంటే చాలా ఖర్చవుతుంది,'' అన్నాడు శైలేశ్వరుడు.

''అంత అవసరం అయినప్పుడు డబ్బు సహాయం చెయ్యడం—అది వేరే సంగతి. .చాలా పొద్దు పోయింది. ఇక నిద్రపొండి,'' అన్నది ఉష.

రెండోనాడు శైలేశ్వరుడు చీకటి పడటానికి కొంచెం ముందుగానే క్లబ్బుకుపోయి ఇంటికి తిరిగివస్తూనే, వంట ఇల్లోంచి బాగా పరిచితమైన మషాలా వాసన రావటం అతడు గమనించాడు. అది అతణ్ణి విస్మితుణ్ణి చేయటమేగాక, ఆనంద పరిచింది కూడా.

శైలేశ్వరుడు రీడింగ్ రూములోకి వెళ్ళి కూర్చున్నాడు. కొంచెం సేపు తరువాత పలహారం, టీ తీసుకుని నౌకరు అక్కడికి వచ్చాడు. అతడి ముఖం చూస్తూనే, వాడు ముసల్మానని శైలేశ్వరుడు గ్రహించాడు.

రాత్రి భోజనం వేళకు శైలేశ్వరుడు ఆ గదిలోకి వెళ్ళిచూస్తే, అక్కడ టేబిల్ అవీ అమర్చిఉన్నాయి. ఈ పద్ధతి అతణ్ణి చాలా సంతోషపర్చింది. ఆ టేబిల్ మీద విదేశ పద్ధతిలో భోజనం ఏర్పాటు చేయబడిఉంది. శైలేశ్వరుడు అక్కడ కూర్చుని తినటం ప్రారంభించగానే, ఉష వచ్చి కొంచెం ఎడంగాఉన్న కుర్చీలో కూర్చున్నది.

లేశ్వరుడు భార్యను పరిహాసంచేస్తున్న ధోరణిలో, ''ఇక్కడికి రావటం వల్ల నీ కులం భ్రష్టయిపోతుందన్న భయంలేదా? ముక్కుతో వాసనచూడటం సగం భోజనం కింద లెక్క అని శాస్త్రకారులంటారు!'' అన్నాడు.

ఉష చిన్నగా నవ్వి, ''ఈ వాఖ్యానం మీరు చేయదగిందికాదు. శాస్త్రాలంటే నమ్మకం, గౌరవం లేనప్పుడు వాటి ప్రసక్తి ఎందుకు?'' అన్నది.

శైలేశ్వరుడు పెద్దగా నవ్వుతూ, ''నేను ఓడానని ఒప్పుకుంటాను. నేను నిన్న నిన్ను కొంచెం ఎత్తిపొడుపు మాటలన్నాను. బహుశా, అందువల్లే యివాళ నాకీ మంచి భోజనం దొరికి ఉంటుంది. కాని .ఇలాంటి భోజనానికి నువ్వు మరి కొంచెం డబ్బు ఎక్కువ ఖర్చుచెయ్య వలసి ఉంటుందిగదా?'' అన్నాడు.

''దుబారా లేకుండా చూసుకుంటే, యిలాంటి వాటికి మరేం ఎక్కువ ఖర్చుకాదు. వచ్చేనెలనుంచి నేనే స్వయంగా యీ వంట పనులు చూద్దామను కుంటున్నాను. ఇంటి




కయే ఖర్చులు అంచనావేసి చూశాను. ఆ మొత్తంలోనే పని జరిగేట్టు చూడాలి, కాని అది సాధ్యమవుతుందా అన్నదే సమస్య," అన్నది ఉష.

"ఎందుక్కాదు?" అని అడిగాడు శైలేశ్వరుడు.

ఉష వెంటనే జవాబు చెప్పక, కొంచెం సేపు ఆలోచిస్తూ వూరుకుని, "నిన్న రాత్రంతా ఆలోచించి, భోజన విషయంలో ఒక పద్ధతి ఏర్పాట్లకు నిర్ణయం చేసుకున్నాను. వాటిని మార్చమని మాత్రం మీరు అనకండి," అన్నది.

ఆ జవాబు వింటూనే శైలేశ్వరుడి హృదయం ఎంతో మార్దవమై పోయింది. "నీ నిర్ణయాలను మార్చాలనే ప్రయత్నం చేయను, ఉషా! నేను .దుర్బల స్వభావుణ్ణి. నీ మనస్సు యెంత నిర్మలమైందో, అంత దృఢమైంది," అన్నాడతను.

"బాగా ఆలోచించి చూశాను. మరో విధంగా చెయ్యటం బావుండదు," అన్నది ఉష. ఈ మాట ఏ సందర్భం గురించో అర్థం చేసుకోవటానికి శైలేశ్వరుడుకి ఒకటి రెండు నిమిషాలు పట్టింది. ఆమె అన్న యీ మాటలు సోమేంద్రుణ్ణి విభ ఇంటికి పంప టానికి సంబంధించినవి అను కున్నాడు. నీ ఉద్దేశమేమిటో "నాకు కొంచెం సూచన ప్రాయంగా మాత్రం తెలిసింది. కుర్రాణ్ణి గురించి నీ తుదినిర్ణయం ఏమిటో చెప్పు. ఆ నిర్ణయం మార్చే ప్రయత్నం మాత్రం నేను చెయ్యను," అన్నాడతను.

ఉష ఒక్క నిమిషకాలం మౌనంగా వూరుకుని, "సోమేన్ గురించికాదు....నాకు అన్నయ్య దగ్గరే ఎలాగోలా కాలం గడిచిపోతుంది. రేపు బయలుదేరి అన్నయ్య దగ్గిరకే వెళ్ళిపోతాను,'' అన్నది.

''మీ అన్నగారి దగ్గిరకు వెళతావా? తిరిగిరావటం ఎప్పుడు?'' అని అడిగాడు శైలేశ్వరుడు ఆశ్చర్యపోతూ.

''క్షమించండి నన్ను. నేనిక తిరిగిరాను. బాగా ఆలోచించే యీ నిర్ణయానికి వచ్చాను. ఇక్కడ నాకేం సాగదు,'' అన్నది ఉష.

ఉష మాటలు విని శైలేశ్వరుడు నిశ్చేష్టుడైపోయాడు. భార్య పట్టుదల ఎలాంటిదో, యీ కొద్దిరోజుల్లోనే అతడి అనుభవంలోకి వచ్చింది. 'ఇనప కవాటాలు మూసివేయబడ్డాయి. వాటిని తెరిచేశక్తి నాక్కాదు గదా, ప్రపంచంలో మరెవరికీకూడా లేదు,' అనుకో సాగాడతడు మనస్సులో.

# 5

ఉదయం నిద్రలేస్తూనే శైలేశ్వరుడు రాత్రి తాను భయంకర స్వప్నాల్లో మునిగి తేలినట్టు అనుకున్నాడు. అతడు కిటికీలోంచి బయిటికి చూచాడు. ఉష మామూలుగానే గృహకృత్యాలు చూసుకుంటున్నది. సోమేంద్రుడు ఆమె చెంగుపట్టుకుని తిరుగుతున్నాడు. బహుశావాడు తినటానికి కేమైనా పెట్టమని ఆమె నడుగుతున్నాడేమో!

శైలేశ్వరుడు మేడ మెట్లుదిగి కిందికి వస్తూండగా, ఉష అతడికి ఎదురుపడి, "అతను మీకోసం టీ తయారుచేశాడు. మీరు ముఖం కడుక్కోవటం ఆలశ్యం అయితే, అది కాస్తా చల్లారిపోతుంది,'' అని చెప్పింది.

''ఎంతసేపు. నే నిప్పుడే వచ్చేస్తాను,'' అంటూ శైలేశ్వరుడు గబగబా బాత్ రూంకేసి వెళ్ళాడు. అతడికా క్షణంలో తానొక మూర్ఖుణ్ణన్న అభిప్రాయం కలిగింది. భార్యా భర్తల మధ్య అప్పు డప్పుడూ అభిప్రాయ భేదాలు రావటమనేది సహజం. కాని, తానా స్వల్పానికి యుద్ధప్రకటనచేసి, భీష్మించుకున్నాడు .

అయినా స్వల్పవిషయాలతో భార్య భర్తమీద అలిగి అన్నగారి ఆశ్రయంలో ఉండటం మంచిదనే నిర్ణయానికి వస్తే మాత్రం—ఇక యీ లోకంలో మానవులే నశించిపోతారు! సోమేంద్రుడి తల్లి దారివేరు. ఆమె ఏ నాడైనా పుట్టింటికి వెళితే, అక్కడ పదీ పదిహేను రోజులకన్న ఎక్కువ ఉండేదికాదు. కాని, ఉషలాంటిస్త్రీ—చిన్నతనం నుంచీ హిందూ సాంప్రదాయాల్లో పెరిగి నావిడ—స్త్రీ ధర్మాన్నీ, భర్తనూ



కూడా త్యజించి, ఒక్క చిన్నమాట పట్టింపుకు, అబ్బిన సంస్కారాన్నంతా మంట గలిపి పుట్టింటికిపోతే, ఇక దాంపత్య జీవితానికీ, ధర్మానికీ యీ లోకంలో స్థానం ఎక్కడుంటుంది?

శైలేశ్వరుడు మనస్సులో రకరకాలగా మధనపడుతూ గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. కొత్తగా పనిలోకి వచ్చిన ముసల్మాన్ నౌకరు టీ, రొట్టె, వెన్న, కేక్ ప్లేట్లలో తీసుకువచ్చి అతడిముందు పెట్టాడు. ఈ మధ్య అతడికి ఉదయాన యిలాంటి పదార్థాలు తినే అలవాటు తప్పింది. పైగా రోజూ తను టిఫిన్ చేసేప్పుడు భార్య పక్కన ఉండి అవీ యివీ అందిస్తూండేది. ఇవాళ ఉష రాలేదు. అతడికి టిఫిన్ తిన బుద్ధికాక, కెటిల్‌లోనుంచి టీ కాస్త కప్పులోపోసుకునితాగి, తతిమ్మా వాటిని ఎత్తుకు పొమ్మని నౌకరుకు చెప్పాడు.

తరవాత అతడు గబగబా డ్రెస్ వేసుకుని కాలేజీకి వెళ్ళిపోయాడు. ఆ సాయంత్రం కాలేజీలో పనయిపోగానే సరాసరి ఇంటికిరాక, తన చెల్లెలు విభ యింటికి వెళ్ళాడు. ఆ రోజున ఆమె భర్త కోర్టుకుపోలేదు. భార్యా భర్త లిద్దరూ ఆ మధ్య శైలేశ్వరుడి ఇంట జరిగిన కయ్యాన్ని మర్చిపోయినవాళ్ళలా, ఎంతో అన్యోన్యంగా మాట్లాడు కొంటున్నారు.

శైలేశ్వరుడు తన చెల్లెల్ని చూస్తూనే, "విభా! సోమేంద్రుణ్ణి పిల్చుకువచ్చేందుకు నువ్వు మనిషిని పంపలేదా?" అని అడిగాడు.

విభ ఏదో చెప్పబోయేంతలో క్షేత్రమోహనుడు అందుకుని, "ఏనుగును ఇంటికి తెచ్చుకొందామనుకునే వాళ్ళు లేరిప్పుడు," అన్నాడు.

"దానర్థమేమిటి?" అని అడిగాడు శైలేశ్వరుడు!

"నువ్వీ కథవినలేదా? ఒక తాగుబోతు ఆమైకంలో రాజుగారి ఏనుగును కొనబోతున్నానని నలుగురికీ చెప్పసాగాడు. మర్నాడు వాణ్ణి పట్టుకుని రాజుగారి ఆస్థానానికి తీసుకుపోయి, "ఏవిటీ అహం, హద్దుమీరిన వాగుడూ!" అని అడిగారు. దానికివాడు చేతులుజోడించి, "మహాప్రభో! ఆ ఏనుగు కొనాలనుకున్న వాడిప్పుడు లేడు నాలో!" అన్నాడు. అదీ కథ, అన్నాడు క్షేత్రమోహనుడు.

తరవాత అతడు బిగ్గరగా కొంచెం సేపునవ్వి, శైలేశ్వరుడితో, "శైలేశ్! ఈ కథ అక్కగారికి—ఆమెకు కోపం రాని ధోరణిలో చెప్పాలి. తల్లిని విడిచిపెట్టి మేనత్త దగ్గిరకు రావటం వల్ల, సోమేంద్రుడు నిజంగా ఉన్నత స్థితికి చేరుకోవటానికి అవకాశం ఉంటే—అప్పో సొప్పోచేసి మీ చెల్లెలికి తప్పక సహాయంచేసి ఉండేవాణ్ణి" అన్నాడు.

శైలేశ్వరుడు తన బావమరిది అంతగా నవ్వుతున్నా తను మాత్రం పెదామీదల చిరునవ్వయినా కనబరచకుండా మౌనంగా కూర్చున్నాడు. క్షేత్రమోహనుడు అతడికేసి ఓ సారి పరీక్షగా చూసి, "అలావున్నావేమిటి? ఏవిటీ సంగతి?" అని అడిగాడు.

"విభ సోమేంద్రుణ్ణి గురించి యిచ్చిన సలహాతో నాకు అన్ని సమస్యలూ తీరినట్టనిపించింది. కాని, ఆ ఏర్పాటు సాగనప్పుడు నేను మరేదైనా ఆలోచించి చేయాలి," అన్నాడు శైలేశ్వరుడు.

"నీ ధోరణి చూస్తూంటే కుర్రవాడు ఏదో భూతంచేతిలో పడ్డట్టు భయపడుతున్నావని పిస్తున్నది," అన్నాడు క్షేత్రమోహనుడు.




ఇది చాలా కటువైన మాటగా కనిపించినా శైలేశ్వరు డేమీ పట్టించుకోక, ''ఉష త్వరలో యిక్కణ్ణించి వెళ్ళిపోతున్నది,'' అన్నాడు.

''అంటే వచ్చినచోటుకే అన్నమాట—వాళ్ళ అన్నయ్య దగ్గిరికి,'' అన్నాడు క్షేత్రమోహనుడు.

ఆమాట లంటున్నప్పుడు అతడి ముఖం చాలా గంభీరత్వాన్ని సంతరించుకున్నది. అతడు ఓసారి తలతిప్పి భార్యకేసి చూసి, ''నాకు ..యీ విషయంలో మొదటినుంచీ అనుమానంగానే ఉంటున్నది, శైలేశ్!'' అన్నాడు.

ఇంతవరకూ బావా బావమరుదుల సంభాషణ వింటూ తల వంచుకు కూర్చున్న విభ తలఎత్తి అన్నకేసి చూస్తూ, ''నావల్లనే యీ యిక్కట్టు వచ్చిందని నువు భావించటం లేదు గదా, అన్నయ్యా? ఒకవేళ నీ వుద్దేశం అదే అయితే నేనేమీ అడ్డురాను. కాని, ఏదో ఒకనాడు. . .మీ యిద్దరూ బాధ పడవలసి వస్తుందని మాత్రం నేను చెప్పగలను,'' అన్నది.

శైలేశ్వరుడు తలాడించాడు, అది సరికాదన్నట్టు. ఆ తరవాత కొత్తగా వచ్చిన ముసల్మాను నౌకరు సంగతీ, ఉషా తానూ కుర్రవాణ్ణి గురించి అనుకున్న మాటలూ-- అంతా విభకూ, క్షేత్రమోహనుడికీ చెప్పాడు.

వాళ్ళిద్దరూ మౌనంగా వూరుకున్నారు. శైలేశ్వరుడు కొంచెం ఆగి, "నేను ఆమెను వెళ్ళిపొమ్మని అనలేదు, ఒకవేళ వెళ్ళ దలుచుకుని వెళితే, నే నేమీ దిగులు పడను, అభ్యంతరం కూడా చెప్పను. పోతే, యీ సంఘటనవల్ల నా మిత్ర బృందంలో నన్ను గురించి రక రకాల పుకార్లు బయలుదేరే ప్రమాదం మాత్రం వుంది. అయినా ఒక భ్రాంతి మాత్రం నాలోనుంచి అంతర్ధాన మయింది. అందుకు నేను భగవంతుడికి ధన్యవాదా లర్పించక తప్పదు," అన్నాడు.

క్షేత్రమోహనుడు ఓ క్షణకాలం తల వంచుకు వూరుకుని, "సరే, శైలేశ్! యీ సంగతి చెప్పు! భవానీపూర్ భూపేంద్ర బెనర్జీబాబు కుమార్తె విషయమై జరిగిన సంప్రతింపులు ఏ దశలో ఉన్నట్టు? వారి కేమైనా వర్తమానం పంపావా?" అని అడిగాడు.

"నీ ప్రశ్న చాలా అనాగరికంగా ఉంది అయినా నేనేం రెచ్చిపోయి మిమ్మల్నేమీ అనబోవటంలేదు. మీ ప్రశ్నా . అందులో సూచనప్రాయంగా వున్న సంగతీ నన్నెంతగా గాయపరుస్తుందో నీకు తెలియదు గనక—దీన్ని యింతటితో మర్చి పోతాను," అన్నాదు శైలేశ్వరుడు.

క్షేత్రమోహనుడు నవ్వి, "ఉన్న మాటన్నావ్, శైలేశ్! ఇలాంటి విషయాల్లో నాకేమంత పరిజ్ఞానం లేదనుకో. అలాంటి జ్ఞానాన్ని సంపాదించే వయసుకూడా దాటి పోయింది. ఇలాంటి విషయంమీద నువ్వో గ్రంథం రాస్తే, లోకాన్ని ఉద్ధరించిన వాడివవుతావ్. సరే, అన్నా చెల్లెలూ ఏకాంతంగా సంప్రతించుకోండి, నేనిప్పుడే వస్తా," అంటూ కుర్చీలోంచి లేచి ద్వారంకేసి కదిలాడు.

శైలేశ్వరుడు బిగ్గరగా, "గ్రంథం రాయటం ఆలశ్యం కావొచ్చు కనక, యీ లోపల నువ్వు నోటిమాటగా ప్రచారం ప్రారంభించు, నువ్వన్నావు గనక ఆ భవానీపూర్ వాళ్ళ విషయం ఏమిటో కొంచెం తెలుసుకునే ప్రయత్నం చేస్తాను," అన్నాడు.

ఆ సరికి ద్వారందాటిన క్షేత్రమోహనుడు ఆగి, "తప్పకుండా తెలుసుకో. ఇప్పటికే చాలా ఆలశ్యం అయిపోయింది!" అని గబ గబా ముందుకు నడిచాడు.

మరసటిరోజు ఉదయం అతడు శైలేశ్వరుడి ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో శైలేశ్వరుడు స్నానంచేయటానికి పోతున్నాడు. నిన్న అంత వాదప్రతివాదాలు జరిగిం తరవాత బావమరిది యింతత్వరలో తన ఇంటికి రావటం శైలేశ్వరుడికి కొంచెం




ఆశ్చర్య కారణమైంది. అతడు జరిగిం దానికి సిగ్గుపడుతూ, ''ఏం, యివాళ హైకోర్ట్ మూసేశారా?'' అని అడిగాడు.

''అది అర్థం లేని ప్రశ్న,'' అన్నాడు క్షేత్రమోహనుడు.

''అంటే, అసలు ప్రాక్టీసు వదిలేశావా ఏం?'' అని అడిగాడు శైలేశ్వరుడు.

''ఈ ప్రశ్న మరీ అర్ధంలేనిది!''

''అయితే, నేనూ నిరర్థకమే నేమో! నాకు స్నానం చేసేవేళయింది. కొంచెం ఒంటరిగా కూర్చోవటంలో బాధ ఏమీలేదు కదా,'' అన్నాడు శైలేశ్వరుడు.

''సరే, స్నానంచేసిరా!'' అని క్షేత్రమోహనుడు కుర్చీలోంచి లేచి మెట్లదగ్గిరకు పోయి, ''అక్కగారూ! నేను రావచ్చా?'' అని కేక వేశాడు.

ఇంట్లో ఎక్కడా పూజాగృహం అంటూ లేదు. ఆ కారణంవల్ల ఉష పడక గదిలోనే ఒక మూలగా పీటవేసుకుని, పూజకు ఏర్పాట్లు చేసుకుంటున్నది. ఆమె, అతడి కంఠస్వరం గుర్తుపట్టి, తడిసివున్న తలమీదికి చెంగులాక్కుని, ''రావచ్చు, రండి!'' అన్నది.

క్షేత్రమోహనుడు గదిలోకివెళ్ళి, అక్కడ పూజకు జరుగుతున్న ఏర్పాట్లుచూసి, ''పూజా సమయంలో రావటం నాది పెద్ద పొరపాటే, అక్కగారూ! మీరు యింత హఠాత్తుగా పుట్టింటికి ఎందుకు పోవాలను కుంటున్నారు? మీ నాన్నగారి ఆరోగ్యం బావోలేదా?'' అని అడిగాడు.

''నాన్నగారు స్వర్గస్థులై చాలా కాలమైందిః'' అన్నది ఉష.

"తల్లిగారి ఆరోగ్యం ఏమైనా బావులేదాః''

"ఆమె నాన్నగారి కన్నాముందే తనువు చాలించింది,'' అన్నది ఉష.

క్షేత్రమోహనుడు ఎంతో విస్మితుడై "అయితే యిప్పుడు మీ రెక్కడికి వెళ్ళి పోతున్నారుః తల్లీ దండ్రీ లేనప్పుడు వివాహిత అయిన స్త్రీ పోదగినచోటు మరేం ఉన్నదిః శైలేశ్వరుడి సంగతి వదలండి, మేం మాత్రం మీరు వెళ్ళటానికి ఒప్పుకోం,'' అన్నాడు.

ఉష చిన్నగా నవ్వి, "మీరు ఒప్పుకోరాః'' అన్నది.

''ఊహుఁ!''

''నాకు యిన్నాళ్లూ మా అన్నగారి ఇంటనే గడిచినై. మిగిలిన రోజులు అక్కడ గడవవన్న భయం నాకేం లేదు,'' అన్నది ఉష.

''మీ రంత గట్టిగా వెళ్ళదలుచుకుంటే వెళ్ళండి. కాని, ఎప్పుడు తిరిగి వచ్చేదీ మాత్రం మాకు చెప్పండి,'' అన్నాడు క్షేత్రమోహనుడు.

ఉష మాట్లాడలేదు. కొంచెం ఆగి క్షేత్రమోహనుడు, ''అయితే, సోమేంద్రుణ్ణి ఎవరు చూస్తారుః'' అని అడిగాడు.

''వాడి మేనత్త.''

క్షేత్రబాబు చేతులు జోడించి, ''ఆవిడ నా భార్య, ఆవిడతరఫున మిమ్మల్ని నేను క్షమాపణ కోరుతున్నాను.'' అన్నాడు. ఉష మౌనంగా వూరుకున్నది.

''సరే, మీ ప్రయాణం ఎప్పుడుః'' అని అడిగాడు క్షేత్రమోహనుడు.

"అన్నయ్య ఎప్పుడు తీసుకుపోవటానికి వస్తే అప్పుడు. బహుశా ఆయన రేపే రావచ్చు.'' అన్నది ఉష.

క్షేత్రమోహనుడు కొంచెంసేపు వూరుకుని, ''అక్కగారూ! నేను మీకు యిన్నాళ్లుగా చెప్పకూడదని దాచిన రహస్యం ఒకటి ఉన్నది. మీ రిక్కడికి రావటానికి కొంచెం ముందుగా, ఈ ఇంటికి మరొక గృహిణిని తీసుకురావాలనే కుట్రజరిగింది. అది ఇంకా నమసి పోలేదన్న అనుమానం నాకున్నది,'' అన్నాడు.

''ఆ విషయమంతా నాకు తెలుసు,'' అన్నది ఉష.

''అలాంటప్పుడు, మీరు కోపం తెచ్చుకుని తిరిగి పుట్టింటికి వెళ్ళిపోవటం ద్వారా, ఆ కుట్రకు సహాయపడదలిచారాః'' అన్నాడు క్షేత్రమోహనుడు.




అతడు మాట ముగించేలోపలే ఉష ఎంతో శాంత స్వరంతో, "కుట్ర అంటున్నారే—అది సఫలం అయినా, విఫలం అయినా ఒకటే, నన్నుమాత్రం మీరు క్షమించండి!" అంటూ చేతులు జోడించింది.

క్షేత్రమోహనుడు ఆమె కేసిచూస్తూ ఓ క్షణకాలం నిశ్చేష్టుడై పోయాడు. తరవాత అతడు మౌనంగా మెట్లుదిగి, రీడింగ్ రూమ్‌లోకి వెళ్ళి కూర్చున్నాడు. ఒక అరగంట కాలం గడిచింది. అతడు స్నానం చేయటానికి వెళ్లిన శైలేశ్వరుడికోసం మరి కొంచెంసేపు వేచివుండి, అత డెంతకూ రాకపోయేసరికి, మెట్లెక్కిపోయి, "అక్కగారూ! పూజ అయిందా? ప్రసాదం ఎప్పుడు పెడతారు?" అని అడిగాడు.

ఉష తలమీదిచెంగు ఇంకొంచెం ముందుకు లాక్కుని నవ్వుతూ, "ఈ సంగతి మీరు మీ బావగారి నడగవలసిందే. ఆలశ్యం వారిదే, వంట పనంతా పూర్తయింది," అన్నది.

క్షేత్రమోహనుడు వంటగది నాలుగువైపులా ఓసారి చూసి, "మీ భోజనపు ఏర్పాట్లు చూస్తే తప్పక యిక్కడ భోజనం చెయ్యాలనే ఉంది. కాని నాకు అవతల పనులున్నాయి. మరోసారి ఎప్పుడైనా వచ్చి భోజనం చేస్తాను," అన్నాడు.

ఉష మెదలకుండా వూరుకున్నది. "మీ అబ్బాయి ఎక్కడ?" అని అడిగాడు క్షేత్రమోహనుడు.

"వాడివాళస్కూల్ ఎగ్గొట్టాలని చూశాడు. చివరకు ఎంతో కష్టంమీద లాలించి యింత చిరుతిండిపెట్టి ఎలాగయితేనేం, స్కూలుకు పంపాను," అన్నది ఉష.

"వాడికి మీ రంటే చాలా అపేక్ష!" అంటూ క్షేత్రమోహనుడు నవ్వి, "అవును గాని, మీరు పుట్టింటికి వెళ్ళే సంగతి ఏమయింది?" అని అడిగాడు.

ఉష ఏమీ జవాబివ్వకుండా తలాడించి వూరుకున్నది. క్షేత్రమోహనుడు అక్కణ్ణించి శైలేశ్వరుడి రీడింగ్ రూమ్‌లోకి వచ్చాడు. శైలేశ్వరుడు అక్కడే కూర్చుని వున్నాడు.

"ఇవాళ కాలేజీకి సెలవాఏమిటి?" అన్నాడు క్షేత్రమోహనుడు.

"సెలవేంలేదు, కాని మొదటి రెండు పీరియడ్లూ ఖాళీ," అన్నాడు శైలేశ్వరుడు.

"అక్కగారు పుట్టింటికెళ్ళే విషయమై ఏం ఏర్పాట్లు చేశావ్?"

"ఏర్పాట్లేమున్నయ్, బహుశా రేపు ఆమె అన్నగారు వస్తారు తీసుకుపోవటానికి," అన్నాడు శైలేశ్వరుడు.

"శైలేశ్, నే నిప్పుడు అక్కగారితో మాట్లాడి వచ్చాను. ఆమెకు పుట్టింటికి పోవాలనే వుద్దేశం వున్నట్టు నాక్కనబడలేదు. కాని నువ్వు మాత్రం యిక నామెను కాకి పొడిచినట్టు పొడవకు." అని క్షేత్రమోహనుడు గడియారంకేసి చూసుకుని, "ఓఁ వెళతానిక! రేపు ఉదయం మళ్ళీ వస్తాను," అన్నాడు.

అతడు గడపదాకాపోయి ఆగి చిన్న గొంతుతో, "శైలేశ్! నువ్వు కొన్నాళ్ళపాటు చూసీ చూడనట్టు ఉండకూడదా. ఆచారపరులైన కుటుంబం నుంచి వచ్చిన ఆవిడ, ఒక్కసారిగా అనాచారాలకు అలవాటుపడి సహించలేదు. భోజన విషయంలో కాస్త సర్దుకుపో. ఆరోగ్యందృష్ట్యా చూసినా మన బెంగాలీ భోజన పద్ధతులే ఉత్తమమైనవి," అన్నాడు.

ఇలా చెప్పి అతడు బావమరిది జవాబుకోసం ఎదురు చూడకుండా గబగబా బయటికి వెళ్ళిపోయాడు. శైలేశ్వరుడు స్తబ్దుడై ఉన్నచోటున అలాగే నిలబడిపోయాడు. క్షేత్రమోహనుడు తన భార్యకు ఏం చెప్పి, పుట్టింటి ప్రయాణం ఆపుచేశాడో అతడికి అర్థంకాలేదు.

# 6

శ్రీ మరునటిరోజు ఉదయానే అవినాశుడు వచ్చాడు. శైలేశ్వరుడు అప్పుడే నిద్రలేచి, ముఖం కడుక్కుని టీ తాగేందుకు తన రీడింగ్ రూమ్‌లోకి అడుగుపెట్టాడు. అక్కడ కనిపించిన అపరిచత వ్యక్తి—ఈ అవినాశుణ్ణి చూసి అతడి గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"తమ రెవరు?" అని అడిగాడు.

అవినాశుడు తాను ఉష తమ్ముణ్ణని పరిచయం చేసుకుని, "అన్నగారు పనులవల్ల అక్కను తీసుకుపోయ్యేందుకు స్వయంగా రాలేక, నన్ను పంపారు," అన్నాడు.

"మంచిది, అలాగే తీసుకు వెళ్ళండి," అని శైలేశ్వరుడు తన పడక గదిలోకి వెళ్ళిపోయాడు. ఏదో కారణంవల్ల వెళ్ళిపోదలుచుకున్నవాళ్లు, ఆఖరి నిమిషంలో మరేదో కారణంచేత ఆగిపోవటం జరుగుతూంటుంది. శైలేశ్వరుడు తన భార్య పుట్టింటి ప్రయాణాన్ని గురించి యిలాగే ఊహించాడు. పైగా నిన్న క్షేత్రమోహనుడు ఆమె ప్రయాణపు ప్రయత్నం మానుకున్నట్టు కూడా తనకు చెప్పాడు; ఈ ఉదయం యిటు వస్తానన్నాడు

శైలేశ్వరుడికి ఆ క్షణాన తన బావమరిది క్షేత్రమోహనుడు అక్కడికి వస్తే తన కెంతో మనశ్శాంతి కలుగుతుందన్న భావం కలిగింది. ఇప్పుడేం చెయ్యటం? అని అత డాలోచించేంతలో గదిలోకి అవినాశుడు వచ్చి, "ఈ రెండున్నర గంటల రైలుకే అక్క బయలుదేరాలంటున్నది," అని చెప్పాడు.

శైలేశ్వరుడు, అవినాశుడి ముఖంలోకి పరీక్షగా చూస్తూ, "వెళ్ళిపోవాలంటోందా? నే నేమన్నా యీ ప్రయాణానికి ఆటంకం కలిగిస్తానని భయపడుతున్నదా," అని అడిగాడు.

అవినాశుడు యింకా కుర్రవాడు. అతడు బావగారికి ఏం జవాబు చెప్పాలో తోచక కాస్త తికమకపడి, "లేదండీ!" అని మాత్రం అనగలిగాడు.

అంతలో ద్వారం దగ్గర గాజుల గలగల వినిపించి శైలేశ్వరుడికి గాభరా ఎత్తింది. అతడు తల వంచుకుని, "ఆమె వెళ్ళటానికి నా అభ్యంతరం ఏమీలేదు," అన్నాడు.

అవినాశుడు మాట్లాడలేదు. "మీ అన్నయ్య వస్తాడని తెలిసింది. ఆయన ఎందు కని రాలేదు?" అని ప్రశ్నించాడు శైలేశ్వరుడు.

అవినాశుడు యిబ్బంది పడిపోతూ, ..‘‘అసలాయనకు నన్ను పంపాలనే ఉద్దేశం కూడా లేదు,’’ అన్నాడు.

‘‘కారణం?’’

అవినాశుడు జవాబివ్వలేదు. శైలేశ్వరుడు కొంచెం ఆగి, ‘‘నువ్వు కుర్రవాడివి. నీతో అన్ని సంగతులూ మాట్లాడే అవకాశంలేదు. ఒకవేళ మీ అన్నగారికి తెలుసు. కోవాలనే యిచ్ఛవుంటే—ఈ జరిగినదాంట్లో ఉష పొరబాటు ఏమీలేదని చెప్పు. అలాంటిదేమైనా వుంటే అది నా వల్లనే జరిగింది. నే నసలు ఆమెను పిలిపించ వలసింది కాదు,’’ అన్నాడు.

దీనికీ అవినాశుడు ఏమీ జవాబివ్వలేదు శైలేశ్వరుడు మళ్ళీ ప్రారంభించాడు: ‘‘మా నాన్నగారు ఉష విషయంలో చాలా ఉపేక్షచేసి కొంత అన్యాయం చేశారని నా కనిపిస్తున్నది. ఇన్నాళ్ళ తర్వాత ఆ అన్యాయాన్ని సరిదిద్దాలన్న ప్రయత్నం చేశాను, నేను. అనుకున్నట్టుగానే మీ అక్క వెంటనే యిక్కడికి వచ్చింది. కాని జరిగిపోయిన ఆ ఒక్క అన్యాయం వేయి అన్యాయాలుగా పరిణమించినట్టు నాకు తోస్తున్నది.’’

ఈ మాటలకు ఏం జవాబు చెప్పాలో తోచక అవినాశుడు మౌనంగా వూరు కున్నాడు. ఇంతలో క్షేత్రమోహనుడు హడావిడిగా గదిలోకి వచ్చాడు. శైలేశ్వరుడు అతడికేసి ఓమారుచూసి తిరిగి ప్రారంభించాడు: ‘‘నే నేనాడో మీ సోదరిని పెళ్ళాడిన మాట నిజమే. కాని అంతమాత్రం చేత ఆమె నా సహధర్మచారిణి అని చెప్పేందుకు వీల్లేదు. మేం ఇద్దరం పొందిన శిక్షణా, అనుసరించిన ఆచార విశేషాలూ భిన్న మైనవి. నేను బలవంతంగా ఆమెను ఇంట్లో ఉంచుకుని, ఇంటిని పౌరోహితుల కొంపగా మార్చలేను. నా ఏకైక సోదరి పొందుతున్న దుఃఖమూ, ఏకైక పుత్రుడి మనసులో జొరబడుతున్నకు సంస్కార లక్షణాలూ నేను సహించలేను. అయినా, నా నోటిమీదుగా నేను ఏ మాట అయితే చెప్పలేక పోయానో—అమాట ఆమే చెప్ప గలిగినందుకు నే నెంతో కృతజ్ఞుణ్ణి.’’

శైలేశ్వరుడు యింత తీవ్రంగా మాట్లాడటం విని క్షేత్రమోహనుడు నిర్విణ్ణుడయి పోయాడు. శైలేశ్వరుడు లజ్జా స్వభావుడే కాక, చాలా దుర్బల హృదయంగల వ్యక్తి. కొంచెం కఠినంగా, తీవ్రంగా మాట్లాడటం అతడి స్వభావానికి విరుద్ధం. అలాంటివాడీ సమయంలో పిచ్చివాడిలా అవాకులూ చవాకులూ పేలుతూండటం క్షేత్ర




మోహనుణ్ణి చాలా ఆశ్చర్యపరిచింది. ముఖ్యంగా ఉష తమ్ముడిముందు యీ ధోరణిలో మాట్లాడుతూండటం అతడికి చాలాబాధ కలిగించింది.''

క్షేత్రమోహనుడు, అవినాశుణ్ణి సమీపించి, ''చూడండి! మీ బావగారు మాట్లాడిన దాంట్లో ఒక్క మాటయినా మీ సోదరితో అనకండి,'' అన్నాడు.

అవినాశుడు వెనకవున్న మరోద్వారంకేసి చేయి వూపుతూ క్షేత్రమోహనుడికి సౌంజ్ఞచేసి, ''నే చెప్పవలసిన అవసరం ఏముంది! అంతా మా అక్కయ్య వింటూనే వున్నది,'' అన్నాడు.

క్షేత్రమోహనుడు ఆశ్చర్యంగా అటుకేసి చూశాడు. శైలేశ్వరుడు తలాడిస్తూ, ''నాకు తెలుసు, ఆమె అంతా వింటూనే ఉన్నది, విననీ!'' అన్నాడు.

ఆ రోజున రెండు గంటలకు అవినాశుడు తన అక్కగారిని తీసుకుని రైలు స్టేషనుకు వెళ్లాడు. ఆ సమయంలో సోమేంద్రుడు మేనత్త ఇంటఉన్నాడు. క్షేత్రమోహనుడు హైకోర్టుబార్ లైబ్రరీలో కూర్చుని ఏదోలా పుస్తకం తిరగ వేస్తున్నాడు.

రెండు మూడు రోజుల తరవాత ఒక ఉదయాన విభ, భర్త టీ తాగుతూండగా పక్కకువచ్చి నిలబడి, ముసి ముసి నవ్వులు నవ్వుతూ, ''అన్నయ్య ఏం చేస్తున్నాడో మీరు గమనించారా?'' అని అడిగింది.

''ఆ(, గమనించాను. చేతిలో ఏదో పుస్తకం మాత్రం వుంటున్నది. బహుశా తన మూర్ఖత్వానికి పశ్చాత్తాప పడుతున్నాడేమో!'' అన్నాడు క్షేత్రమోహనుడు.

''ఆ పని ..మీరెప్పుడు చేయబోతున్నారు?'' అన్నది విభ.

"ఏమిటి? చేత్తో పుస్తకం పట్టుకుని కూర్చునేపనా? లేక పశ్చాత్తాప పడటమా?"

"పుస్తకం పట్టుకు కూర్చోవటం యీ సమయంలో మీకు నప్పదు ఆ రెండో దాన్ని గురించే అడుగుతున్నాను," అన్నది విభ.

"ఆ సంగతాలోచిస్తాను. నువ్వా మీ అన్నయ్యను పిలిపించి, నీ పుట్టింటికి వెళ్ళిపో ముందు," అన్నాడు క్షేత్రమోహనుడు.

ఆసమయంలో విభ మనస్సుచాలా ఉల్లాసంగావుంది. ఆకారణంగా భర్త అన్న మాటకు ఆమెకు కోపంరాలేదు. ఆమె చిన్నగా నవ్వి, "అంత గొప్పపని చేయటం నా వల్లకాదులెండి. నాకు సనాతన కుటుంబస్త్రీలలాగా చిన్నప్పటినుంచీ, జపాలూ అవీ చేయటం, ఇది తాకవచ్చు—కూడదు అని మీమాంస చేయటం అలవడలేదు," అన్నది.

క్షేత్రమోహనుడు వచ్చే కోపాన్ని అణుచుకుని, "అలాంటి పద్ధతులు నీకు అలవడక పోవటం—నిజంగా నీ దురదృష్టం. అలవడేవుంటే మీ అన్నయ్య యింత గొడవల్లో యిరుక్కోవలసి వచ్చేది కాదు," అన్నాడు.

*　　　*　　　*

భవానీ పూర్‌లోని భూపేంద్ర బెనర్జీబాబు కుమార్తె గురించిన ప్రసక్తి మళ్ళీ తల ఎత్తింది; వివాహ ప్రయత్నాలు ప్రారంభమయాయి. విభకు ఎంత ఉత్సాహం ఉన్నా, యీ విషయమై భర్తకు చాలా తీవ్రమైన వ్యతిరేకాభిప్రాయం ఉన్నదని తెలుసుకుని ఉన్నందున—ఈ ప్రయత్నాల్లో అంత ప్రత్యక్షంగా పాల్గొన లేక పోయింది.

పిల్లవైపు వారి యిష్టం తెలిసిం తర్వాత, క్షేత్రమోహనుడు ఒకనాడు శైలేశ్వరుణ్ణి యీ విషయమై ప్రశ్నించాడు. శైలేశ్వరుడు ముఖంలో ఎంతో అయిష్టత కనబరుస్తూ, "క్షేత్రమోహన్! ఇప్పటికి జీవితంలో చాలా భాగం గడిచే పోయింది. ఈ స్థితిలో నెత్తిన మరొక బరువు పెట్టుకునే సాహసం నాకు లేదు. సోమేంద్రుడున్నాడు, మీ అందరి ఆశీర్వాద బలమూ ఉంటే వాడు పెరిగి వృద్ధిలోకి వస్తాడు. కనక, అనవసరం కొత్త బెడదలు పైనవేసుకోవటం ఎందుకు?" అన్నాడు.

అతడి మాటలు ఎంతో నిష్కపటంగా కనిపించాయి, క్షేత్రమోహనుడికి. అతడికి చాలా బాధ కలిగింది. ఆ రోజునుంచీ అతడు కోర్టుపని అయిపోగానే శైలేశ్వరుడి ఇంటికి వచ్చి పోతూండేవాడు. ఆ ఇంట గృహిణిలేదు, పిల్లవాడులేడు. నౌకర్లూ చాకర్లద్వారా గృహనిర్వాహణ జరిగిపోతున్నది. చూస్తూండగానే ఆ ఇల్లు ఎంతో కళా విహీనం అయి పోయింది. ఆ మార్పు చూసిన వాళ్ళ మనస్సులు బాధపడకుండా వుండలేవు.

నెలరోజులు గడిచాక ఒకనాడు క్షేత్రమోహనుడు చెల్లెలు ఉమతో కూడా శైలేశ్వరుడి ఇంటికివచ్చి, బావమరిదితో, "శైలేశ్! నా అభిప్రాయం ఏమిటో నీకు తెలుసు గదా? గృహిణిఅంటూ లేనిదే, గృహనిర్వహణ బాగాజరిగిపోవటం అసంభవం. ముఖ్యంగా వృద్ధాప్యంలో . . ."

అతడు మాటముగించేలోపలే ఉమ అందుకుని, "అదెప్పటిమాట! అక్కగారు యీలోపలే యిక్కడికి వస్తుంది. ఎంత కోపంవచ్చి వెళ్ళినా, పుట్టింటి దగ్గిర ఎన్నాళ్ళుంటుంది?" అన్నది.

దీనికి అన్నగాని శైలేశ్వరుడుగాని, జవాబివ్వలేదు. కాని, ఆ మాట వింటూనే శైలేశ్వరుడు వెలవెల పోయాడు. అతడు కాసేపువూరుకుని, "ఉహుఁ, ఇక ఆవిడిక్కడికి రానేరాదు," అన్నాడు.

ఉమ ఎంతో విశ్వాసం పుట్టిపడేస్వరంతో, "రాదా? ఎందుకురాదు? తప్పకుండా వచ్చితీరుతుంది. బహుశా, యీ నెల్లోనే వచ్చినారావచ్చు. ఏం, అన్నయ్యా" అన్నది.

ఉష తిరిగిరావటంలో ఉన్నచిక్కులు క్షేత్రమోహనుడికి బాగాతెలుసు. ఆమె వెళ్ళేముందు శైలేశ్వరుడన్నమాటలు, బహుశా ఆమె ఎన్నటికీ మరచిపోలేదు. కాని, ఆమె యిక్కడున్న కొద్దిదినాల్లోనే భర్త నెంతగా గౌరవించిందో, ప్రేమించిందో క్షేత్రమోహనుడు గమనించక పోలేదు. వచ్చిన చిక్కులన్నిటికీ కారణం ముసల్మాను వంటవాడన్న సంగతి మనసులో మెదలగానే అతడు చాలాబాధపడ్డాడు. అయినా ఆమె తనుపాటించని ఆచారాలను అనుసరించే భర్తృగృహాన్ని అంత తేలిగ్గా విడిచిపోవలసింది కాదన్న భావం కూడా క్షేత్రమోహనుడికున్నది .

ఉమ మరోసారి క్షేత్రమోహనుణ్ణి, ఉష తిరిగివచ్చే సంగతిగురించి ప్రశ్నించింది. దానికతడు నిరాశగా, 'ఆమె రాదనే అనుకోవాలి. ఇక్కడికి రాకముందు ఆమె జీవితం ఎలాగడిచిపోయిందో, యికముందూ అలాగే గడిచిపోతుంది. అయినా, ఆమె రాకపోతే మరోమార్గం లేదా? ఆ సంగతే ఆలోచించిచూడాలి," అన్నాడు.

ఈ మాటలు ఉమకు అర్థంకాలేదు. ఆమె మెదలకుండావూరుకున్నది. శైలేశ్వరుడు ఆమె ముఖంకేసి ఓ మారుచూసి, "ఆమెను మళ్ళీ యిక్కడికి తీసుకురావటం నాకేం ఉచితం అనిపించటంలేదు. ఆమె నేను వివాహమాడిన స్త్రీయే అయినా—సహధర్మచారిణి అని మాత్రం నేననను." అన్నాడు.

ఉష గురించి యింత అనాగరికంగా శైలేశ్వరుడు మాట్లాడే సరికి క్షేత్రమోహనుడు కొంచెం కోపం తెచ్చుకుని, "మనకు అసలు ధర్మం అనేదే లేనప్పుడు, సహ




ధర్మిణి ఎక్కడనుంచి వస్తుంది? అలాంటి గొప్ప విషయాలు మనకెందుగ్గాని, నీ గృహ నిర్వహణ సక్రమంగా సాగే ఆలోచనచెపుతాను, విను," అన్నాడు.

శైలేశ్వరుడు ఆశ్చర్యపోతూ, "మనకసలు ధర్మమేలేదా?" అన్నాడు.

"ఒకవేళవుంటే ఎక్కడున్నదోచూపు? ఉద్యోగాలుచేసి సపాయించి తింటున్నాం. పడుకుని హాయిగా నిద్రపోతున్నాం. సహధర్మచారిణి లేకపోయినా యీ పనులన్నీ జరిగిపోతున్నయ్. మన పూర్వులు యజ్ఞాలుచేసేవాళ్ళు. తీర్థస్నానాలు, వ్రతాలుచేసే వాళ్ళు. వాళ్ళకు సహధర్మచారిణి అవసరం వుంది. కాని, మనం అందుకోసం పెద్దగా చింతించ వలసిన అవసరం లేదు," అన్నాడు క్షేత్రమోహనుడు.

సహధర్మచారిణి అంటే . యజ్ఞయాగాలూ, వ్రతాలూతప్ప "

శైలేశ్వరుణ్ణి మాట పూర్తిచేయనీయకుండా క్షేత్రమోహనుడు అడ్డువచ్చి, "అంతే. అంతకన్న మరేంలేదు. నువ్వూ నేనూ హిందువులమైనా కృష్ణా రామా అంటూ భజనలు చేసే దురభ్యాసం లేదు మనకు. సహధర్మచారిణి అనే అయిదక్షరాలతో ఏం పని? మనకు ఏ స్త్రీ వున్నా సరిపోతుంది. మనపనులు సక్రమంగా జరిగిపోతాయి. నువ్వుకాస్త తయారుగా వుండు——ఆ భవానీపూర్ వాళ్లు నన్ను తొందరపెట్టేస్తున్నారు. మీ చెల్లెలికి కూడా ఆ సంబంధం బాగా నచ్చినట్టుగావుంది," అన్నాడు.

ఆ మాటలకు శైలేశ్వరుడు ముఖం కందగడ్డలాచేసుకొని, "క్షేత్రమోహన్ నువ్వు నాతో పరిహాసాలాడదలిచావా?" అన్నాడు.

బావమరిది కోపం చూసి క్షేత్రమోహనుడు కొంచెం గతుక్కుమని, "అలాంటి దేం లేదు, శైలేశ్! అలాంటి పరిహాసం ఏమైనావుంటే అది నిన్నుగురించికాదు, నా గురించే," అన్నాడు.

శైలేశ్వరుడు ఆ జవాబుకు మౌనంగా తలవంచుకు వూరుకున్నాడు. బావమరది మనోభావాన్ని కొంతవరకు అవగాహన చేసుకున్న క్షేత్రమోహనుడు, యీ విషయమై యిక సాగదీయటం బావుండ దనుకున్నాడు. కాని, అతడికి భవానీపూర్ సంబంధాన్ని గురించిన ఆశమాత్రం పూర్తిగా పోలేదు. ఆకారణం వల్ల అతడు వారం రోజుల తర్వాత ఛాప్రాహైకోర్టులో ఒక కేసుపనిమీద వెళుతూ, భార్యతో, "ఆ బెనర్జీబాబు కుమార్తె సంబంధం గురించి, మీ అన్నను కదిపిచూశాను. ఏదో మాట్లాడాడు. ఆగి చూద్దాం .నిరాశపడనవసరం లేదు." అనిచెప్పాడు.

విభ చిరునవ్వు నవ్వి, "మీరు ఉషవదినకు గొప్ప స్నేహితులు గదా! అలాంటి వారు అన్నయ్య పెళ్ళివిషయంలో యింత పట్టుదలగా ప్రయత్నిస్తున్నారంటే ఆశ్చర్యంగావుంది. నెలరోజుల క్రితం అయితే యీ మాటనమ్మే దాన్ని కాదు," అన్నది.

"నెలరోజుల క్రితం యీ విషయమై నేనాలోచించిందే లేదసలు. ఇప్పటికీ నేను ఉషకు మిత్రుణ్ణే. ఆమెక్షేమంకోరేవాణ్ణే. కాని, అతకనిదాన్ని గురించి బుర్ర బద్ధలు కొట్టుకోవటం వృథా!" అన్నాడు క్షేత్రమోహనుడు.

"మీ మగవాళ్ళకు వదినను అర్థం చేసుకోటానికి కాలం పట్టవచ్చు. నే నా విణ్ణి చూస్తూనే, ఆవిడ మన స్తత్వం గ్రహించాను. అలాంటి స్త్రీబాంధవ్యంతో మనబోటి వాళ్ళకు రోజులు గడవటం చాలా కష్టమవుతుంది," అన్నది విభ.

"విభా! మనం ఆవిణ్ణి రకరకాలుగా అంచనా వేసినట్టు కనబడుతున్నది. బహుశా నేను పొరబడే వుండవచ్చు ..ఒప్పుకుంటాను," అన్నాడు క్షేత్రమోహనుడు.

"కనీసం ఇప్పటికైనా ఒప్పుకున్నారు. అదే పదివేలు. మనమైనా కిరస్తానీ వాళ్ళమూ, ముసల్మానులమూ కాదు. కాని, మనకన్న అందరూ తక్కువ జాతివాళ్ళనీ, వాళ్లు తాకిన భోజనం చేస్తే మన జాతి పోతుందనీ అహంకరించటం ఎందుకు? పూర్వాచారాలను పాటించినంత మాత్రానికే స్వర్గం ప్రాప్తమవుతుందా? . .పాపం, ఆవిడకు




పుట్టింటిదగ్గిర సాగిన ఆ ఛాందసాలేవీ యిక్కడ సాగలేదు.'' అన్నది విభ ఉత్సాహంగా.

విభ మాటల్లో సత్యా సత్యాలు రెండూ మిశ్రితమై వుండటం గుర్తించిన క్షేత్ర మోహనుడు భార్య ముఖం కేసి చూస్తూ వూరుకున్నాడు. ఆ సమయంలో ఉమ గది లోకి వస్తూ, ''దేన్ని గురించి పెద్దగా చర్చిస్తున్నారు?'' అన్నది.

విభ, మరదలికేసి ఓ సారి తల తిప్పి చూసి, భర్తతో, ''వదినకు తన జాతీ, ఆచారమే సర్వం. మీ రనుకునేదాంట్లో కొంచెం నిజం లేకపోలేదు—మా అన్నయ్య ఆవిణ్ణి కాస్త చిన్న చూపు చూడటానికి కారణం—నా మాటలూ, ప్రోత్సాహమూ. కాని మీ రూరుకున్నారా? వదిన విషయమై నన్ను మీరు తూలనాడారు. మరచిపోకండి. అయినా మిమ్మల్ని వదలి వదినలా నేను పుట్టింటికి పారిపోతానా?' అన్నది.

క్షేత్రమోహనుడు జవాబేమీ ఇవ్వలేదు. విభ మరి కొంచెం సేపు మౌనంగా కూర్చుని గది నుంచి బయిటికి పోయింది. ఆ రాత్రే క్షేత్రమోహనుడు కోర్టు పనిమీద ఛాప్రాకు వెళ్ళిపోయాడు. వెళ్ళేముందు అతడు విభతో, ''నేను తిరిగి రావటానికి అయి దారు రోజులు పడుతుంది. భవానీపూర్ వాళ్ళు వస్తే, శైలేశుణ్ణి వివాహానికి అంగీకరింప చేసే ప్రయత్నం చేస్తున్నాననీ, పని కావచ్చనీ చెప్పు.'' అని చెప్పాడు.

''అయితే వదిన్ని గురించి ఎలాంటి ఆశాలేదా? ఆమె తిరిగిరానట్టేనా?'' అని ప్రశ్నించింది విభ.

''ఉహుం. నేను అంతా మరోసారి గుర్తుకు తెచ్చుకుని ఆలోచిస్తుంటే, యీ జరిగి పోయిన దాంట్లో శైలేశ్వరుడి నేరంకన్న ఆమె నేరమే ఎక్కువదిగా కనిపిస్తున్నది.

నువ్వనేదే సరిలా వున్నది. ఏ రకం ఆచారవ్యవహారాలూ, శిక్షణా మనిషిని స్వార్థ పరుణ్ణీ, సంకుచితుణ్ణీ చేస్తుందో—వాటికి మరే యుగంలో అయినా విలువా, గౌరవం వుండొచ్చేమో కాని, ఈ రోజుల్లో వాటిని మెచ్చుకోవలసిన అవసరం ఏమీ లేదు. అక్కగారిలో ఆచార ఆడంబరం తప్ప, బాధ్యతను గురించిన ఆలోచన వున్నట్టులేదు. అలా కాకపోతే, ఆమె భర్త గృహాన్ని విడిచి వెళ్ళేదికాదు,'' అన్నాడు క్షేత్ర మోహనుడు.

అతడు ఛాప్రాలో పని చూసుకొని తిరిగి కలకత్తాకు రావటానికి అయిదారు రోజులకు మారుగా, పదిరోజులు పట్టింది. అతడు ఇంటికి వచ్చేసరికి హాల్లో ఉమ ఎదురైంది. ఆమె అన్నతో శైలేశ్వరుడు కాలేజీకి ఆరు నెలలు సెలవుపెట్టి ప్రయాగకు వెళ్ళాడని చెప్పింది. స్కూల్లో పేరు తీసేయించి కొడుకు సోమేంద్రుణ్ణి కూడా అతడు ప్రయాగకు తీసుకుపోయాడు.

''ఇంత హఠాత్తుగా, యీ పనెందుకు చేశాడు?'' అంటూ ఆశ్చర్యపోయాడు క్షేత్ర మోహనుడు.

''ఆయన సోమేంద్రుణ్ణి తీసుకుపోయేందుకు మనింటికి వచ్చాడు. అడిగితే, తన ఒంట్లో ఏమీ బావుండటం లేదన్నాడు,'' అని చెప్పింది ఉమ.

## 7

రెండు నెలలు గడిచాయి. ఒకనాటి ఉదయం యోగేశబాబు అనే మిత్రుడు ప్రయాగ నుంచి క్షేత్రమోహనుడికి ఒక ఉత్తరం రాశాడు. అందులో అతడు శైలేశ్వరుణ్ణి గురించి తెలియపరుస్తూ; అతడు వైష్ణవమతం పుచ్చుకున్నాడనీ, కొడుకు సోమేంద్రుడికి ఉపనయనం చేశాడనీ, ఇప్పుడు ఏ వీధినైనా చేపల మాంస దుకాణాలున్నవని తెలిస్తే, ఆ వీధిన నడవటం కూడా తండ్రీ కొడుకులు మానేశారనీ రాశాడు.

ఆ ఉత్తరం చూసిన ఉమ నవ్వుతూ, ''ఆశ్చర్యంగావుంది. ఇదేదో యోగేశబాబు చేస్తున్న తమాషా కాదు గదా!'' అన్నది అన్నతో.

''యోగేశబాబు అలాంటి వాడు కాదు!'' అన్నాడు క్షేత్రమోహనుడు దీర్ఘాలోచనలో పడి.

గదిలోకివస్తూ అన్నా చెల్లెళ్ల సంభాషణ విన్న విభ, ''యోగేశబాబు మీకూ, అన్నయ్యకూ కూడా మిత్రుడేగా. అందుకే అన్నయ్యను గురించి యీ తమాషా ఉత్తరం మీకు రాసి వుంటాడు, సందేహం లేదు,'' అన్నది.




క్షేత్రమోహనుడు యీ విషయమై భార్యతో వాదించటం వృధా అని వూరుకున్నాడు. తర్వాత అతడు ప్రయాణమై ప్రయాగకు పోయి అయిదారు రోజుల తరవాత ఇంటికి తిరిగివచ్చి, శైలేశ్వరుడు రాసిన ఒక ఉత్తరాన్ని భార్యకు ఇచ్చాడు.

విభ ఉత్తరం చదువుకుని ఎంతో దుఃఖితురాలైంది. ఆమెకు అన్న అంటేనేకాక, సోమేంద్రుడన్నా ఎంతో ఆప్యాయత వుంది. "కనీసం కుర్రాణ్ణయినా మీరు ఇక్కడికి తీసుకురావలసింది!" అన్నదామె భర్తతో.

"అదెలా సాధ్యం! శైలేశ్వరు దేమనుకుంటాడు. మనం అలాంటి పని చేయాలని చూడటం శైలేశ్వరుడితో విరోధం తెచ్చుకోవటమే అవుతుంది," అన్నాడు క్షేత్రమోహనుడు.

విభ కన్నీళ్లు తుడుచుకుంటూ, "చివరికంతా యిలా అయిందా? మీ వెంట నేనూ ప్రయాగ వచ్చివుంటే, ఏమైనా ప్రయోజనం కలిగేదేమో!" అన్నది.

త్వరలోనే శైలేశ్వరుడి వైష్ణవమత స్వీకారవార్త కలకత్తాలోని అతడి బంధుమిత్రులందరికీ తెలిసిపోయింది. పిల్ల నిస్తామన్న భవానీపూర్ వాళ్ళకు కూడా యీ సంగతి ఎవరో రాశారు. విభ సిగ్గుతో ఎవరికీ ముఖం చూపించలేక పోతున్నది. భర్తతో మాత్రం కొంచెం దబాయింపుగా, "అన్నయ్యను యిక్కడికి తిరిగి రానీయండి. ఆ వైష్ణవం ఏమిటో తేల్చుతాను," అనసాగింది.

శైలేశ్వరుడు కాలేజీకి పెట్టిన సెలవును మరో నాలుగు నెలలకు పొడిగించాడు. అతడు ఉద్యోగం వదలడనే నమ్మకం మాత్రం క్షేత్రమోహనుడి కున్నది. ప్రయాగలో గంగా స్నానాలు చేస్తూ, తిలక త్రిపుండ్రాలు ధరించవచ్చు గాక! అయినా అతడి గురు దేవుడూ, గురుభాయీలూ ఉద్యోగం మానమని మాత్రం సలహా యివ్వక పోవచ్చు

క్షేత్రమోహనుడి ఆలోచనలు యిలా నడుస్తున్నాయి. అత నొకనాటి ఉదయం గదిలో టీ తాగుతూ, పక్కన కూర్చున్న భార్యతో, "ఈసారి ఉష వచ్చేటట్టయితే, ఆమె తిరిగి పుట్టింటికి పోవలసిన అవసరం కలగదు. జపానుష్ఠానాల్లో, భజనల్లో ఆ భార్యా భర్త లిద్దరికీ హాయిగా కాలం గడిచిపోతుంది," అన్నాడు.

విభ కోపం తెచ్చుకుని, "ఆవిడ వస్తుందని మీకేమైనా తెలిసిందా?" అని ప్రశ్నించింది.

"అలాంటి దేం లేదు."

"పల్లెటూళ్ళ వాళ్లు కొందరు, మాయ మంత్రాల్లో ఘటికులని అంటారు." అన్నది విభ.

"కావచ్చేమో! అయినా ..యిలాంటి వైష్ణవ దీక్షలు మాత్రం వాళ్ళు చెప్పలేరు." అన్నాడు క్షేత్రమోహనుడు.

"ఏమో మరి! ఒకటి, సోమేన్‌ను మాత్రం అక్కణ్ణుంచి తప్పకుండా లాక్కొస్తాను. ఇది ప్రతిజ్ఞ అనుకోండి," అన్నది విభ.

ఆ సమయంలో ఇంటి నౌకరు చెంగాలావచ్చి, విభతో, "అమ్మగారూ! ఇద్దరు హరిదాసులూ, బందూ వచ్చారు," అని చెప్పాడు.

ఈ బందూ చాలాకాలంగా శైలేశ్వరుడి దగ్గర వుంటున్న నౌకరు. భార్యా భర్త లిద్దరూ గదినుంచి బయటికి వచ్చారు. వారికి బంధూ కనిపించాడు. విభ వాణ్ణి, "ఈ హరిదాసు లేం చేస్తారు?" అని అడిగింది.

"గానా బజానా అయుంటుంది బాబుగారితోపాటు యిలాంటి వాళ్లు నలుగు రైదు గురు వచ్చారు," అన్నాడు బంధూ.

"శైలేశ్వరుడు వచ్చాడా—అన్నయ్య వచ్చాడా?" అంటూ క్షేత్రమోహనుడూ, విభా ఒక్కసారే ప్రశ్నించారు.

"నిన్న రాత్రి అంతా వచ్చారు. హరిదాసు నొకణ్ణి తీసుకుని బాబుగారు ఎక్కడికో వెళ్ళారు," అని చెప్పాడు బంధూ.

ఆ మర్నాటి సాయంకాలం క్షేత్రమోహనుడు విభనూ, ఉమనూ వెంటబెట్టుకుని శైలేశ్వరుడి ఇంటికి వెళ్ళాడు. అతడు మామూలు పద్ధతిప్రకారం రీడింగ్ రూమ్‌లోకి వెళ్ళబోయే సరికి, అక్కడ పరిచిఉన్న ఒక తెల్లటి దుప్పటిమీద ఇద్దరు వ్యక్తులు కూర్చుని వున్నారు. పిక్క బలిసివున్న వారి దేహాలమీద హరినామ ముద్రలున్నాయి. వాళ్ళ మెడల్లో పెద్ద పెద్ద తులసి పూసల దండలు వేసుకుని వున్నారు.

క్షేత్రమోహనుడు ఆ గదిలోకి వెళ్ళటం బావుండదనుకుని, మేడమీదికి బయలు దేరాడు. వారికి దారిలో ఒరియా వంటబ్రాహ్మడు ఎదురై, "పైకి పోకండి! గోసాయీస్వాము లున్నారు," అన్నాడు

"గోసాయి స్వాములెవరు? సరే, బాబుగా రెక్కడ?" అన్నాడు క్షేత్రమోహనుడు.

వంట బ్రాహ్మడు వేలితో పైకి సౌంజ్ఞ చేశాడు. క్షేత్రమోహనుడు పెద్దగా, "శైలేశ్! శైలేశ్!" అని పిలిచాడు.

ఆ పిలుపుకు సోమేంద్రుడు పరిగెత్తుకొంటూ వచ్చాడు. అతడి వేషంచూసి విభ బావురుమని ఏడ్చింది. కుర్రాడినెత్తిన పిలక వున్నది, మెళ్ళో తులసి మాలవుంది, తెల్లని ధోవతి కట్టుకుని వున్నాడు వాడు దూరంగా నుంచుని నమస్కారం చేశాడు. ఉమ అతణ్ణి పట్టుకోబోయింది. కాని, క్షేత్రమోహనుడు ఆపి, "వాణ్ణిప్పుడు ముట్టుకోవటం మంచిది కాదు. వాణ్ణి మళ్లీ వాళ్ళ స్నానం చేయించవచ్చు," అని, "సోమేన్! మీ నాన్న ఎక్కడున్నాడు?" అని అడిగాడు.

"ప్రభు పాదులు శ్రీ గురుదేవుల దగ్గిర భాగవతం చదువుతున్నాడు," అన్నాడు వాడు.

"నువ్వెళ్ళి మీ నాన్నతో మేం వచ్చామని చెప్పు," అన్నాడు క్షేత్రమోహనుడు.

"వారు మీ కేకవిన్నారు, వస్తున్నారు!" అన్నాడు సోమేంద్రుడు.

ఒకటి రెండు నిమిషాల్లో శైలేశ్వరుడు పావుకోళ్ళు తొడుక్కుని మెట్లుదిగి రాసాగాడు అతడు తెల్లని ధోవతికట్టి, చొక్కా తొడుక్కుని వున్నాడు. నెత్తిమీద పిలకవుంది. మనిషి చాలా వినమ్రుడిలా కనిపించాడు. విభ, ఉమ నమస్కరించే సరికి, అతడంత దూరంగా వుండే యిద్దర్నీ ఆశీర్వదించాడు.

"కాస్త కూర్చునేందుకు ఇంట్లో ఎక్కడా చోటున్నట్టులేదే!" అన్నాడు క్షేత్ర మోహనుడు.

శైలేశ్వరుడు సిగ్గు పడుతున్న వాడిలా తలవంచుకుని, "కిందిగది అంతా గలీజుగా ఉంది. కొంచెం బావు చేయించాలి." అన్నాడు.



"అయితే యిహ మేం వెళతాం. నే చూస్తున్న దాన్నిబట్టి యిహ మెం యిక్కడికి రా నవసరం లేనట్టు కనబడుతున్నది. అయినా కూర్చోవటానికి ఏమన్నా స్థలం వుంటే మాత్రం కబురు చెయ్యి, వస్తాం," అన్నాడు క్షేత్రమోహనుడు.

శైలేశ్వరుడు ఏమీ అనకుండా చూస్తూ వూరుకున్నాడు. అందరూ కార్లో తిరిగి ఇంటికి వచ్చేశారు. ఓ నెల గడిచింది. క్షేత్రమోహనుడి ఇంట్లో ఉష పేరు వస్తే చాలు అందరూ గట్టిగా ఆమెను విమర్శించ సాగారు, అసలామె యిక్కడికి లోగడ రావటం జరక్కపోతే, శైలేశ్వరు డిప్పుడు యీ విధంగా తయారయేవాడు కాదని వాళ్ళందరి నమ్మకం.

క్షేత్రమోహనుడు బావమరిది ఇంటికి వెళ్ళకపోయినా అక్కడి సంగతులు వాళ్ళ, వీళ్ళ ద్వారా తెలుస్తూనే వున్నవి. వాళ్ళు విన్నదాన్నిబట్టి అక్కడ చేరిన గోసాయీల ముఠా యిప్పట్లో కదిలేట్టు లేదు. గురుదేవుడూ, ఆయన భార్యా రత్నం మేడమీద




కాపరం పెట్టేశారు. ఉదయ సాయంకాలాల్లో భజనలు సాగుతూనే వున్నాయి. అంతా మహా వైభోగంగా వుంది. మరో విశేషం ఏమిటంటే, నవద్వీప క్షేత్రంలో గురుపాదులకు ఒక ఆశ్రమం కట్టించటానికి శైలేశ్వరుడు ప్రయత్నాలు చేస్తున్నాడు. దాని కవసరం అయిన డబ్బు ఎక్కడైనా అప్పుచేసి తేవాలని అతడు నానా తంటాలూ పడుతున్నాడు.

విభ యీ వార్తలన్నీ విని భర్తతో, "ఈ ఆశ్రమస్థాపనా అదీ ఆపే ప్రయత్నం మీరు కాస్త చేయకూడదా? అన్నయ్య అనవసరంగా అప్పులపాలై పోతాడు. కుర్ర వాడు మన కళ్ళముందే బికారై పోతాడు," అన్నది.

"నిజమే! నేనేం చెయ్యగలను," అన్నాడు క్షేత్రమోహనుడు. విభ కళ్ళనీళ్ళతో తల వంచుకున్నది. అది గమనించిన క్షేత్రమోహనుడు, "మనం అటుకేసి పోయి చాలా రోజులైంది. ఒకసారి వెళ్ళివద్దాం," అన్నాడు.

విభ, "పదండి!" అంటూ ఆత్రంగా లేచి నిలబడింది. ఇద్దరూ కార్లో బయలు దేరి పదింటికల్లా శైలేశ్వరుడి ఇల్లు చేరారు. వాళ్లు కారుదిగి రీడింగ్ రూమ్‌ను సమీ పించేసరికి దాని పక్కనున్న గదిలో యిద్దరు గోసాయిస్వాములు హడావిడిగా తమ సామానులు మూటలు కట్టుకుంటున్నారు.

"శైలేశ్వరబాబు ఇంట్లో వున్నాడా?" అని అడిగాడు క్షేత్రమోహనుడు వాళ్ళను.

గోసాయి స్వాము లిద్దరూ ఓ క్షణం ముఖముఖాలు చూసుకుని, "లేరు. వారు మొన్న నవద్వీప క్షేత్రానికి పోయారు," అని చెప్పారు.

"మళ్ళీ రావటం ఎప్పుడు?"

"రేపో ఎల్లుండో!"

"అలాగా! బాబుగారి అబ్బాయి ఇంట్లో వున్నాడా?" అని ప్రశ్నించాడు క్షేత్ర మోహనుడు.

"ఆఁ వున్నాడు, వున్నాడు!" అంటూ గోసాయీలు తమ సామాను సర్దుబాటు పనిలో పడిపోయారు.

విభా, క్షేత్రమోహనుడూ రీడింగ్ రూమ్‌లోకేసి నడిచారు. దాని ద్వారానికి ఎప్పటిలా ఒక పరదా వేలాడుతున్నది. దాన్ని పక్కకు వత్తిగించి విభ లోపలికి చూసింది. ఆ గదిలో అన్ని వస్తువులూ తిరిగి తమ తమ స్థానాల్లో చక్కగా సర్ది వున్నాయి.

"అన్నయ్యా స్వాముల్ని యిక్కణ్ణించి వెళ్ళగొట్టి, గదిని మునుపటిలా చక్కగా అలంకరించినట్టుంది," అన్నది విభ, భర్తతో.

క్షేత్రమోహనుడు ఏదో అనబోయేంతలో, సోమేంద్రుడు రబ్బరు బంతిని ఎగర వేస్తూ అక్కడికి వచ్చాడు. వాడి నెత్తిన పిలకా, మెళ్లో తులసిపూల మాల మటు మాయమైపోయాయి. వాడి వేషం కూడా బ్రహ్మచారి వేషంలా లేదు. ఎర్ర అంచు జరీధోవతి కట్టుకుని, కాళ్ళకు పంప్ షూ వేసుకుని వున్నాడు. వాడు విభని చూస్తూనే పరుగెత్తుకు వచ్చి కావిలించుకుని, "అమ్మ వచ్చింది, అత్తా! వంటింట్లో వుంది, పద!" అంటూ కొంగు పట్టుకుని లాగసాగాడు.

విభ తెల్లబోయింది. "మీఅమ్మ వచ్చిందా, సోమేన్!" అని అడిగాడు క్షేత్ర మోహనుడు.

"నిన్న మధ్యాన్నం వచ్చింది. వంటింట్లోకి వెళదాం రండి, మామయ్యా!" అన్నాడు సోమేంద్రుడు.

ముగ్గురూ వంటింటి దగ్గిరకు వెళ్ళారు. వాళ్లు వచ్చేచప్పుడు విని ఉష చేతులు తుడుచుకుని బయిటికి వచ్చింది. ఆమెను చూస్తూనే విభ కాళ్ళ చెప్పులు విడిచి నమస్కారంచేస్తూ, "చూశావా, వదినా, ఏం జరిగిందో?" అన్నది.

ఉష, విభ చెంపలు చేత్తోతాకి ముద్దుపెట్టుకుంది. తరువాత ఆమెతో "వదినా! పిల్లవాడి ముఖం చూస్తూనే నాకు దుఃఖం ఆగింది కాదు. మెళ్లో వేళ్ళాడే తులసిమాల తెంపేశాను. మంగలిని పిలిపించి పిలక కత్తిరింపించేశాను. కొత్త ధోవతీ, చొక్కా బజార్నుంచి తెప్పించాను. ఇప్పుడు చూడటానికి కాస్త యోగ్యంగా వున్నాడొదినా! కాని, ఇక్కడ యింత గొడవ జరిగిపోతూంటే మీరేం చేశారు?" అన్నది క్షేత్రమోహనుడికేసి చూస్తూ.



"అక్కయ్యగారూ! ఆ సంగతి అంతా నిదానంగా చెబుతాను. మేడమీదికి వెళదాం, తినేందు కేమైనా పెట్టండి. సరే, రీడింగ్‌రూమ్ పక్కగదిలో చిన్న గురుగోసాయిీలు మూటలు కట్టుకుంటూండటం చూశాం. పెద్ద గురుపాదున్నీ, ఆయన భార్యనీ ఏం చేశారు? వాళ్ళిద్దరూ మేడమీద లేరుకదా?" అన్నాడు క్షేత్రమోహనుడు.

ఉష నవ్వుతూ, "గాభరా పడవలసిన అవసరం లేదు. వాళ్ళు నవద్వీపానికి వెళ్ళిపోయారు," అన్నది.

"వాళ్ళు మళ్లీ తిరిగివచ్చే ప్రమాదం లేదు కదా?" అన్నాడు క్షేత్రమోహనుడు.

ఉష చిరునవ్వు నవ్వి, "ఉహూఁ!" అన్నది.

"అక్కగారూ! మీలో ఇంత మంచీ, నేర్పూ ఉన్నదని మేం కలలోకూడా అనుకో లేదెన్నడూ!" అన్నాడు క్షేత్రమోహనుడు ఉత్సాహంగా.

———

# బెంజిమిన్ అండ్ బుల్ డాగ్



ముదిగొండ శివప్రసాద్

అందమైన పూలచెట్లు, బాగా ఎదిగిన కొబ్బరి చెట్లు, అక్కడక్కడ ఎర్రని పసుపు పచ్చని రోజాలూ పూచి గేటువద్ద జూకామల్లే, బిటానీ తీగెలూ పరస్పరం దంపతుల్లా ఓ పందిరిపై కాపురం చేస్తూ చూపరులను ఆకర్షించే ఇల్లే బెంజిమన్‌ది. ''బెంజిమన్‌గారి ఇల్లేది'' అని ఎవరడిగినా సరే ''అదుగో ఆ బిటానీ తీగెల ఇల్లు'' అని ఇట్టే చెప్పేస్తారు. అసలు అడగకుండానే పోల్చుకోవచ్చు కూ డా. ఇంత అందంగా ఆకర్షణీయంగా ఉన్న ఇంట్లోకి కూడా రాయప్పకు ప్రవేశించడం దుర్లభమై పోయింది,

రాయప్ప, గేటుకు తగిలించిఉన్న "కుక్కలున్నాయి జాగ్రత్త" అన్న బోర్డు చూచి భయంగానే లోనికి ప్రవేశించ బోయాడు కాని భయకరంగా అరుస్తూ "భౌ—భౌ" మని కుక్క మీదికి దూకేసరికి మటుకు బోర్లా పడ్డాడు ఒక్కసారిగా—రాయప్ప కింద పడ్డా కుక్క మొరగడం మాత్రం మాన లేదు. అయితే ఆ అరుపులు అర్ధవంతంగా మానవభాషకు మల్లే విన్పించేసరికి రాయప్ప వింతపడి చూచాడు. "ఎవర్ నువ్—ఎందుకొచ్చావ్—కాల్చేస్తాన్—ఫ్రండ్ ఆర్ ఫో" ఈ పద్ధతిలో బుల్లెట్ల లాగా ఒక్కొక్క మాటా దూసుకొని వస్తుంటే జేబులోంచి కళ్ళజోడు తీసి తగిలించుకొని అప్పుడు కాని గుర్తు పట్ట లేక పోయాడు స్పష్టంగా తన మీదికి దూకింది కుక్క కాదు మనిషేనని. "జంతు కోటిలో మానవ లక్షణాలు" అన్న సీరియల్ ఒకటి చాలాకాలం క్రితం రాయప్ప చదివింది జ్ఞాపకానికి వచ్చి, అనుకున్నాడు "నేనెందుకు 'మానవకోటిలో జంతు లక్షణాలు' అన్నమరో పుస్తకం వ్రాయ కూడదూ" అని—

దుమ్ము దులుపుకొని లేచి రాయప్ప పరిశీలించి చూచేసరికి అచ్చం బుల్ డాగ్ లా వున్న వ్యక్తి ఎదురుగా కన్పించాడు. రూపంలోనే కాదు కంఠస్వరంలోకూడా ఎలా అంత అద్భుతమైన భైరవ సామ్యం వచ్చిందో అతనికి, రాయప్పకైతే అర్థం కాలేదు.

"ఎవరునువ్—ఏంపని—గుర్ గుర్ గుర్ మన్నట్లు ధ్వని.

"అయ్యా నాపేరు రాయప్ప, నేను జీవకారుణ్య సంఘంలో సభ్యుణ్ణి"—

"ఛత్—జీవంలేద్, — కారుణ్యం లేద్—పో ముందు—మేమేం చందా లివ్వం"

రాయప్ప నిగ్రహించుకొని అన్నాడు "అయ్యా నేను పైసలుకోసం రాలేదు..."

"అయితే ఇంటి కిరాయ్‌కోసం వచ్చావా? టు-లెట్ బోర్డుపెట్టందే—పై భాగంలో మనుషు లున్నారు—నో వేకెన్సీ—ఫో—ఫో—ఫో—" అచ్చం కుక్కలాగే తరిమేస్తున్నాడు రాయప్పను ఆయన—అయితే రాయప్ప బాగా ఢక్కా ముక్కీలు తిన్నఘటం. ఇలాంటి అవమానాలూ పరాజయాలూ చూచి చలించే రకం కాదు తను వచ్చిన పనేమిటో చూసుకొని మరీ వెళ్ళేనేర్పు, ఓర్పుతో అలవాటు చేసుకున్నాడు—

"క్షమించండి—నేను శ్రీ బెంజిమన్ కోసం వచ్చాను — వారితో కొంచెం మాట్లాడాలి—"

"అరేమాన్—నేనేనయ్యా బెంజిమాన్‌ను—"

"ఓహో — ఈయనే నన్నమాట ఇంటిఓనర్—" అనుకొని రాయప్ప

నమస్కరించి "నన్ను మీ ఫ్రెండ్ వెంకటప్పయ్య పంపితే వచ్చాను" అన్నాడు.

వెంకటప్పయ్య పేరు వినేసరికి మటుకు బెంజిమన్ పెంపుడు కుక్కలా మారిపోయి "ఓహో — రండి రండి లోపలికి" అని ఆహ్వానించాడు. రాయప్ప ఆయన తోకవెంటే నారాయణా అంటూ వెళ్లాడు బెంజిమన్ విచిత్ర తత్వం గూర్చి ఆలోచిస్తూ. నిజంగా ఎంత విచిత్రమైందీ సృష్టి? ఎన్ని స్వభావాలు—ఎన్ని కంఠస్వరాలు? దేవుడనే వాడే కనుక ఒకడుంటే ఆయనను మించిన అందమైన శిల్పి — చిత్రకారుడూ మరింక ఎవరున్నారు? అనుకున్నాడు రాయప్ప—

బెంజిమన్ రాయప్పను కుర్చీలో కూర్చోబెట్టి తానూ ఎదురుగా కూర్చున్నాడు. రాయప్ప అన్నాడు "మీరు ఓ కుక్కను పెంచుతున్నారని విన్నాను "

"ఆఁ—ఆఁ—మా సీజర్—ఇప్పుడే మా ఆవిడతో ఈవెనింగ్ వాక్‌కు వెళ్ళింది —మిస్టర్ రాయప్పా—ఆ కుక్కంటే మాకు ప్రాణం—అది మాకుటుంబంలో ఓ మనిషి కిందేలెక్క—దానికి ఒంట్లో బాగా లేదయ్యా—ఏం చేయాలో తోచక ఒక రిద్దరు డాక్టర్లకు చూపించాను కూడాను. అయినా నయం కాలేదు. ఒక పశువుల డాక్టరైతే అవేవో కుక్క కేకులు నాకిచ్చి ఇవి మీరు తినండి కుక్కకు నయమౌతుంది, అన్నాడు—ఫూల్! ఆయన ఉద్దేశంలో జబ్బు నాకళ్ళకే గాని కుక్కకేమీలేదని! పోనీ మా సీజర్ తన్ను పశువుల డాక్టర్లకు చూపించి నందుకు బెంగ పెట్టుకుందేమోనని మనుషుల డాక్టర్లను కూడా పిలిచి చూపించాను. వాళ్లు చేసిన వైద్యాలు చూస్తే పశువుల డాక్టర్లే నయమని పించింది—నాకు బాగా దిగులు పట్టుకుంది మిస్టర్ రాయప్పా. నిన్న మా వెంకటప్పయ్య వస్తే అతనితో దీన్ని గూర్చి చర్చిస్తే "సరే—ఆలోచిస్తా" నన్నాడు. బహుశా ఆయన ఆలోచన లోపలకి మీరువచ్చి వుంటారు మీరేమిటి పశువుల డాక్టరా, మనుషుల డాక్టరా?

"రెండూను—" అన్నాడు రాయప్ప.

"అఫ్‌కోర్స్—ఇప్పు డందరూ రెండింటినీ ట్రీట్ చేస్తున్నారనుకోండి. ఎక్కువ ఫీజు తీసుకోని చీప్‌గా దొరుకుతాయని పశువుల మందులే మనుషులకిస్తున్నారు చాలామంది అయితే మీది ఏ తరహా వైద్యం."

"నాది పూర్తిగా ప్రకృతి వైద్యం. మందులకు బదులు మట్టీ మంటా నీరూ గాలీ ఆకాశాలతోనే నయం చేస్తాను—"

దానితో బెంజిమన్ భయపడిపోయాడు "అయితే ఇప్పుడు మా కుక్కకు మట్టి వైద్యమా? మంట వైద్యమా?" అని ప్రశ్నించాడు.

"చూడందే చెప్పడం కష్టం—" అన్నాడు రాయప్పా.

''అయ్యా రాయప్పగారూ—మేమా కుక్కను స్వంత బిడ్డలా పెంచుకుంటు న్నాము. ఎంగిలి చేత్తో మా ఆవిడ కాకిని కూడా తోలేది కాదు సీజర్‌కు మాత్రం రోజూ రసగుల్లాలు కళఖండలూ పెట్టి పెంచుతుంది. అట్లాంటిది మీ వ్యవహారం చూస్తే ఈ కుక్కకు రాతబాగాలేదని వాతలు వేసేటట్లుంది—మా కు మట్టి వైద్యమూ వద్దు మంట వైద్యమూ వద్దు పొండి పొండి'' అన్నాడు అయితే రాయప్ప మాత్రం నిరుత్సాహపడలేదు. ''బెంజిమన్ గారూ, మరీఅంత ఉద్రేక పడకండి. నేను కేవలం కుక్క డాక్టర్నే కాదు, జీవకారుణ్య సంఘం సభ్యుణ్ణి.భూత దయ మా మూల సూత్రం. చూడండి అనవసరంగా మనం సమాజంలో చాలా జంతువులను హింసిస్తూ వుంటాము. అవి మాత్రం ప్రాణం గల్గినవి కావా? వాటికి కూడా సుఖదుఃఖానుభూతులు లేవా? కాకుంటే వాటికి నోరులేదంతే చెప్ప డానికి. ఉంటేనా, అవీ సభలుపెట్టి ఎన్ని కల్లో పోటీచేసి అధికారం సంపాదించి ప్రజలపై తమకసి తీర్చుకొనేవి—'' కాబట్టి పర్యవసానంగా, ఇంతకూ నేను చెప్పవచ్చిం దేమిటంటే అని రాయప్ప ఏదో చెప్పబోతూండగానే శ్రీమతి బెంజి మన్ సీజరుతోసహా బటానీ తీగల కింద నుండి లోనికి ప్రవేశించింది. రాయప్ప చూస్తూనే కుక్క జబ్బేమిటో పోల్చు కున్నాడు—

''ధర్మామీటరూ, స్టెతస్కోపూ తెమ్మం టారా లోపలినుంచి''బెంజిమన్ అన్నాడు.

''అక్కర్లేదు — మీ సరంజామా లోపలే ఉంచండి. చూడండి. మీ కుక్క విషయంలో బొత్తిగా శ్రద్ధతీసు కోవడం లేదు. అందుకే అలా చిక్కి పోతున్నది.''

దానితో బెంజమన్‌కు బాగా కోపం వచ్చింది. ''చాలు చాల్లేవయ్యా పెద్దమనిషీ. నేనూ నాభార్య కేవలం ఈ కుక్క కోసమే బతుకు తున్నామంటే నువ్వు నమ్మతావో నమ్మవో, దీని కోసం ఇంట్లో మేమొక డిస్పెన్సరీనే పెట్టాము. దాని ఆరోగ్యం కోసం మా ఆవిడ నిత్యమూ మందులు తీసుకుంటూవుంటుంది. ప్రతిరోజూ దానికి పరిశుద్ధమైన సినీతారలు వాడే సబ్బుతో స్నానం చేయించి పౌడర్‌చల్లి కారులో షికారుకు తీసుకెళ్ళి తిప్పుతూ ఉంటుంది. మా సీజర్ అణాకానీ ఎల్. డి. సీ. యు. డి. సీలు తినే తిండితినదు—మం త్రులూ, రాజకీయ నాయకులూ తినే భోజనం తప్ప మామూలు పెర్‌ప్రైజ్ షాప్‌లోని బియ్యమూ గోధుమలూ వండి పెడితే తినడం సంగతలావుంచి కనీసం వాసనకూడా చూడదు. దానికి బాగా వినో దమూ విశ్రాంతి కలిగించాలనే ఉద్దేశం తోనే కేవలం తెలుగు సినిమాలు మాత్రమే




చూపిస్తూ ఉంటాము వెంట వెంట. అంత శ్రద్ధగా దాన్ని చూచుకుంటూ దాని కోసం ప్రత్యేకంగా ఓ రేడియో కొని క్రికెట్ రన్నింగ్ కామెంటరీలు వినిపిస్తూ హిస్ మాస్టర్ వాయిస్ రికార్డు సంగీతంలో ముంచి తేలుస్తూ శ్రోతలు కోరిన పాటల నుండి ఫేమిలీ ప్లానింగు ప్రోగ్రాముల వరకూ దాని చెవులో నూరిపోస్తూ విద్యా బుద్ధులు నేర్పిస్తుంటే ఇంకా మీరు శ్రద్ధగా చూడటం లేదంటారేమిటీ తెలివి తక్కువగా'' అన్నాడు గుడ్లు విచిత్రంగా మిటకరించి కార్టూన్ పిక్చర్‌లోని పాత్రలాగా.

''అదే దీని కొంప తీసింది'' అన్నాడు రాయప్ప దిగులుగా.

"అంటే "ప్రశ్నార్థకంగా చూచాడు బెంజిమన్.

''బెంజిమన్‌గారూ మీ కెన్నేళ్ళు?''

''సుమారు అరవై .''

''మీ ఆవిడకు ''

''నీకేమన్నా మతిపోయిందిటయ్యా. ఆడవాళ్ళ వయస్సు చెపుతారా ఎక్కడైనా—''

''బెంజిమన్‌గారూ—మీరు ఆడవాళ్ళు కాదుగా—నేను మిమ్మల్ని అడుగుతున్నాను ఆవిడగూర్చి—''

'గుర్ గుర్ గుర్' మని 'ఉంటాయి ఓ యాభయ్యో—యాభై అయిదో' అన్నాడు బెంజిమన్.

''మంచిది; మీ కెందరు పిల్లలు?''

బెంజిమన్ నవ్వి ''ఇద్దరే ఇద్దరు. ఓ అమ్మాయి, ఓ అబ్బాయి—మేమేం సమాజానికి అన్యాయం చేశామనుకుంటున్నారా ఎక్కువ మందినికని—ఈ ఫామిలీ ప్లానింగ్ ప్రచారాలు రాక ముందు నుంచి కూడా మా దంతా గాంధీయన్ వే—(Gandhian way)''

''చాలా సంతోషం నేను కోరేదికూడా అదే. కానీ ఇద్దరు పిల్లలు పుట్టాక గాని మీకు గాంధీయన్ వేలూ, ఇందిరా గాంధీయన్ లాలూ వర్తించడం లేదు—మరి ఆత్మవత్ సర్వభూతాని అని చెప్పారు పెద్దలు. మొక్కలకూ ప్రాణముందనీ ఆహార నిద్రాభయ మైధునాదులలోనూ సంకల్ప వికల్పాలలోనూ సర్వవిధ ప్రతీకార చర్యలలోనూ వృక్షాలు కూడా మానవులతో సమానమేనని ప్రపంచానికి చాటాడు మహామహుడు జగదీశచంద్రుడు. అలాంటిది చెట్టూకాదు చేమకాదు సాక్షాత్తు భైరవమూర్తి అవతారం, అందులోనూ మీ రొక ప్రిన్స్‌ను పెంచినట్లు పెంచుతున్నారు కదా అలాంటప్పుడు మీ సీజర్ కొక కల్పర్ణియాను చూడవలసిన బాధ్యత మీపై లేదా? అన్నాడు రాయిప్ప.

''వాడ్డూయూమిన్ బై దట్? (అంటే మీ ఉద్దేశమేమిటి?)'' అని నొసలు చిట్లించాడు బెంజిమన్ ఎడమచేత్తో బట్ట నెత్తిని రుద్దుకుంటూ.

''మీ కుక్కది మామూలు రోగం కాదు—కావ్యాల్లో ప్రబంధ నాయకులకు వస్తుందే అలాంటి ప్రణయ జ్వరం వచ్చింది. అందులోనూ మీరు తెలుగు సినిమాలు చూపి, మీరు కోరిన పాటలు'' విన్పిస్తున్నారాయె—యింక చెప్పేదేముంది—ఇవన్నీ ఉద్దీపన విభావాలు దానికి. నేడు మన సినిమాలు చూచీ, కో-ఎడ్యుకేషన్ కాలేజీల్లో చదివీ, మనుషులే పిచ్చి కుక్కల్లా మారుతున్నారుకదా, అలాంటిది, దానమ్మ కడుపు బంగారంగానూ మీరెంత ప్రిన్స్‌లాపెంచినా, జన్మతః పశుప్రవృత్తి కలది—దానికి విరహజ్వరం రావడంలో ఆశ్చర్యమేమీ లేదు—కాకుంటే మీరు గుర్తించక పోవడమే ఆశ్చర్యం'' అని రాయప్ప సారాంశం తేల్చే సరికి బెంజిమన్ నిర్ఘాంత పోయి ఆలోచనలో పడ్డాడు. ''సరే జరిగిన దానికి విచారించి లాభంలేదు. ఇప్పుడైనా మించిపోయింది లేదు.— మీ ఇంటికొక మంచి ప్రిన్సెస్‌ను కోడలిగా తెచ్చుకోండి. శుభం కల్గుతుంది'' అని రాయప్ప కర్తవ్య బోధచేసి బెంజిమన్ భ్రాంతిమండి తేరుకోకముందే జీవకారుణ్య సంఘంలో సభ్యుణ్ణిగా చేర్చి చందా కాగితంపై

ముందు "కమిట్" చేయించి స్వామి కార్యమూ స్వకార్యము కూడా చూచుకొని సంతోషంగా బయట పడ్డాడు.

రాయప్పయితే నవ్వుతూ వెళ్ళిపోయాడు కాని బెంజిమన్‌కు మాత్రం ఓ సమస్య తీవ్రంగా తయారైంది. వెంటనే శ్రీమతిని పిల్చి చెప్పాడు రాయప్ప చెప్పిన రహస్యం. శ్రీమతి పొన్నమ్మా బెంజిమన్ కూడా నిర్ఘాంత పోయింది—"మనమస లావిషయం ఆలోచించనే లేదు" అని మాత్రం అంది మెల్లగా—మొత్తానికి దంపతులు రాత్రింబవళ్లు ఆలోచించి మరో మంచి కుక్కను కొనడమో, కిరాయి తేవడమో చేయాలని నిశ్చయించుకున్నారు. నిశ్చయించు కోవడ మేమిటి అమలు పెట్టడమేమిటి అంతా ఇక గంటలమీద జరిగిపోవాలని పట్టు బట్టాడు బెంజిమన్. కాని శ్రీమతి పొన్నమ్మ మాత్రం అంత త్వరగా వప్పుకోలేదు. కోడలుపిల్ల నలుపైతే కులమంతా నలుపని సామెత చెపుతారు. కాస్త మంచీ చెడూ చూచి మరీ ఆలోచిద్దాం" అన్నది. దానితో బెంజిమన్‌కు కోపం వచ్చి గుర్ గుర్ మన్నాడు "ఆలోచిస్తుందిట. ఇంకా ఆలోచన—ఈనాటి పిల్లల్లాగే రాబోయే అమ్మాయి ఎం. ఏ చదివీ డాన్సు చేస్తూ క్లబ్బుల కెళ్ళి ఉపన్యాసాలిచ్చి కథలు రాసి పత్రికల్లో పోటీలు గెలుచుకోవాలనే షరతులు పెట్టినట్లు నా సీజరు కూడా ఏమన్నా షరతులు పెడుతుందనుకున్నావా ఏమిటి? నీ వాలకం చూస్తుంటే ఎవరన్నా కట్నం డబ్బుతోబాటు కుక్కనుకూడా ఇచ్చిపోతే బాగుండునని కూడా ఆలోచిస్తున్నట్లున్నావే—చాలు చాల్లే పో ఇంక—రంగు రుచీ వాసనా ఆటా పాటా అన్నీ టెస్ట్ చేయడానికి ఇదేం సినిమాలో హీరోయిన్ వేషం వెయ్య బోవడం లేదు. లేదా సర్కస్‌లో ఫీట్సు చేయబోవడం లేదు. నీతో చెప్పడ మెందుకు—ఇంక నేనే తరువాతి కార్యక్రమం చూస్తాను—" అని చెప్పి బెంజిమన్ ఆరోజే ఆ బుల్ డాగ్‌కు మరో చక్కని జోడుని కొని తెచ్చాడు.

సీజర్ తనకు జోడీ దొరికినప్పటినుంచీ తిరిగి బలం పుంజుకోవడం మొదలు పెట్టింది. చాలా హుషారుగా వెన్నెలలో డ్యూయిట్లు పాడుతూ తిరగడం మొదలు పెట్టింది. మళ్ళీ ఓ రోజు రాయిప్ప వచ్చేసరికి బుల్‌డాగ్‌కానీ దాని ఓనర్‌కానీ ఎవ్వరూ మీద పడలేదు; సరికదా కొత్త మనిషి లోపలకిపోతున్నాడన్న విషయం కూడా పట్టించుకోలేదు సీజర్ కొబ్బరిచెట్టు పక్కన పచ్చని గడ్డిలో పడుకోని. రెండు మూడుసార్లు గట్టిగా పిలిస్తేనేకాని బెంజిమన్ బయటకు రాలేదు—

"ఓహో రాయప్పగారా—రండి—రండి—మా కుక్కకు గొలుసుల్లేవు. కొంచెం జాగ్రత్త—

"ఫరవాలేదు లెండి మీ సీజర్ ఇప్పుడు వేరే లోకాలలో విహరిస్తున్నది—ఎలా వున్నారు కులాసాయేనా?"

"ఆఁ—ఆఁ—బాగానే వున్నాము, కాని మీరు చెప్పినట్లు మా సీజర్ ఇప్పుడు చాలా ఆరోగ్యంగా వుందండీ. అందుకు మీకు ధన్యవాదాలు."

"అబ్బే దీనికి పెద్దగా ధన్యవాదాలు చెప్పనక్కరలేదు. నా బాధ్యత నేను నెర వేర్చాను. మీరు ఇస్తామన్న జీవకారుణ్య సంఘ విరాళం ఇస్తే చాలు కృతజ్ఞుణ్ణి. అందుకే వచ్చాను."

"అలాగే—అలాగే." అని బెంజిమన్ లోపలికి వెళ్లాడు—కాని ఓ పదినిమిషాల వరకూ బయటకు రాలేదు, ఇంతలో లోపలనుంచి పెద్దగా అరుచు కుంటున్నట్లు మాటలు వినవచ్చాయి. ఓ అయిదు నిమిషాల తర్వాత బెంజిమన్ బయటకు వచ్చాడు. ఆయన ముఖం బాగా అలసి పోయినట్లు కన్పడుతువ్నది. నుదు రంతా చెమట పట్టివుంది. జేబులోంచి డబ్బులు తీసి రాయప్ప కిచ్చి ఏమీమాట్లాడ కుండా ఓకుర్చీలో కూలబడ్డాడు బెంజిమన్. ఆయన సీరియస్‌నెస్ చూచి మరొకడైతే మాట్లాడకుండా పోయేవాడే కాని రాయప్ప మాత్రం వదలిపెట్టలేదు. బెంజిమన్ గారూ—మీ శ్రీమతిగారు ఈ చందాడబ్బు లివ్వడానికేమైనా అభ్యంతర పెట్టారా?" అని స్పష్టంగానే అడిగాడు.

"నో—నో—అలాంటి దేమీలేదు" అని బెంజిమన్ పైకి అన్నాడు కాని ఏదో దాస్తున్నాడని మాత్రం రాయప్ప గ్రహిం చాడు.

"మీకో మీ శ్రీమతికో ఒంట్లో బాగు న్నట్లు లేదు—" అన్నాడు రాయప్ప మళ్ళీ.

బెంజిమన్ ఓ నిమిషం రాయప్ప వైపుచూచి చెప్పాలా? వద్దా? అని ఆలో చించినట్లు కన్పించి చివరకు అన్నాడు "నిజమే రాయప్పగారూ—మా ఇరు వురికీ ఒంట్లో బాగోలేదు"

"అవును — ఇప్పు డందరికీ ఫ్లూ జ్వరాలు వస్తూవున్నాయి కృష్ణకు కొత్త సీళ్ళు వచ్చాయి కదా"

"అబ్బే అదేమీ లేదండీ, మానసి కంగా మాత్రమే మాకు బాగాలేదు. ఎందుకో ఈ మధ్య అకారణంగా మే మిద్దరమూ తరచు దెబ్బలాడు కొంటు న్నాము. దెబ్బలాట ముగిసిన తరువాత ఒంటరి నేను ఆలోచించి చూస్తే ఏమీ వుండదు వడ్లగింజలో బియ్యపుగింజ. దెబ్బలాట ఎవరు మొదలు పెట్టారన్నది కూడా అర్థం కావడం లేదు — పోనీ, మొదలైతే రెండోవాళ్లు ఎందుకు రెచ్చి పోతున్నా రనేది కూడా బోధపడటం లేదు—"

రాయప్ప ఓ చిరునవ్వు నవ్వాడు. "ఫరవాలేదు—ఈ ఫామిలీ ప్రాబ్లమ్స్




మీకేమిటి ఈ బెజవాడలో అందరిళ్లల్లోనూ వున్నవే—కాకుంటే కొందరు మీలాగా బయటకు చెపుతారు. మిగతా వారు గుంభనగా దాచుకుంటారు. ఇంటిగుట్టు లంకకు చేటని—అంతే! పోనీ మీకేదైనా మందు ఇమ్మంటారా?''

''దయచేసి మీరు మనుషుల మందు మాత్రం ఇవ్వండి-'' అన్నాడు బెంజిమన్ నవ్వుతూ—

''అలాగే-మీ భార్యాభర్తలిద్దరూ ఓ నెల రోజులు ఎక్కడికన్నా పిల్‌గ్రిమేజ్ వెళ్ళిరండి — వాతావరణం మనస్సును బాగు పరుస్తుంది—వెంట మీ పిల్లల్ని కాని కుక్కల్ని కాని ఏమీ తీసుకొని పోకండి.''

''బాగుంది మీ వైద్యం—నా కసలే ఈ ఇల్లు వదిలిపెడితే ఉండ బుద్ధిపుట్టదు. ఆవిడకూ అంతే! ఇంటిమీద మమకారం ఎంత ఎక్కువైందంటే ఇక్కడి ప్రతి వస్తువూ ఆవిడచేతితో అలా ప్రతిక్షణమూ తాకితేతప్ప సంతృప్తి చెందడం లేదు. పెద్దవాళ్ళమై పోతున్నామని ఇటీవల ఆవిడకు దిగులొకటి కట్టుకున్నట్లుంది. రాత్రిళ్ళు అలా ఒంటరిగా కిటికీలోంచి దూరంగావున్న గాంధీ పర్వతాన్ని చూస్తూ కాలం గడుపుతూ ఉంటుంది. ఏమిటో?

ముసలితనమంటే ఇంతే రాయప్ప గారూ.

రాయప్ప నవ్వి ''చూడండి ఇద్దరు పిల్లలున్నారు—చక్కని ఇల్లు, శుభ్రంగా నెల తిరిగేసరికి టంచనుగావచ్చే ఇంటి అద్దె, బ్యాంకు బాలన్సు. మీరే ఇలా దిగులుపడితే ఇంక లోకంలో ఎవడు సుఖంగా వుండగలడు—'' అని ఓ

కాగితంమీద ఏదో వ్రాసి ఓ కవరులోపెట్టి అంటించివేసి "బెంజిమన్‌గారూ — ఈ కవరు భద్రంగా దాచండి. నేను వెళ్ళిన తర్వాత దాన్ని చించి చదవండి. ఇందులో ప్రిస్క్రిప్షన్ వ్రాసి ఉంచాను. మరి నేను శలవు తీసుకుంటాను" అని వెళ్ళిన దిక్కునే చూస్తూ కూర్చున్నాడు చాలా సేపు. తర్వాత వెళ్ళి కవరును డ్రాయిర్లో పడేశాడు. ఒకటి రెండు రోజులైన తర్వాత దాని మాట మరిచే పోయాడు!

ఇలా వుండగా ఒకనాడు వెన్నెల బాగా వచ్చింది. శ్రీమతి పొన్నమ్మ రుసరుస లాడుతూ బెంజిమన్‌కు భోజనం పెడ్డించింది. గుర్ గుర్ మన్నాడు ఆమె ప్రవర్తనకు. చూస్తూండగానే మాటా మాటా అనుకున్నారు. బెంజిమన్ తినకుండా చెయ్యి కడుక్కొని లేచి ప్లేటు మొత్తమూ సీజరుకు పడేశాడు. సీజరూ దాని జోడీ వెన్నెలలో ఉల్లాసంగా తోక లాడించు కుంటూ ఖరీదైన ఆ పదార్థాలన్నీ తిన్నాయి. ఇది చూచే సరికి పొన్నమ్మకు మండుకొచ్చింది—భర్త అన్నం తిననందుకు తిట్టింది బెంజిమన్ కూడా రెచ్చిపోయి "నువ్వొండిన వంట కుక్క తప్ప ముట్టదు" అన్నాడు. "అయితే ఇన్నాళ్ళనుంచీ ఇన్నేళ్ళనుంచీ నా చేతి వంట తినే మీరేమవుతారు?" అన్నది పొన్నమ్మ ఉద్రేకంలో నోరు జారి—దానితో బెంజిమన్ స్వాధీనాన్ని కోల్పోయి పొన్నమ్మపై చెయ్యి చేసుకున్నాడు .దూరంనుంచి ఈ దృశ్యం చూచిన సీజర్ పిచ్చిపట్టినట్లు ఎగిరింది— ఆ రోజురాత్రి బెంజిమనూ, పొన్నమ్మలు ఎప్పుడు నిద్రపోయారో వారికి కూడా తెలియదు—

మర్నాడు ఉదయం నిద్రలేచి బెంజిమన్ మెట్లు దిగి వచ్చేసరికి ఓ భయంకర దృశ్యం కన్పడింది. సీజర్ పక్కనేవున్న కుక్క చచ్చి పడివుంది. సీజర్‌కు పిచ్చి పట్టిందని బెంజిమన్ గ్రహించాడు. గబగబా మేడ మెట్లెక్కి గదిలోకిపోయి టేబిల్ ముందు కూర్చున్నాడు— శ్రీమతి పొన్నమ్మ మాత్రం గది తలుపులు తీసుకొని బయటకు రాలేదు. అసలు సీజర్ ఎందుకని ఆ కుక్కను చంపింది? ఇంత అకస్మాత్తుగా దాని కెందుకు పిచ్చి పట్టింది?? బెంజిమన్‌కు తల తిరిగిపోయినట్లనిపించింది. ఏమీ తోచని అయోమయ స్థితిలో— రాయప్ప గుర్తు కొచ్చాడు. గబగబా డ్రాయరు సొరుగులో నుంచి రాయప్ప వ్రాసిన కవరు చింపి చదివాడు. "మీరు కాని మీ భార్యకాని ఆవేశంలో కుక్కలకు మాత్రం అపకారం చేయకండి. వాటిని ఎక్కడైనా వదిలేసిరండి—ఇలా వ్రాసినందుకు క్షమించండి—మీ రాయప్ప" అని వ్రాసిన వాక్యాలు చదివి నిర్ఘాంత పోయాడు బెంజిమన్.

———


వాక్స్వాతంత్ర్యం చిరకాలం వర్ధిల్లుగాక!
ఏమ్! అక్కడికెక్కి అరవడానికి నీకు లైసెన్సు ఉందిటయ్యా?


లేదు - ఏం? నా యిష్టం!




శాంతి భద్రతలు చిరకాలం వర్ధిల్లుగాక!!

ఫిబ్రవరినెల

# భావపరిచయపోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వాఖ్య (Caption) కావాలి.

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి.

వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులోపంపినవి అంగీకరించబడవు.

మాకు చేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమాన మివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు జనవరి 5 వ తేదీలోగా చేరాలి. యువ పాఠకులందరూ, ఈ పోటీలో పాల్గొనవచ్చును. ప్రవేశరుసుములేదు.

# అమాయకురాలు

కె.కె. రావు



"అయితే నీ స్నేహితురాలి పెళ్ళికి ఉండకుండా వెళతావురా, నాయనా!" అన్నది భ్రమరతల్లి వెంకటేశ్వర్లుతో.

"ఎట్లాగు పిన్నీ? మా క్లాసువాళ్ళంతా బయలుదేరుతున్నారు. రేపే కాలేజీ తెరుస్తారాయెను. వారం ఆలస్యంగా వెళితే పాఠాలు పోవూ?" అన్నాడు వెంకటేశ్వర్లు

"వారానికే ఏం పోతయ్యేం మహా?" అన్నది భ్రమర తల్లి. వెంకటేశ్వర్లు ఏవేవో అభ్యంతరాలు చెప్పాడు. కాలేజీ చదువంటే స్కూలు చదువు కాదన్నాడు. రెండు వారాలకొక పుస్తకం చొప్పున అయిపోతుం దన్నాడు.

భ్రమర పెళ్ళికి ఉండిపోవటం అతనికి అసలు ఇష్టంలేదు. దాన్ని తనకు కాకుండా మరొకరికిచ్చి ఎందుకు చేస్తు

న్నారూ? అతను ఒకటి రెండు కథలలో చదివాడు, చిన్నతనంనించీ సావాసంగా ఉండి పెళ్ళిచేసుకున్న వాళ్ళనుగురించి. తనూ భ్రమరా.పెళ్ళాడితే చక్కగా కథలో జరిగినట్టుంటుందనే అభిప్రాయం అతనిలో అయిదారు మాసాలనించీ—భ్రమర పెళ్ళిప్రయత్నాలు ప్రారంభ మయినప్పటినించీ—బలంగా ఉంటున్నది. (జీవితం కథల్లో మోస్తరుగాఉంటే బాగుంటుందనే అభిప్రాయం ఇంకా పాతది వెంకటేశ్వర్లుకు.)

కాని తనకూ, భ్రమరకూ పెళ్ళికాదని కూడా వెంకటేశ్వర్లుకు స్పష్టమయిపోయింది. వారికీ తమకూ శాఖ ఒకటి కాదు. బ్రాహ్మలే, ఎదురిళ్ళ వాళ్ళే కాని వివాహం జరగటం అసంభవం.

వెంకటేశ్వర్లు ఆముక్కతో మనస్సును సమాధాన పరుచుకోలేదు, అతనికి కోపం వచ్చింది, తనజీవితంకన్న శాఖావిచక్షణ ఎక్కువనిపించలేదు అతనికి. కాని ఎవరి మీద కోపగించాలో అతనికి తెలియలేదు, అందుచేత అతనికిమరింత కోపంవచ్చింది. ఆ కోపం అతనిమనస్సులో పేరు కుంటూ ఉండింది అది ఇప్పుడు భ్రమర తల్లి మీదికి తిరిగింది.

"పెళ్ళికి ఏమని ఉండమంటుందో ఈవిడ?" అనుకున్నాడతను

అతను బయటికి వస్తుండగా భ్రమర పరుగెత్తుకుంటూవచ్చి అతని చేతులు పట్టుకుని నిలవేసి నవ్వుమొహంతో "ఇవాళ ప్రయాణం మానుకున్నావా, వెంకటేశ్వర్లూ?" అన్నది.

"దేనికి?" అన్నాడు వెంకటేశ్వర్లు మొహం చిట్లిస్తూ.

"మా అమ్మ నిన్ను ఉండమనలా?"

"దేనికి?"

"నా పెళ్ళికి," అన్నది భ్రమర చిన్న గొంతుతో.

"నే నుండను" అన్నాడు వెంకటేశ్వర్లు కఠినంగా, తన కోపానికి కారణం భ్రమరే కాని భ్రమరతల్లి కాదని నిర్ధారణ చేసుకుంటూ.

"ఉండు వెంకటేశ్వర్లూ - సరదాగా!" అన్నది భ్రమర లాలనగా.

'ఏమని ఉండమంటుందో—ఇంత పనిచేసి!' అనుకున్నాడు వెంకటేశ్వర్లు కుములుతూ.

"నీకు కోపంవచ్చిందా?" అన్నది భ్రమర, తనవల్ల ఏదో తప్పు జరిగినట్టుగా.

"నాకెందు కేం కోపం?"

"మరెందుకూ అట్లాఉన్నావు?"

"నాకేం కోపంలేదు. నా కెందుకూ కోపం?" అని గొణుక్కుంటూ వెంకటేశ్వర్లు వెళ్ళిపోయినాడు.

తనకు కోపంవచ్చిందని భ్రమరకు తెలియటం అతనికి తృప్తికరమయింది. భ్రమర తనకు కోపం వచ్చినందుకు కుమిలి కుమిలి చావాలి! అప్పుడు తనకు హాయిగా ఉంటుంది.




వెంకటేశ్వర్లుకు పదిహేడేళ్ళు వచ్చినై. అతనికి భ్రమరమీద ప్రత్యేకించి అభిమానం కూడా లేకపోలేదు. కాని ఆ భావాన్ని ప్రేమ అనటం అతిశయోక్తి అవుతుంది. కాంక్షించక పూర్వం ప్రేమించటం ఎవరితరమూ కాదు. వెంకటేశ్వర్లుకు ఇప్పుడిప్పుడే కాంక్ష అనేది కలుగుతున్నది. అదికూడా అతని మనస్సులో స్ఫుటమైన ఆకారం పొందలేదు. అంతేకాక వెంకటేశ్వర్లు అభిప్రాయంలో కాంక్షకు అతీతమైనదే ప్రేమ. ఆ రెంటికీ తెగని బంధం ఉందని అతనింకా గుర్తించలేదు. భ్రమరను కామించిగాదు అతడు పెళ్లాడగోరింది—తన భార్యగా చేసుకుని గౌరవంగా చూడడానికి.

*                    *

భ్రమర అంతకంటెకూడా పాపం. అన్యాయమైన స్థితిలో ఉంది. ఆ పిల్లకు వెంకటేశ్వర్లంటే ప్రాణమే కాని అభిమానం ఎంత గాఢంగా ఉందో ఆమెకే తెలియదు తన పెళ్ళి బాగా జరగటానికీ జరగక పోవడానికీ ఉన్నతేడా వెంకటేశ్వర్లు పెళ్ళికి ఉండటమూ ఉండక పోవటమూ మాత్రమే ననుకున్నది. కాలక్రమాన తను అత్తవారింటికి వెళ్ళటమూ, అక్కడ కాపరం చెయ్యటమూ ఉంటుందని ఆమెకు తెలుసు కాని అది తనకు అయిష్టమైన పని అవుతుందని ఆమె భావించలేదు తను మరొకరి భార్య అయే కంటే వెంకటేశ్వర్లు భార్య అయితే బాగుంటుందని ఆమెకు తట్టలేదు అన్యోన్యతకూ దాంపత్యానికి ఏమైనా సంబంధం ఉంటుందని—ఉండాలని — ఆమె ఎరగదు. ఆమె పది సంవత్సరాల జీవితంలోనూ అన్యోన్య దాంపత్యం ఆమె ఎన్నడూ చూడలేదు.

వెంకటేశ్వర్లు తన పెళ్ళికి ఉండ ననటం భ్రమరకు చాలా ఖేదం కలిగిం

చింది. కాని అతనికి కోపంరావటం మరీ దుర్భరమయింది. వెంకటేశ్వర్లుకు తను చాలాసార్లు అదివరలో కోపం తెప్పించింది. కాని ఈసారి అతని కోపం రావటంలో ఏదో విశేషం ఉంది. పూర్వం మాదిరిగా కాకుండా ఈసారి తన తప్పేదో తనకు తెలియలేదు. తన పెళ్ళి వెంకటేశ్వర్లు కిష్టంలేదు. లేకపోతే పెళ్ళి కెందుకుండడూ? ఆ మాట నిర్ధారణ చేసుకున్న తరవాత భ్రమరకు తన పెళ్ళి అంటే ఒకవిధమైన అసహ్యం పుట్టుకొచ్చింది. అనేక సంవత్సరాలపాటు వెంటేశ్వర్లు అనుమతినీ, ఆమోదాన్నీ పాటించిన భ్రమర ఇప్పుడు అలవాటు మార్చుకుని అతని కిష్టంలేని పెళ్ళి ఎట్లా చేసుకుంటుంది? కాని ఇప్పుడు వ్యవహారం ఆమె చేతుల్లో లేదు. కొంచెం ముందుగా అయితే "నాకీ పెళ్ళి వద్దు నాన్నా!" అంటే కూతురిమాట వినిపించుకునేవాడే భ్రమర తండ్రి.

* *

వెంకటేశ్వర్లు తండ్రి దీనికి సరిగా విరుద్ధం. బుద్ధి తెలిసినప్పటినించీ వెంకటేశ్వర్లుకు తండ్రితో మాట్లాడటానికే హడలు, ఆయన తన పిల్లల యిష్టాయిష్టాలు కనుక్కునే రకంకాదు—పొరపాటున తనకు తెలిస్తే వాటికి విరుద్ధంగా ప్రవర్తించే రకం. అట్లా ప్రవర్తించటం పిల్లలకు చాలా మంచిదని ఆయన అభిప్రాయం!

అందుచేత వెంకటేశ్వర్లు తండ్రిదగ్గిరికి పోయి "నేను భ్రమరను పెళ్ళి చేసుకుంటాను నాన్నా!" అని అనలేకపోయాడు. ఎంతో చనువున్న తల్లితోనే అతను ఆమాటఅనటానికి విశ్వప్రయత్నం చేవలసి వచ్చింది. "నోరుమూసుకో, ఎవరన్నా వింటే నవ్విపోతారు!" అన్నది తల్లి వెంటేశ్వర్లుతో.

వెంకటేశ్వర్లు భ్రమరపెళ్ళికి ఉండకుండా వెళ్ళిపోయినాడు.

* *

భ్రమరపెళ్ళి చిన్నతనపు స్నేహానికి విశేషం అంతరాయం కలిగించలేదు. కాని వెంకటేశ్వర్లు భ్రమరను పూర్తిగా క్షమించలేదు. క్షమించేటట్టు కూడా కనిపించలేదు. తమరిద్దరూ పెళ్ళిచేసుకుని ఉండవలసిందనీ, అది ధర్మమనీ, మంచి కథలన్నిటిలోనూ అట్లాగే జరుగుతుందనీ వెంకటేశ్వర్లు చెప్పిన మీదట భ్రమరకు అతనిమాట నిజమేననిపించింది.

"ఎంత పొరపాటు జరిగిందీ!" అన్నది భ్రమర, ఈడుకు మించిన ఆలోచనాశక్తి ప్రకటించటానికి ప్రయత్నం చేస్తూ.

"పొరపాటు నీదే." అన్నాడు వెంకటేశ్వర్లు. "నువు నన్నే చేసుకుంటానంటే మీ నాన్న ఒప్పుకునేవాడే!"

"నా కెట్లా తెలుస్తుంది, వెంకటేశ్వర్లూ! తెలిస్తే మా నాన్నను అడిగేదాన్నేగా!"




"తెలియకపోవటం తప్పుకాదూ"

"పోనీ, నీకు తెలుసుగా, నువు మీ నాన్న నెందుకడగలేదూ?"

"మా నాన్నా, మీ నాన్నా ఒకటేనా ఏమిటి? మా నాన్న చంపేస్తాడు!"

"ఎందుకూ? తప్పేముందీ? అన్నది భ్రమర ఆశ్చర్యంతో.

వెంకటేశ్వర్లుకు ఏం చెప్పాలో తోచక కోపంవచ్చి వెళ్ళిపోయినాడు. భ్రమరకు కూడా కోపంవచ్చింది వెంటేశ్వర్లుమీద. అతనికి తనమీద ఈ అర్థంలేని కోప మెందుకూ? తన పెళ్ళినాటినించీ వెంకటేశ్వర్లు ఇదే వరస!

* *

భ్రమర రజస్వల అయి అయిదారు మాసాలయింది. బి. ఏ. రెండోయేడు చదువుతున్న వెంకటేశ్వర్లు ఇంటికి వచ్చాడు, డిసెంబరు శలవులకు. తీరా తమరిద్దరి సావాసానికి అంతం వచ్చేసరికి అతనికి ఆ సావాసం యొక్క అవసరం అపరిమితమయింది. ఇప్పుడిప్పుడు భ్రమర కంటపడితే అతనికి మతిపోతున్నది. కన్ను చెదిరిపోయేటట్టు తయారయింది భ్రమర. అదీగాక వెంకటేశ్వర్లు జరిగిన రెండు మూడు సంవత్సరాలలోనూ ఒకటి రెండు విషయాలు తెలుసుకున్నాడు.

ఈ భ్రమర—ఈ మెరుపుతునక—తనతో ఆడుకుని తనని కొండంత చేసి చూసిన భ్రమరేకాని, కాదు! ఈమెను పెళ్ళాడలేక పోయినందుకు తను పశ్చాత్తాప పడ్డమాట నిజమేకాని ఇప్పుడు కలుగుతున్న పశ్చాత్తాపాన్ని అది ఎక్కడా పోలదు. ఇప్పటి పశ్చాత్తాపంలో నరక కూపాల తాలూకు తపనవుంది.

లోకానికి కట్టుబడి భ్రమర తనను తప్పించుకు తిరుగుతున్నది. కాని తనతో

వెనకటి మోస్తరుగా సావాసం చెయ్యా లనే ఉంది భ్రమరకు. ఈనాడు పెద్దమనిషి అయినంత మాత్రంచేత ఆమె తన దీర్ఘ స్నేహాన్ని మరిచిపోతుందా? అందుకు పశ్చాత్తాప పడుతుందా?

భ్రమర తనతో మాట్లాడితే, తనను మాట్టుకోనిస్తే తనమీద ఆమె కింకా ప్రేమ ఉందని తెలిసినా చాలుననుకున్నాడు. నిజా నికి అతని హృదయం పగలవేసి చూస్తే అందులో భ్రమర తనభార్య కాకపోయిందే అనే చింత ఏమీలేదు ఆడదాని ఆవశ్యకత అతనికి అర్ధంకాలేదింకా.

భ్రమరను చూడటానికీ, ఆమెను పలక రించటానికీ వెంకటేశ్వర్లు ఎన్ని పాట్ల యినా పడ్డాడు. కాని ఆ పాట్లు కొంత వరకు ఫలించకపోలేదు—అంతతో అత నికి అసంతృప్తి కలగలేదన్నమాటేకాని. అతనికి భ్రమర ఏకాంతంగా దొరకాలి. అదిమాత్రం అతని చేతకాలేదు. దైవాత్తూ ఒకసారి అటువంటి అవకాశం దొరికేట ప్పటికి వెంకటేశ్వర్లు దాన్ని వినియోగ పరుచుకునేటందుకు సంసిద్ధుడై లేడు.

అతను వాళ్ళ వాకిలి తలుపు తెరిచి లోపలికి అడుగు పెట్టబోతుండగా భ్రమర బయటికి రావటానికి ఆ వాకిలిదాకా వచ్చి అతనికి ఎదురుపడింది. ఆ సమయంలో అక్కడ ఇంకొక రెవరూ లేరు. ఇద్దరూ ఒక్కక్షణం కొయ్యబొమ్మలల్లే నిలబడి పోయారు, ఒకరినొకరు చూస్తూ.

"వెంకటేశ్వర్లూ!" అన్నది భ్రమర చాలా చిన్న గొంతుతో. వెంకటేశ్వర్లు నరాలకు ఎవరో పురిపెట్టుతున్నట్టయింది. అతను మాట్లాడబోయి గుటకవేశాడు. ఇంతలో ఎవరోవచ్చి వారిద్దరిబాధ కడ తేర్చారు

తరవాత కొద్దికాలానికే భ్రమర కాప రానికి వెళ్ళింది.

అటు తరవాత భ్రమర వెంకటేశ్వర్లు మనసులో నుంచి త్వరలోనే మాసి పోయింది. జరిగినదంతా ఒకసారి సింహావ లోకనచేసి చూసుకుని వెంకటేశ్వర్లు నవ్వు కున్నాడు. ఎఫెచ్. ఎం. డెన్ కాటోలు రాసిన ఒక నవలలో ఒక కన్య తనకిష్టం లేని వాణ్ణి పెళ్లాడబోతూ తన కన్యాత్వాన్ని ప్రేమించినవాడికి ధారపోసేస్తుంది. పెళ్లా డిన తరవాత భర్త కాని వాడికి తన శరీ రాన్ని అర్పించటం ఆమె అభిప్రాయంలో నీతికాదు. పెళ్ళయిన తరవాత ప్రియుడి వంక చూడటం అవినీతి అవుతుందని పెళ్లికి ముందే తన ప్రియుడికి తన చాత నయిన సుఖం యిచ్చింది. భ్రమరకూడా అటువంటి నీతి ఏమైనా పాటించివుంటే వెంకటేశ్వర్లు తృప్తిపడేవాడేమో. ఇపుడు భ్రమర పరగతం—ఉచ్ఛిష్టం.

కానీ, మళ్ళీ భ్రమర కంటబడినప్పుడు వెంకటేశ్వర్లు హృదయం తటతట లాడింది. అయినా అందులో విశేషం లేదు. ఆ మాత్రం చక్కనిదాన్ని చూస్తే




ఎవరి గుండె అయినా తటతటలాడ వచ్చును. పైగా గతాన్ని సంపూర్ణంగా మరవటం ఎవరివల్లా కాదు.

కాపరానికి వెళ్ళిన తరవాత భ్రమర ప్రవర్తన మారింది. ఆమె ఇప్పుడు వెంకటేశ్వర్లును చూసి సిగ్గుపడటంలేదు; ఎదురుగావచ్చి స్వేచ్ఛగా మాట్లాడుతుంది. ఒక విధమైన వేదాంతం కూడా నేర్చుకుంది ఏదో సందర్భంలో ఆమె వెంకటేశ్వర్లు తోనే అన్నది.

"మనం కోరేవన్నీ గొంతెమ్మ కోరికలే. మనం అనుకున్నట్టు అక్షరాలా ఏదీ జరగదు. మనకు వచ్చే సుఖాలేవీ రుచించవు. ఎప్పటికైనా మనకు కలిగిన సుఖాలకంటె మనం ఊహించుకునే సుఖాలే బాగుంటై!"

"ఓ యబ్బా!" అనుకున్నాడు వెంకటేశ్వర్లు. ఆ మాటలను అతను సహృదయంతో అర్థంచేసుకోకుండానే.

* *

భ్రమర అయిదోతనం సంవత్సరం పైన నాలుగైదు మాసాలు మాత్రమే దక్కింది. టైఫాయిడు జ్వరంవచ్చి ఆమె భర్త మరణించాడు.

ఈవార్త వినగానే వెంకటేశ్వర్లు చాలా విచిత్రమయిన ఆలోచనా పరంపరలో పడిపోయినాడు. భ్రమర భర్తను అతను చూడనేలేదు. పరిస్థితులు అట్లా ఒనగూడినై. తనకూ, భ్రమరకూ మధ్య అడ్డంగా ఉండిన ఈ ఛాయ కాస్తా తొలిగి పోయింది. ఇక కావాలంటే భ్రమర తనదే!

న్యాయంగా ఈ ఆలోచన రాగానే వెంకటేశ్వర్లు మనసు పొంగి ఉండవలసింది. కాని అట్లా జరగలేదు. అతనికి భయంవేసింది. ఈ భావాన్ని అతను విమర్శించుకోలేదు. విమర్శించటం అతనికిష్టంలేదు.

కారణమేమంటే, భ్రమరను తిరిగి పెళ్లాడవలిసిన బాధ్యత నైతికంగా తన మీద ఉందని అతని అంతరాత్మ చెబుతున్నది. వితంతువును — కొంతకాలం కాపరంచేసిన వితంతువును పెళ్లాడటానికి అతని అంతర్బుద్ధి ఏమాత్రమూ సమ్మతించటంలేదు. తనకూ భ్రమరకూ మధ్య ఉండిన ఛాయ కాస్తా పోయినందుకు అతని కా ఛాయమీద చాలా కోపంగా ఉంది.

కాని తనకు భ్రమరమీద అంత దృఢమైన ప్రేమ లేదని గాని, ఆమెను పెళ్లాడటం తన కిష్టంలేదని గాని ప్రాణం పోయినా వెంకటేశ్వర్లు ఒప్పుకునేటందుకు సంసిద్ధుడై లేడు. అతని అంతస్సుమాత్రం వలలో చిక్కిన పక్షిమాదిరిగా ఇందులోనించి బయటపడే మార్గం ఏదైనా ఉందా అని దిక్కులు చూస్తూనే ఉంది. వెంకటేశ్వర్లు అడకత్తెరలో పక్క మాదిరిగా ఉన్నాడు.

* *

ఈ పరిస్థితినించి వెంకటేశ్వర్లుని భ్రమరే రక్షించింది. ఆమె తల్లి దండ్రుల మాటా, దగ్గిరబంధువుల మాటా వినిపించుకోకుండా కేశఖండనం చేయించుకుంది పదోనాడు.

వెంకటేశ్వర్లు అంతరాత్మ ఒక దీర్ఘనిశ్వాసం వదిలింది అతను తృప్తిగా ఒక నిట్టూర్పు విడిచి ఊరుకుంటే ఏమైఉండేదో! కాని వెంకటేశ్వర్లు అక్కడ ఆగలేదు ఎక్కడ ఆగాలో తెలిసినవాళ్లు బహుకొద్దిమంది. అందులో . వెంకటేశ్వర్లుమాత్రం ఒకడు కాడు.

అతను భ్రమరను పెళ్ళిచేసుకోవద్దు అని తీర్మానించుకోలేదు కనక పెళ్ళి చేసుకోవటానికి తీర్మానించుకున్నట్టే భావించుకుని భ్రమరమీద మండిపడ్డాడు. ఆమె ఇటువంటి సాహసం ఎందుకు చేయాలి? ఆమెకిక ప్రపంచంలో ఎవరూ లేరా? భర్తను అంతగా ప్రేమించిందా? పోనీ, తనకేం? . ఈ భ్రమరకోసం తను ఎంత బాధపడ్డాడూ? తనకోసమైనా ఆమె పూనవాకారం త్యజించకుండా ఉండవచ్చునే! ఎంతమోసం చేసిందీ! తలుచుకుంటే అతనిగుండె పగిలిపోయింది,

* *

భ్రమర పుట్టింటనే ఉంటున్నది. ఆమెకు జీవితం దుర్భరంగా ఉంటున్నది. రోజు గడవదు. ఎక్కడికీ వెళ్లేటందుకు లేదు. ఎవరూ వచ్చి కూర్చుని మాట్లాడనైనా మాట్లాడరు పాపం. అక్కడికీ వెంకటేశ్వర్లు తల్లి రోజూవచ్చి కాస్సేపు కూర్చుంటూ ఉంటుంది.

"ఎన్నడూ వెంకటేశ్వర్లువచ్చి చూడదేం పిన్నీ? నాకున్నవాళ్ళే మీరు. నా దుర్గతికి తగినట్టు మీరుకూడా వదిలేస్తే నేనేమవుతాను? వెంకటేశ్వర్లును

రమ్మను. నాకు చూడాలని ఉంది.'' అన్నది భ్రమర వెంకటేశ్వర్లుతో.

''ఏమోనే అమ్మా! చిన్నదానివాయెను. ఈ రాతకూడా పట్టెను. సిగ్గు పడతా వేమోనని వాడు రాలేదు. చెబుతాలే!''

''సిగ్గూ, నాపిండమూనూ! ఇంకా ఈ జన్మకి సిగ్గేమిటి? వెంకటేశ్వర్లును తప్పక రమ్మను పిన్నీ!''

''ఏంరా, అబ్బాయి, పాపం, భ్రమర నిన్ను చూడాలని కలవరిస్తున్నదిరా పోయి చూడరాదూ? నాతో వందసార్లు చెప్పింది' అన్నది వెంకటేశ్వర్లుతో తల్లి.

వెంకటేశ్వర్లు కప్పు కన్న ఎత్తుగా ఎగిరిపడ్డాడు.

''చాలా మంచిపని చేసింది! ఇప్పుడా అవతారం నేనుకూడా చూడలేదని దిగులా? నాకు చూపించటానికే గుండు చేయించు కుందేమో కనుక్కోరా!''

కొడుకు ఆగ్రహం తల్లికి అర్థం కాలేదు. కాని ఆవిడ అతనిమాటలు మాత్రం భ్రమరకు చెప్పింది. భ్రమర మాట్లాడలేదు. దీర్ఘాలోచనలో పడ్డది.

*      *

''నేను మళ్ళీ జుట్టు పెంచుకుంటాను నాన్నా!'' అన్నది భ్రమర తండ్రితో.

''అప్పుడంత మొండిపట్టు ఎందుకు పట్టావు తల్లీ! అట్లాగే పెంచుకో అమ్మా! ఇంతలో మనకులం పొయ్యేదేమీలేదులే!''

నలుగురూ చాటుగా నవ్వుసాగారు. మొదట ఆమె యోగ్యతను ఘనంగా చెప్పుకున్న వారందరికీ తలవంపు లయి నట్టయింది. భ్రమర ఇంకేమీ గమనించ లేదు—ఎదుగుతున్న తల వెంట్రుకలు తప్ప.

తను నిజంగా ఎంత అవివేకి! ఎంత తెలివితక్కువది! అదివరకు వెంకటేశ్వర్లు తమ ఇద్దరి బాంధవ్యం గురించి ఎంత స్పష్టంగా తెలియ జెప్పాడు! తను అతని విషయంలో ఎంత కృతఘ్నతతో ప్రవర్తిం చిందీ! నిజానికి వెంకటేశ్వర్లుకు తను తగిన భార్యా? అతను తనలో ఏం చూసి అభిమానిస్తున్నట్టు! అతనికి కోపంరాదా మరి? తను వైధవ్యమైనా సహించగలదు కాని అతని కోపం సహించలేదు ...

*      *

''భ్రమర మళ్ళీ జుట్టు పెంచుకుని చీరెలూ రవికలూ కట్టుకొంటున్నదే, సొంతం నెగ్గించలేని పనులు ప్రారంభిం చకపోతే ఏం?'' అన్నది వెంకటేశ్వర్లుతో తల్లి.

''పెళ్ళి అవుతుందని ఆశపుట్టిం దేమో!'' అన్నాడు వెంకటేశ్వర్లు.

''కొన్నాళ్ళు కాపరం చేసి—''

''ఏమిటమ్మా, బడితెలల్లే ముప్ఫయి యేళ్ళు వచ్చినవాళ్లకు మళ్ళీ కావటంలా?'' అన్నాడతను నిష్కరుణగా.

ఇంతకు తల్లికొడుకుల కిద్దరికీ తెలియ లేదు, భ్రమర ప్రవర్తనకు తమరే కారకు లని!

*　　　　*

వెంకటేశ్వర్లు ఎప్రంటిస్ చెయ్యటం కూడా పూర్తిచేశాడు. కోర్టు తెరవగానే ప్రాక్టీసు కూడా ప్రారంభించనున్నాడు. అతని వివాహం కూడా స్థిరమయింది. ఏటి అవతలనించి వచ్చింది సంబంధం. వాళ్లు కొద్దిగో జమీందార్లు. రెండు మూడు లంకలు గాడా ఉన్నాయి.

వివాహానికి అంతా సిద్ధమయేవరకూ భ్రమరకు వెంకటేశ్వర్లు పెళ్ళిని గురించి తెలియదు ఆ సమయాన ఆమె పినతల్లి గారి ఊరువెళ్లింది.

తండ్రి రాసిన ఉత్తరంలో ఈ వార్త చదవగానే "నేను వెళ్లిపోతాను, పిన్నీ!" అంటూ ప్రారంభించింది భ్రమర. కూతురి ఆదుర్దా పినతల్లికి అర్థంకాలేదు. ఇంకా ఒకనెల రోజులైనా పిల్ల తనదగ్గిర ఉంటుం దనుకుంటున్న దావిడ.

భ్రమర పినతల్లి ప్రార్థన వినిపించు కోకుండా ఇంటికి బైలుదేరింది. బండి ఆగ గానే ఆమె తన ఇంటోకి పోవటానికి బదులు వెంకటేశ్వర్లు గారింటోకి వెళ్లింది. ఆమె పెట్టె తీసుకుని బండివాడు కూడా ఆ ఇంటోకే వచ్చాడు.

వెంకటేశ్వర్లు వరండాలోనే నిలబడి ఉన్నాడు. అతను భ్రమరవంక ఆశ్చర్యంతో చూచాడు. ఆమెను చూసి చాలా ఏళ్ళయింది.

"వెంకటేశ్వర్లూ!" అతనిప్పుడు గుర్తు పట్టి "భ్రమరా!" అన్నాడు మెడమీది దాకా పెరిగిన ఆమె జుట్టూ, కొద్దిగా చిక్కిన శరీరమూ చూస్తే వెంకటేశ్వర్లుకు 'ఉచ్ఛిష్టం' అనే మాట స్ఫురించలేదు. అతని పెదిమలు కొద్దిగా కదిలినై. 'నా భార్య!' అనుకున్నాడతను.

"నీ పెళ్లి అవుతున్నదని విని వచ్చాను వెంకటేశ్వర్లూ! నాకెంతో సంతోషంగా ఉంది. నీ పెళ్ళికి ఉండ టానికి వీలవుతుందో కాదో ఇప్పుడే చూసి పోదామని వచ్చాను."

భ్రమరనవ్వు సంతోషముల్లే కనిపించ లేదు వెంకటేశ్వర్లుకు. ఆమె తూలి అక్కడే పడిపోతుందేమోనని అతనికి ఒకక్షణంలో అనుమానం గూడా కలిగింది కాని ఆమె అతనితో ఇంకేమీ అనకుండా వెనక్కు తిరిగింది.

"మనం ఇక్కడ ఉండటంలేదు. ఆ ఎదుటింటికి వెళ్ళిపోతున్నాం. ఆ పెట్టె తీసుకునిరా" అంటూ భ్రమర గబగబా వెళ్ళిపోయింది దించిన పెట్టెను మళ్ళీ ఎత్తుకుని బండివాడు ఆమె ననుస రించాడు.

విగ్రహం మాదిరిగా వెంకటేశ్వర్లు అట్లాగే నిలబడిఉన్నాడు.

*　　　　*

"నాన్నా, నేను జుట్టు తీయించు కుంటాను. మంగలవాణ్ణి పిలిపించు." అన్నది భ్రమర.

ఆమెతల్లి అందుకుని "చాల్లే, నీకే మైనా మతి చెడుతున్నదా ఏమిటి? అని కసిరింది.

*                *

భ్రమర కళ్ళ యెదటినించి తొలగి పోయినా వెంకటేశ్వర్లు మనసులోనించి తొలగిపోలేదు ఆమె జీవితంలో ఈ మధ్య గడిచిన రెండు మూడేండ్ల కాలాన్నీ భగవంతుడు రబ్బరుతో చెరిపినట్టయింది. భ్రమర చిన్ననాటినించీ ఈనాటివరకూ తనదే ననిపించింది అతనికి. భ్రమర కాకుండా మరొకరిని ప్రేమించటం, మరొకరిని ముట్టుకోటం, ముద్దు పెట్టుకోవటం అసంభవం. తనకు భ్రమరే కావాలి!

వెంకటేశ్వర్లు చకచకా తండ్రిదగ్గరికి వెళ్ళాడు. తండ్రి తనవంక ఆశ్చర్యంతోనూ, అసహ్యంతోనూ చూసి "ఏం?" అనేటప్పటికి అతని గుండె బద్దలయిపోయింది. లాభంలేదు; తన కోరిక ఆయనతో చెప్పటం అసంభవం.

*                *

కనీసం భ్రమరతోనైనా తన అప్రయోజకత్వం చెప్పేస్తే ఆమె ఏదైనా ఉపాయం చెప్పవచ్చునని వెంకటేశ్వర్లు వీధిదాటి భ్రమరఇంట ప్రవేశించాడు. భ్రమర ఎక్కడా కనిపించలేదు. ఆమె తండ్రి ఇంట్లో ఉన్నట్టు లేదు. తల్లి మడికట్టుకుని వంటింటో ఉన్నది.

"పిన్నీ, భ్రమర ఏదీ?"

"ఏమో నాయనా, గదిలోలేదూ? ఊరి నుంచి వచ్చి ఇంకా స్నానమైనా చెయ్య లేదు, చూడూ!"

వెంకటేశ్వర్లు గదిదగ్గరికి వెళ్ళి "భ్రమరా!" అని పిలిచాడు. సమాధానం లేదు. అతను తలుపు నెట్టాడు. దగ్గరిగా వేసి ఉన్న తలుపులు తెరుచుకున్నాయి. లోపల దృశ్యంచూసి వెంకటేశ్వర్లు నిశ్చేష్టుడై నిలబడ్డాడు.

గదినిండా వెంట్రుకలు! వికారమైన తలతో భ్రమర పక్కమీదపడి ఎక్కెక్కి ఏడుస్తున్నది. ఆమె భ్రమర అయి ఉంటుందని వెంకటేశ్వర్లు ఊహించ వలసి వచ్చింది. అతనామెను ఆ రూపంతో గుర్తుపట్టలేదు.

*                *

వెంకటేశ్వర్లు వివాహం వైభవంగానే జరిగింది కాని పెళ్ళికి భ్రమర రాలేదు. ఆ అవతారంతో ఎట్లా వస్తుంది?

భ్రమరను చేసుకోలేక పోయినందుకు వెంకటేశ్వర్లు తన మనస్సును సులభంగానే సమాధాన పరుచుకో గలిగాడు— ఏమంటే భ్రమర జ్ఞాపకం రాగానే అతనికి ఆనాడు చూసిన భ్రమర తలతప్ప వచ్చినా మరొకటి జ్ఞాపకం వచ్చేది కాదు.

———


నిన్నటినుంచీ భోజనంలేదు ఓ రూపాయి ఇస్తావా బాబ్జీ
సారీ! నాకు దానధర్మాలలో విశ్వాసం లేదు-


అప్పుగా అడుగుతున్నా-
వెరీసారీ! నిరుద్యోగులకు అప్పులివ్వడంలో నాకసలే విశ్వాసం లేదు-
మర్యాదగా ఇస్తావా? లేక ఎముకలు విరగదన్ని తీసుకొమ్మంటావా?


ఒద్దొద్దు-నాకు అహింసలో చాలా విశ్వాసం ఉంది!!!
సుచిత్ర



# మీనా

## యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

"ఈ ఇల్లు నాది అవునో కాదో తెలియదు. కానీ ఈ వదిన మాత్రం పూర్తిగా మాదే!" అంది నవ్వుతూ.

రాజేశ్వరి ఒక్కొకసారి వదినా అన్నప్పుడల్లా నా ఆలోచనలు, ఊహలు వేరే వైపు పరిగెడతాయి.

అమ్మ ఆ తర్వాత ఏమనుకుందో ఏమో! మర్నాడు సాయంత్రం సారధి టీ కి వచ్చినప్పుడు, నేనూ—రాజేశ్వరీ వినేట్టే ఎవరైనా మంచి కుర్రాడు వుంటే రాజు కోసం చూడమని చెప్పింది. సారధి, రాజు వుద్దేశంలో ఎలాటి కుర్రాడు కావాలో చెప్పమన్నాడు. అమ్మ ఆ మంచి చెడుల బాధ్యతంతా తనది అంది.

సారధి అమ్మ కోరికమీద ఆ రాత్రి మా ఇంట్లో భోజనం చేశాడు. రాజేశ్వరీ, నేనూ ఇద్దరం కలిసి వడ్డించాం. అమ్మా-సారధి ఇద్దరూ వంటని మెచ్చుకుంటుంటే నా కెందుకో చాలా సంతృప్తిగా, ఆనందంగా అనిపించింది.

ఆ తర్వాత—వారం పది రోజుల్లో-- రాజేశ్వరి అమ్మకి దాదాపు తలలో నాలికలా అయిపోయింది. పల్లెటూరిలో పుట్టి పెరిగినా, బైట ప్రపంచంతో సంబంధం లేకపోయినా, రాజేశ్వరికి ఎలా అలవడిందో కానీ, యెదుటవారి మనసుల్ని కనిపెట్టి నవరించుకోగల నేర్పు బాగా వచ్చింది.

అమ్మ ఏవేవిఎదుటవారిలో వుండాలని కోరుకుంటుందో అవన్నీ రాజేశ్వరిలో కన్పించసాగినాయి. అమ్మకి యెప్పుడూ యెవరూ యెదురు చెప్పకూడదు. రాజేశ్వరికి అసలు ఆ అలవాటే లేదు. పని బాగా చేయగలగడం, పెద్దలయెడ వినయం, ప్రవర్తనలో సౌమ్యత యీ గుణాలు అమ్మని బాగా ఆకట్టుకున్నాయి.

అమ్మలో ఒక సుగుణం వుంది. ఆవిడకి అభిమానం వచ్చినా, ఆగ్రహం వచ్చినా అది ఎదుట వారిమీద వాన జల్లులా కురిపించేస్తుంది. మనసులోవున్న అభిప్రాయం దాచుకొనటం ఆవిడకి ఎందులోనూ సాధ్యంకాదు. రాజేశ్వరి విషయంలో, ఆ అదృష్టం నాదో, దానికో తెలియదుగానీ, అమ్మకి రాజేశ్వరి అంటే విపరీతమైన అభిమానాలు ఏర్పడినాయి.

అందుమూలంగా సహజంగా దాన్ని బాగా చూడటం ప్రారంభించింది.

అప్పుడప్పుడూ వెంట క్లబ్బుకీ వాటికీ తీసుకెళ్లేది. మిసెస్ లింగం వాళ్ళు ఎవరీ అమ్మాయి అని అడిగితే నవ్వుతూ, 'నా పెంపుడు కూతురు' అని జవాబు ఇచ్చేది. రాజేశ్వరికి నలుగురిలోకి వెళ్ళినప్పుడు ఎలా ప్రవర్తించాలో నేర్పేది. సూక్ష్మగ్రాహి అయిన రాజేశ్వరికి ఏ విషయం రెండోసారి చెప్పనవసరం లేకపోయేది.

అమ్మ బైటికి వెళ్ళేటప్పుడు వెంట యెందుకు తీసుకు వెళ్తుందో తర్వాత తర్వాతగానీ నా కర్థంగాలేదు. రాజేశ్వరి ఎప్పుడూ నాతో ఇంట్లో వుంటే సారధికి, నాకూ ఏకాంతం కుదరదని ఆవిడ అభిప్రాయం.

రాజేశ్వరి కూడా మేం ఇద్దరం వున్నపుడు తను అక్కడ వుండాలంటే ప్రాణం మీదకి వచ్చినట్లుగా చూసేది. వీలయినంత వరకూ అమ్మతో వెళ్ళిపోవటానికే తహతహ లాడేది.

కానీ సాధారణంగా, రాజేశ్వరి మా మధ్య లేక పోయినా, సారధికి నాకు తరచుగా రాజేశ్వరిని గురించే మాటలుజరిగేవి. అతని మాటల ధోరణి బట్టి రాజేశ్వరి పరిస్థితులు అంటే చాలా సానుభూతి ఏర్పడినట్టు, కేవలం అదృష్ట బలంవల్లనే ఇలా నా అండ దొరికినట్టు మాట్లాడేవాడు.

నాన్నగారు మొదట మొదట రాజేశ్వరి యిక్కడ వుండటానికి ఇష్టపడకుండా, చిరాకుపడినా, తర్వాత తర్వాత రాజేశ్వరి, అమ్మ కలిసి తిరగటం చూసి కుతూహలంగా గమనించసాగారు. అమ్మ చివరికి ఇంటి జమా ఖర్చుల సంగతి కూడా రాజేశ్వరి చేతికి వదిలేసింది. తాయారమ్మకి మాత్రం రాజుని చూస్తే చాలా కష్టంగా, యీర్ష్యగా వున్నట్టు తోచేది నాకు. ఆవిడకి ఒంట్లో రోగంగా వున్న సమయాల్లో జోక్యం కల్పించుకోబోతే అమ్మ వంటపని మాత్రమే చూడమని, మిగతా వన్నీ రాజుకి వదిలేయమని చెప్పింది. ఈ మాట వినగానే ఆవిడ ముఖం కాలిన మసిగుడ్డలా అవడం నేనూ గ్రహించాను.

నేను వచ్చిన రెండు మూడు రోజులకే నిమ్మలూరు కృష్ణకి వుత్తరం వ్రాశాను. రాజుని అతను కోరినట్టు మధూ వాళ్ళింటికి పంపకుండా, సరాసరి నాతో మా ఇంటికి తీసుకు వచ్చానని తెలియచేస్తూ, అందుకు



# ఆశా
# సౌందర్య సాధనలు






క్రొత్త ఫార్ములాతో చేయబడిన ఆశా ఫేస్ పౌడరు మీ ముఖ వర్చస్సుయొక్క సహజ సౌందర్యమునకు మెరుగులు దిద్దుతుంది. మీ ముఖము గంటల కొలది అందముగా ఉంటుంది. నేచరల్, రేచెల్, పింక్ మరియు తెలుపు, నాలుగు దివ్యమైన ఛాయలలో లభిస్తున్న వాటినుండి మీ వర్చస్సుకు సరిపోయే దానిని ఎంచుకోండి.

మీ ముఖము తాజాగా, మృదువుగా మరియు అందముగా ఉండుటకు ఆశా వ్యానిషింగ్ క్రీమును వాడండి. మీరు సహజ సౌందర్యముతో [illegible] పౌడరును అద్దుకొనే ముందు రాసుకొను [illegible] దివ్యముగా ఉంటుంది.

ఆశా కాటుక మీ చక్కని కండ్లకు [illegible] విశ్రాంతిని యిస్తుంది.

మీ అలంకరణను ఆశా కుంకుమతో పూర్తి చేయండి. ఇది ద్రవరూపములో లేక ముద్దగా, మూడు వివిధ రంగులలో లభిస్తోంది.

అతనికి ఆగ్రహం వస్తే, యిష్టం వచ్చిన శిక్ష విధించమని, ఆనందంగా స్వీకరిస్తా నని కూడా వ్రాశాను.

నా వుత్తరం అతనికి అందిందో లేదో తెలియదు కానీ, అతని నుంచి నాకు ఎలాటి సమాధానం రాలేదు.

మా యింట్లో అమ్మకి రాజేశ్వరి మీద రోజు రోజుకి అభివృద్ధి చెందుతున్న ప్రేమాభిమానాలు చూస్తుంటే నాకు చాలా తమాషాగా, చూడ సొంపుగా కనిపించ సాగింది. రాజేశ్వరి ఫలానా అని తెలిసి నప్పుడు ఆవిడ ముఖంలో కన్పించబోయే చిత్ర విచిత్రమైన రంగులు ఎప్పుడెప్పుడు చూస్తానా అని నా మనసు ఉవ్విళ్ళూరు తోంది. రాజేశ్వరి విషయం యిప్పుడిప్పుడే బైటపెట్టాలని నేననుకోవటం లేదు. అమ్మ మాటలంటే చేసే మనిషి! రాజే శ్వరికి తనే పెళ్ళి చేస్తానని వాళ్ళతో వీళ్ళతో తరచుగా అంటోంది. ఆవిడ అన్నట్టే ఆ పెళ్ళేదో ఖాయమై, మా యింట్లో పెళ్ళి జరుగుతుంటే—ఆ వివాహానికి నిమ్మ లూరు నుంచి కృష్ణ—అత్తయ్య కూడా వస్తే! అప్పుడు నేను అనుకున్న పని పూర్తి అవుతుంది. ఈ వివాహం అమ్మ జరిపిస్తే మా అమ్మ సహృదయత కృష్ణకి కూడా అర్థమౌతుంది. అమ్మని కృష్ణ, కృష్ణని అమ్మ ఇద్దరూ ఒకరిని ఒకరు అర్థం చేసుకునే అవకాశం యీ సంఘ టనతో వచ్చి తీరాలి.

మొదట మొదట్లో రాజు బిడియపడి నట్టు, ముడుచుకు పోయినట్టు ప్రవర్తిం చినా తర్వాత, రాను, రాను, అమ్మ చూపి స్తున్న వాత్సల్యంవల్ల ఆ జంకు వదల గొట్టుకుని మామూలు రాజేశ్వరి అయి పోయింది.

అమ్మతో అతి సన్నిహితంగా ప్రవర్తిస్తున్న రాజుని చూస్తుంటే నాకు, అమ్మ నాలో చూడలేనిదేదో దానిలో సంపూ ర్ణంగా చూస్తున్నట్టు, అది ఆవిడకి బాగా తృప్తి కలిగిస్తున్నట్టు అనిపించేది నాకు

రాజుకి కూడా అమ్మ వ్యక్తిత్వంలో చెప్పలేనంత గురి ఏర్పడింది.

ఒకసారి మేం ఇద్దరం ఏకాంతంగా ఉన్నప్పుడు, "వదినా! అత్తయ్యలాటి వాళ్ళు నూటికీ కోటికీ ఒకరు కూడా వుండ రేమో! అలాటి అమ్మని కలిగివున్న నువ్వెంత అదృష్టవంతురాలివి!" అంది.

అమ్మాయిగారి పని అయిపోయింది! బుట్టలో పడిపోతోంది అనుకున్నాను.

అమ్మ మాటల్లో, చేష్టల్లో, ఆవిడ ఆకర్షణలోవున్న విశేషం యిదే! ఎలాటి స్వభావం కలవాళ్ళనైనా యిట్టే ఆకట్టు కుంటుంది! ఈ ఆకర్షణలోవున్న చిత్రం నాకు తెలుసు ఆవిడలోవున్న అతిమంచి భాగం మాత్రమే బైటికి కన్పరుస్తుంది.

ఈవిడ మనసంతా యింతేనేమో ననే భ్రమకలిగిస్తుంది. పైకి నవ్వుతూ, మృదు భాషిణిగా, సంస్కారవంతురాలిలా

# ఇదిగో ఒక నిరపాయమైన తలనొప్పి బిళ్ల!



# అవేదన్®

ఆశ్చర్యకరమైన ఎపెప్‌గలది
(ఎన్-అసిటిల్-పి-అమినోఫెనాల్)



తలనొప్పి బిళ్లను వేసుకొనుటకు భయపడి మీరు ఎన్ని సార్లు తలనొప్పిని ఎక్కువ సేపు అనుభవించేరు?

అవేదన్ మీ తలనొప్పికి నిరపాయమైనది. ఎందుకంటె, దానిలో ఆశ్చర్యకరమైన ఎపెప్ ఉంది. అవేదన్‌తో చికాకైన చెడు ఫలితములు కలుగవు. దానితో ఉపశమనము కలుగుతుంది—త్వరగా మరియు నిశ్చయముగా.

కనుక తలనొప్పిని పోగొట్టుకోండి—నిరపాయముగా. జలుబు. ఫ్లూ. యితర నొప్పులు కూడ దీనితో పోతాయి. ఎపెప్‌గల అవేదన్‌ను వాడండి.

**2 బిళ్లలు: 15 పైసలు.**

ఆశ్చర్యకరమైన ఎపెప్‌గల అవేదన్ తలనొప్పి. జలుబు ఫ్లూలకు నిరపాయమైన, నిశ్చయమైన ఉపశమనమును కలిగిస్తుంది.






**SQUIBB SARABHAI CHEMICALS**

® ఇ.ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు చిహ్నము. దీని లైసెన్సుదారు ఉపయోగదారులు కరంచంద్ ప్రేమ్‌చంద్ ప్రైవేట్ లిమిటెడ్.

Shilpi HPMA 37A/70 TEL

కల్పించే యీ విధలో అతికచ్చితంగా తన యిష్టాయిష్టాలు అమలు పరచుకో గల నియంత వుందని, నాకూ, మా నాన్న గారికీ తప్ప యింకెవరికీ తెలియదేమో!

రాజేశ్వరి ఫలానా అని తెలిసిన క్షణంలో అమ్మ—నన్నూ ఆ రాజేశ్వరినీ కలిపి తిట్టే తిట్లు నేను సులభంగానే వూహించుకో గలను.

అందుకే రాజు ఎవరో తెలియకుండా, రాజుమీద ఆవిడకి విపరీతమైన ప్రేమాభి మానాలు కలగచేసేలా చేసి, ఆవిడ నోటికి ముందే బంధం వేయబోతున్నాను. నేను ఫలానా అని తెలిసికూడా కృష్ణా అత్తయ్య నన్ను గౌరవించారు.

కానీ అమ్మ ఆ పని చేయగలదా. న్యాయానికి అమ్మకి వాళ్ళంటే ఎంత తిరస్కార భావం వుందో, కృష్ణ కి అమ్మంటే అంత రెట్టింపు నిర్లక్ష్యం వుంది. నాకెందుకో తరిచి చూసిన కొద్దీ కృష్ణకి—అమ్మకి స్వభావంలో చాలా విషయాల్లో పోలిక కనిపిస్తోంది. కానీ యిద్దరికీ ఒక తేడాకూడా బాగావుంది. అమ్మకి తను బాగా విచక్షతగా ఆలోచించ గలనని, ఈఅవసరం గురించి బాగా ఎరిగి వున్నాననే అహంకారం ఎక్కువ! ఆ అహంకారంతో సాటి వారిని మూర్ఖులుగా పరిగణించడం ఆవిడకి పరిపాటి అయి పోయింది....

కృష్ణలో అదిలేదు. అందరిలోనూ ఔన్నత్యం చూడటానికి ప్రయత్నిస్తాడు.

ఇదంతా ఆలోచిస్తూ పరధ్యానగా కూర్చున్న నేను భుజంమీద చెయి పడ దంతో వులిక్కిపడ్డాను.

నావెనుకగా రాజేశ్వరి నిలబడివుంది.

అమ్మ—రాజేశ్వరి యిప్పుడే క్లబ్బు నుంచి వచ్చారు.

ఈమధ్య రాజు అమ్మకి దాదాపు నీడలా అయిపోయిందని చెప్పవచ్చు.

"ఒక్కదానివీ అలా కూర్చున్నావేం వదినా!" అంది.

"అప్పు డప్పుడూ యిలా ఒక్క దాన్నే కూర్చోవడం నాకిష్టం!" అన్నాను నవ్వుతూ.

రాజేశ్వరి నా చేతులు పట్టుకుని వూపుతూ అంది,

"ఈరోజు ఏం జరిగిందో తెలుసా?"

నేను క్షణంసేపు దాని ముఖంవైపు పరిశీలనగా చూసాను.

రాజు కిష్టమైందేదో జరిగింది! ఆనం దంతో కళ్లు తళుకు లీనుతున్నాయి!

"ఏదో చాలా అపరూపమైనదే జరి గిందని మాత్రం తెలుస్తోంది"

"గురువారంనాడు క్లబ్‌లో జరిగే ఫంక్షన్‌కి నేను ప్రార్థన పాడే నిర్ణయం జరిగింది. అత్తయ్యా యిప్పుడే కమిటీ మెంబర్స్‌కి నాచేత పాటపాడించి వినిపిం చింది. యికనుంచి క్లబ్బు తరపున ఎక్కడ

ఏ ప్రోగ్రాం జరిగినా నేనే ప్రార్థన పాడ టానికి అందరూ ఏకగ్రీవంగా ఆమో దించారు.''

దాని సంతోషం చూస్తే నాకెంతో ఆనందం అని పించింది

''నిజంగా!'' అన్నాను నమ్మ లేనట్టు నటిస్తూ.

''నిజం! కావాలంటే అత్తయ్యని అడుగు.''

''ఏది అమ్మ?''

''క్రిందవుంది మీ శ్రీవారు వచ్చారు, మాట్లాడుతోంది. వస్తానుండు చీర మార్చుకుని'' అని వెళ్ళింది,

రాజు ఎన్నిసార్లు అనొద్దన్నా సారధిని అలాగే అంటుంది,

రాజు బట్టలు మార్చుకుని వచ్చింది.

తాయారమ్మ అప్పటికే పైకివచ్చి ''అల్లుడుగారు వచ్చారు.'' అనే వార్త నాకు వినిపించి వెళ్ళింది.

నేను విని క్రిందకి రాబోవుతుండగా రాజేశ్వరి అడిగింది,

''అన్నయ్య దగ్గరనుండి వుత్తరం వచ్చిందా వదినా!''

''రాలేదు అదేనేనూ చూస్తున్నాను.'' అన్నాను.

రాజేశ్వరి ముఖం చిన్నబోయింది.

''నామీద కోపం వచ్చిందేమో? వదినా! నే నిక్కడ యింత సంతోషంగా వున్నాను——''

''రాజు! ఆమాట మనస్ఫూర్తిగా అంటున్నావా?''

రాజేశ్వరి విచిత్రంగా అడిగింది.

''అదేమిటి వదినా! మాటి మాటికి అలా అడుగుతావేం! నీకు తెలియటం లేదా? నేను సంతోషంగా లేనా? నా కిక్కడ ఏంలోటు జరుగుతుందని!''

''ఏమో రాజు! నువ్వు ఫలానఅని అమ్మకి నేను చెప్పక పోవటం చూసి—''

''ఓ! అదా!'' రాజు నా దగ్గరకి వచ్చింది. నాచేయి ఆప్యాయంగా తన చేతిలోకి తీసుకుంటూ అంది. ''వదినా! నేను ఫలానా అని అత్తయ్యకి ఎందుకు చెప్పలేక పోయావో నాకర్థం అయింది. అత్తయ్య నే నెవరో తెలిస్తే నన్ను గౌరవించదని, ఆప్యాయతగా చూడదని నీభయం. రెండు మూడు రోజులనుంచి నేనుకూడా యిదే ఆలోచిస్తున్నాను. అత్తయ్యకి ఆ విషయం సమయంచూసి, నేనే చెప్పేస్తాను. నే నెవరో తెలిసినా అత్తయ్య నన్ను అభిమానంగానే చూస్తుం దనే నమ్మకం నాకు కలిగింది.''

''రాజూ!'' నేను నిజంగా నమ్మ లేనట్టే చూసాను. యింత అర్థం చేసుకో గల శక్తి దానికుందని నేను కలలోకూడా అనుకోలేదు, ఆక్షణంలో అది నా ప్రాణ స్నేహితురాలిలా కనిపించింది.

రాజు అంది.

"అత్తయ్య అంటే అన్నయ్యకి ఎందుకు గిట్టదో నాకు అర్థం గావడం లేదు. కారణం ఏమిటో తెలియదు కానీ అన్నయ్య అత్తయ్య విషయంలో మాత్రం పొరబడుతున్నాడనే అని పిస్తోంది."

"రాజూ!' నేను దాని మెడచుట్టు చేతులు వేసి హత్తుకపోయాను. అమాయకంగా, నోట్లోని మాటే రానట్టుండే పల్లెటూరిపిల్ల రాజేశ్వరేనా యీ మాట్లాడేది! నిండుకుండ తొణకదు అంటారు యిదే కాబోలు!

"నువ్వు మళ్ళీ అన్నయ్యకు ఉత్తరం వ్రాయి వదినా! నేను కూడా వ్రాస్తాను, నే నిక్కడ సంతోషంగా, హాయిగా ఏ లోటూ లేకుండా వున్నానని, నా గురించి ఎలాటి ఆలోచనలు పెట్టుకోవద్దని వ్రాస్తాను." అంది.

రాజేశ్వరి, నేను ఆ క్షణంలో ఒకళ్ళని ఒకళ్ళు వదలలేనట్టు అనుభూతిచెందుతూ, చెయ్యీ, చెయ్యి పట్టుకుని కిందికి దిగి వచ్చాం.

క్రింద హాలులో సారధి, అమ్మ, కూర్చుని వున్నారు. అమ్మ మా వైపుకు వీపు పెట్టి కూర్చోవడంతో మా యిద్దరినీ గమనించ లేదు. సారధి మొదట చూసాడు. అతని చూపులు రాజేశ్వరి మీద నిల్చిపోవటం నేను గుర్తించక పోలేదు. అతన్ని చూడగానే రాజేశ్వరి నాచెయ్యి మృదువుగా వదిలించు కుంది.

నేనువచ్చి సారధి పక్కగా వున్న సోఫాలో కూర్చున్నాను.

అమ్మ ఏవో కాగితాలు చూస్తుంది.

రాజేశ్వరి అమ్మ కూర్చున్న సోఫా వెనక్కివెళ్ళి మెల్లగా అడిగింది.

"టీ తీసుకుంటారా యిప్పుడు?"

"ఊఁ!" కాగితాలు చూస్తూనే అంది.

రాజేశ్వరి లోపలికి వెళ్ళిపోయింది.

సారధి వచ్చినప్పుడు సాధారణంగా రాజేశ్వరి మా ఎదుటకివచ్చి, మాతో కలిసి కూర్చోదు. అతడు యిటు కన్పిస్తే అటు తప్పుకని వెళ్ళిపోతుంది. మెరుపులా యిటు కన్పించి అటు మాయమయ్యే రాజేశ్వరి కోసం సారధి కళ్ళు ఆసక్తిగా వెతకటంలో నాకేమంత ఆశ్చర్యమనిపించలేదు.

రాజేశ్వరి విషయంలో ఏం జోక్యం చేసుకోవద్దని ఆ రోజు నీయందు దురుసుగా మాట్లాడానని నాన్నగారికి నా మీద కోపం వచ్చినట్టుంది.

అసలు ఆ విషయమే ఎత్తటం మానేసారు. నాతోకూడా యిదివరకులా ఆప్యాయంగా మాట్లాడటం లేదు, నేను చిన్నతనంలో, మూర్ఖత్వంగా, హఠంతో చేస్తున్నపనిని బలవంతంగా సహిస్తున్న మనిషిలా వున్నారాయన.

రాజేశ్వరి అమ్మ కంటే నాన్నగారి దగ్గర ఎక్కువ చనువు అవుతుందని,

దాన్ని ఆయనెంతో అపురూపంగా చూస్తారని ఆశపడ్డాను నేను. నావూహకి చాలా విరుద్ధంగా, రాజేశ్వరి నాన్నగారి దగ్గర కంటే అమ్మ దగ్గరే ఎక్కువ చనువు స్వతంత్రం సంపాదించుకుంది.

అమ్మ క్లబ్‌లో రాజేశ్వరి పాట పాడేది ఆ రోజునే!

నేను ఆ మాట విన్నప్పటి నుంచీ ఆట పట్టించాను.

"దీన్ని ఎందుకు సెలెక్ట్ చేసారు మమ్మీ! ఒట్టి బెదురుగొడ్డె! అక్కడ ఆ జనం చూడగానే బిరుచుకపడి పోతుం దేమో!"

మమ్మీ నేను ఆటపట్టించానని గ్రహించింది.

నావైపు అభిమానంగా చూస్తూనే మళ్ళీ కసిరి ట్లుగా అంది,

"చాల్లే! నోరు మూసుకో! మనుష్యులకి పిరికితనం నూరిపోయడంలో నువ్వూ—మీ నాన్న అంతటివాళ్ళు యింకెవరూలేరు. రాజేశ్వరి మూర్ఛ వచ్చి పడిపోతుందో, లేక బాగాపాడి అందరూ మెచ్చుకుంటూంటే నీకు మూర్ఛ వస్తుందో నువ్వే చూద్దువు గాని." అంది. ఆ అనటంలో రాజేశ్వరి పట్ల మెచ్చుకోలు, ఆవిడ పనిలో ఆవిడకి విశ్వాసం, ఎంతో ధీమా కన్పించాయి.

రాజేశ్వరి బట్టల విషయంలో అమ్మ చాలా తెలివిగా, జాగ్రత్తగా ప్రవర్తించేది. కాని చాలా అందంగా, ఫ్యాషన్‌గా, అత్యంత అధునాతనమైన డిజైన్లలో చూడగానే చక్కటి రంగుల కలయికతో యివి ఎంత బాగున్నాయి అనిపించేలా వుండాలి. రాజేశ్వరివి ఎప్పుడు సింపుల్‌గా వుండేవి. కానీ నాపక్కన ఆ సింపుల్‌గా వుండటమే రాజేశ్వరికి ఒక ప్రత్యేకత ఆపాదిస్తున్నట్టుగా వుంటటం బహుశా అమ్మ గ్రహించ లేదనుకుంటాను. నాకు రాజేశ్వరిలా ఎప్పుడు, లేతరంగుల్లో నిరాడంబరంగా వుండాలనిపించేది.

రాజు క్లబ్‌లో పాట చాలా బాగా పాడింది. మైక్‌కి దానిగొంతు అంత బాగా సరిపోతుందని నేనుఅనుకోలేదు. ప్రోగ్రాం అయింతర్వాత స్వయంగా సారధికూడా రాజుని అభినంధించాడు.

అతను మెచ్చుకుంటుంటే తన ని కాదన్నట్టు తల దించుకుని వూరుకుంది. నేను భుజంమీద గిల్లాను.

"అదేమిటి? కాంప్లిమెంట్ అంటుంటే మాటలురాని మూగదానిలా చూస్తావేం? థ్యాంక్స్ అను" అన్నాను మందలిస్తున్నట్టు ఆరిందాలా, సారధి నవ్వాడు.

"మనుష్యుల్ని బంగారు పెట్టడంలో మీ స్నేహితురాలి తర్వాత నే ఎవరైనా. సభ్యత—సంస్కారం అంటూ అడుగడుగునా గుర్తు చేసుకుంటే బ్రతుకే మాకు



యువ

పోయింది. కొన్ని కొన్ని మాటలు చిలక పలుకుల్లా వల్లించడం అలవాటు.

ఆ అలవాటు మీకు లేదని నాకు తెలుసు. అది మీ ప్రత్యేకతిగా ఎప్పుడో గుర్తించాను.''

నాకు సారథిని చూస్తే ఆ క్షణంలో అమ్మ దొంగా! అనిపించింది.

రాజేశ్వరిలో ప్రత్యేకతగాయిది గుర్తించాలి! ఈ మాట అమ్మ వింటే బాగుండును! అనిపించింది ఆక్షణంలో!

మర్నాడు సారథి నాకు ఫోన్ చేసాడు. అతను తనంతట ఫోన్ చేసి నాతో మాట్లాడే క్షణాలు చాలా కొద్ది.

రాజేశ్వరి వచ్చి నాకు ఫోన్ వచ్చిందని చెప్పింది.

నేను వెళ్లి మాట్లాడాను. అతనికి ఎవరో బెనిఫిట్ షో టికెట్ అంట కట్టారుట! అతనికి వెళ్ళటానికి టైమ్ లేదుట! నేను—రాజేశ్వరి వెళ్ళాలిట! రాజేశ్వరిని అతను ప్రత్యేకంగా గుర్తుంచుకున్నందుకు ఆనందం అనిపించింది. ఆ సినిమా సంగీత ప్రాధాన్యతగలచిత్రం కాబట్టి రాజేశ్వరిని తప్పకుండా చూడమని సలహా యిచ్చాడు.

యిద్దరం సినిమాకి వెళ్ళాం.

తీరా లోపలకి వెళ్ళబోతూంటే సారథి కారువచ్చి ఆగింది.

నాకంటే అతన్ని ముందుగా రాజేశ్వరే చూసింది.

''అదుగో, మీ శ్రీవారు వచ్చారు.'' అంది.

నేను తిరిగి చూసాను.

అతను అక్కడినుండే మమ్మల్ని విష్ చేసి కారు పార్క్ చేసుకోసాగాడు.

రాజేశ్వరి నా చేయి పట్టుకుంటూ అంది.

''అతను వచ్చాడుగా! నే నెందుకు. నేను వెళ్ళిపోతాను ఇంటికి'' అంది.

సారథి నేను ఒంటరిగా వున్నపుడు రాజేశ్వరి మాతో వుండటానికి ఏమాత్రం ఇష్టపడదు. ముళ్ళమీద వున్నట్టు విలవిలలాడిపోతుంది. ఎంత నచ్చచెప్పినా దాని చెవికి ఎక్కదు.

సారథి మా దగ్గరికి వచ్చాడు.

''వస్తానన్న ఫ్రెండ్ రాలేదు. అందుకని వూరికే వుండటం ఎందుకని నేను కూడా వచ్చాను'' అన్నాడు.

నేను అడక్కుండానే అతను సంజాయిషీ ఇచ్చాడు!

అదికూడా సిన్సియర్‌గాలేదు, గుమ్మడికాయల దొంగ భుజాలు తడుముకున్న ధోరణిలో వుంది.

ఎలా అర్థమౌతాయో తెలియదు కానీ కొన్ని కొన్ని విషయాలు మనకి ఎంత బాగా తెలిసిపోతాయి కదా!

''రాజు ఇంటికి వెళ్ళిపోతానంటోంది.'' అన్నాను ఫిర్యాదు చేస్తున్నట్టుగా. సరిగ్గా నేను వూహించిన భావాలే అతని ముఖంలో కదులాడాయి.

"అయ్యయ్యో, మీరు వెళ్ళిపోవటం ఏమిటి? మీనా మీకు చెప్పలేదా? ఇది సంగీత ప్రాధాన్యత కల చిత్రం! రండి. లోపలకి వెళదాం." అన్నాడు థియేటర్ లోకి దోవ తీస్తూ.

బెనిఫిట్ షో కావటంవల్ల జనం కిక్కిరిసినట్టున్నారు.

ముగ్గురం ఒకే వరసలో కూర్చున్నాం.

సారధి ఆ చిత్రానికి దర్శకత్వం వహించిన ఆయన ప్రాముఖ్యత గురించి మాకు వినిపిస్తున్నాడు.

సారధి మాటకారి అని తెలుసు! కానీ నా ముందు అతను యిలా ఫ్రీగా మాట్లాడడం యిదే ప్రథమం.

పిక్చర్ మొదలైంది. నిజంగానే మ్యూజిక్ చాలా బాగుంది. నా ముందు వరసలో కూర్చున్న ఆయన చాలా పొడుగ్గా వుండటంతో నేను తల పక్కకు తిప్పి ఆయన భుజంమీద నుంచి చూడాల్సి వస్తోంది.

సారధి యిది గమనించిట్టున్నాడు.

వెంటనే లేచి తన సీటులో నన్ను కూర్చోమన్నాడు.

# రెండు రుచి అయిన రకాలలో చిక్‌లెట్స్!

రెండు అద్భుత రుచులు :

**పెప్పర్‌మింట్ మరియు టూట్టి-ఫ్రూట్టి**

రెండిటినీ నమలి రెట్టింపు ఆనందాన్ని
పొందండి. చిక్‌లెట్స్ చూయింగ్ గమ్.

**10 పైసలకు 2, 60 పైసలకు 12.**




ఆడమ్స్ వారి శ్రేష్ఠమైన తయారీ

నేను కూర్చున్నాను.

నాకు రాజేశ్వరికి మధ్యలో కూర్చున్న సారథి మధ్య మధ్యలో ఆ పాటలు ప్లే బాక్ పాడిన వాళ్ళ గురించి రాజుకి వివరించ సాగాడు.

నాకు అర్థమైంది. చాలా బాగ పాట పాడగలిగి, ఎంతో నిరాడంబరంగా వుండే రాజు అమ్మకిలాగానే, సారథికి కూడా నచ్చింది.

నాకు యింకోటి కూడా మరీ మరీ అనిపించ సాగింది.

సారథి నాకు కాబోయే భర్త! ప్రతి వాళ్లు అసలు స్వరూపాలు దాచుకుని, నాగరికత పేరుతో యీ సభ్యత సంస్కారాలు ప్రదర్శించటంతో మనిషి అసలు స్వభావం కనిపెట్టడం కష్టం అయిపోతుంది.

సారథి వ్యక్తిత్వాన్ని — అతని స్వభావాల్ని నేనెందుకు పరీక్ష చేసుకోకూడదు! అమ్మ దృష్టిలో సారథి తెలివిగలవాడు కావచ్చు. అతని వ్యక్తిత్వం ఆవిడకి బాగా నచ్చివుండవచ్చు! కానీ నేను? నా కాబోయే భర్త విషయంలో మాత్రం నేను అమ్మ విలువలమీద ఆధారపడదల్చుకోలేదు. ఆ విలువలేవో నేను గుర్తించాలి! అవి నాకు నచ్చాలి!

ఆ ఫిలింషో అయిన తర్వాత, సారథి-నేను వంటరిగా కూర్చున్నప్పుడల్లా తరచుగా రాజుని గురించి మాట్లాడుకునే వాళ్ళం. ఆ ప్రసంగం ఏదో విధంగా కావాలని నేనే ఎత్తేదాన్ని. సారథి కుతూహలంగా వినే వాడు. యదాలాపంగా అడిగినట్టుగా, రాజుని గురించి అడిగేవాడు.



# అదనపు సంపాదన పరుల్లో మీరూ చేరండి ఇప్పుడే!

"మూడే మూడు నెలల్లో 2000 రూపాయలు సంపాదించాను. అవును ఆదాయాలు తరుగుతూ, ధరలు పెరుగుతూవున్న ఈ రోజుల్లో ఇదెంతగానో ఆదుకుంటుంది. నేనొక ఇల్లాలిని. నా తీరిక సమయంలోనే ఇదంతా సంపాదించాను. ఆపని మీరు కూడా చేయవచ్చును."

అని విజయవాడ వాసి శ్రీమతి రామసీత అంటున్నారు. బోలెడంత చొరవ, కొన్నిగంటల తీరిక ఉన్న ఇల్లాలు ఆవిడ. ఏమిటావిడ కిటుకు ? ఆమె "మార్గదర్శి" ఏజంటు.

ఆమెకు నచ్చిన, మనసు మెచ్చిన పనులు అంటే — ఇరుగు పొరుగు వారితో పిచ్చాపాటి, స్నేహితురాండ్రతో మాటామంతీ, కొత్త ఇల్లాండ్రతో దోస్తీ చేస్తూనే ఈ డబ్బు సంపాదించిందామె. నెలనెలా తేలిక వాయిదాలలో డబ్బును చక్కగా ఎలా మదుపు పెట్టవచ్చునో ఆమె వారికి చూపించింది. తెచ్చిన ప్రతి ఖాతాతోనూ ఆమెకు మంచి కమీషన్ వచ్చింది.

మీరూ లాభం పొందండి "మార్గదర్శి" చిట్ ఫండ్ ఏజంటుగా చేరండి. ఇతరులకు డబ్బు విషయంలో మంచి సాయం చేసినట్లూ అవుతుంది. మీ ఆదాయానికి మరికొంత జోడించినట్లూ అవుతుంది. అందువల్లనే ఇది తీరిక సమయాన్ని సంతృప్తిగా, సార్థకంగా వినియోగించే చక్కని వ్యాపకం.

డబ్బుకోసమేనా మీ చింత ? మార్గదర్శి ఉన్నది మీ చెంత !




## మార్గదర్శి

చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

హైదరాబాదు-1 * విజయవాడ-2 * విశాఖపట్నం-1

kiron

రాజేశ్వరిని గురించిన ప్రసంగం వచ్చి నప్పుడల్లా మా మధ్య గంటలు నిముషా లుగా దొర్లిపోయేవి.

నేను అప్పుడప్పుడూ కావాలని రాజుని ఒట్టి మొద్దని, మూర్ఖురాలని అంటూ వుండే దాన్ని. సారథి రాజు విషయంలో నేను పొరపాటు పడ్తున్నట్టుగా భావించి అది తను సరిచేయాలని తాపత్రయ పడేవాడు. రాజు అలాటి మనిషి కాదని, నేనేదో దాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేదన్నట్టు వివరించటానికి చూసేవాడు.

అతన్ని బాగా రెచ్చగొట్టి, ఆవేశం వచ్చేలా తర్కంలోకి దింపి, హఠాత్తుగా మధ్యలో, "పోనీండి. నాలుగు రోజులు తలదాచుకోటానికి నా దగ్గరకి వచ్చిన దాన్ని గురించి మనకి యీ వాదన ఏమిటి?" అంటూ చల్లగా ఆ ప్రసంగంనుండి జారి పోయేదాన్ని

సారథి ముఖం ఎర్రబడేది. గంటు పెట్టుకున్న ముఖంతో వెళ్ళిపోయేవాడు. అతని మాటల్లో, అతని చేష్టల్లో అతని అసలైన వ్యక్తిత్వం పట్టుకోటానికి నేను చేస్తున్న యీ ప్రయత్నం అతనికి తెలిసి నట్టు లేదు.

తెలిసి నట్టయితే బహుశా తప్పకుండా జాగ్రత్త పడి వుండేవాడను కుంటాను.

ఒకసారి మాటల సందర్భంలో, అతనితో రాజేశ్వరికి రేడియోలో పాడా లని చాలా కుతూహలంగా వుందని, కానీ మా అమ్మ ఏమైనా అనుకుటుం దేమోనని భయపడుతోందని అన్నాను. నిజానికి పాపం అదెప్పుడూ అనలేదు! అసలు రేడియోలో పాడాలి అనే వుద్దేశ్యమే లేదు. రాజేశ్వరి యిష్టమేదో మా అమ్మ అణిచి వేస్తోందని అనుకున్నాడు సారథి. దానితో ఒకసారి మేం కూర్చుని వుండగా రాజు రేడియోలో పాడితే బాగుంటుందనే సూచన తనంతట తానే చేసాడు. సూచన చేసి వూరుకోలేదు.

ఒకటి రెండుసార్లు నాకు గుర్తుచేసి, రాజుచేత అప్లికేషన్ పెట్టించాడు. పది రోజుల్లో రాజుకి రేడియోస్టేషన్ నుంచి వాయిస్ టెస్ట్‌కి పిలుపు వచ్చింది.

అమ్మ ఏమనుకుందో ఏమో, తనే స్వయంగా దగ్గరుండి రాజుని రేడియో స్టేషన్‌కి తీసుకెళ్ళింది,

సారథి తన కేదో గొప్ప సహాయం చేసినట్టు రాజు భావిస్తోందని తన కృతజ్ఞ తలు తెలుపమని కోరిందని సారథితో చెప్పాను.

రాజుకి మేం అనుకున్న దానికంటే త్వరగానే రేడియో నుంచిస్టేషన్‌కు ప్రోగ్రాం వచ్చింది. అమ్మ, సారథిలాటి వాళ్లు తలుచుకున్న పని నిముషాలమీద అయేలా చూడగలరు అనటానికి యిది నిదర్శనం.

ఆరోజు రాజు రేడియో స్టేషన్‌లో మొదటిసారిగా పాట పాడుతుంది! అది వుదయం లేచినప్పటినుంచి ఆనందంతో

# ట్విన్ సిటీ గ్యాస్ కం.

(కోసాన్ గ్యాస్ కంపెనీవారి ఏజంట్లు)

62-బి. సర్దార్ పటేల్ రోడ్, సికింద్రాబాదు-3 ఫోన్ : 76600




బ్రాంచీలు :

గుజరాత్ సేవామండల్ బిల్డింగ్,
రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు-3
ఫోన్ : 72304

కింగ్స్వే (రైల్వే బ్రిడ్జి దగ్గర)
ఫోన్ : 76266

4-1-881/7. తిలక్ రోడ్డు
అబిడ్సు, హైదరాబాదు-1
ఫోన్ : 42586

భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్
రామచంద్రాపురం, హైదరాబాదు.

"నోరు మూసుకోవోయ్ మరదలా! పొగడ్తలంటే నాకు చిరాకు అనేసంగతి నీ కింతవరకూ తెలియదులా వుంది." అన్నాను నవ్వుతూ.

"నిజం చెప్పటం పొగడ్త ఎలా అవుతుంది వదినా? నువ్వు రాకపోయి నట్టయితే యిదంతా ఎలా అయేది?" అమాయకంగా అడిగింది.

"జరగాల్సిన వన్నీ ముందే వ్రాసి పెట్టివుంటాయి అని పెద్దలు చెప్పగా వినలేదూ?"

"విన్నాననుకో! కానీ—"

యింతలో తాయారమ్మగారు అమ్మగారు పిలుస్తున్నారు అని అక్కడికి రావటంతో మా సంభాషణ ఆగిపోయింది. రాజూ తాయారమ్మతో వెళ్ళిపోయింది. నేను మళ్లీ ఆలోచనలో పడ్డాను. నేను ఆశించినట్టు నామూలంగా రాజుకి మంచి జరుగుతుందా? అత్తయ్యకి సంతృప్తి తోస్తుందా? ఆ పెళ్ళి నా మూలంగా తప్పిపోవటం రాజేశ్వరి అదృష్టం అని ఆ కుటుంబంలో అందరూ భావించే క్షణం వస్తుంటే కృష్ణ దగ్గరనుంచి వుత్తరమే రాకపోవటం నాకు చాలా విచిత్రంగావుంది.

నాన్నగారు అతనికి ఏమైనా వుత్తరం వ్రాసారో లేదో తెలియదు.

ఏదయినా చెల్లెల్ని యిలా పరాయి చోటుకి పంపి పట్టనట్టు వూరుకోవటం అతని స్వభావానికే విరుద్ధం. ఆ రోజు తోటలో మమ్మల్ని చూసినప్పుడు సుందరి చేసినగొడవ గుర్తుకు వచ్చినప్పుడల్లా నా ఆంతర్యం ముడుచుకు పోతున్నట్టుగానే వుంది. నేను బాధపడ్డా కృష్ణకి అవమానం జరిగినా రాజుకి మంచి జరుగుతోంది అన్న విషయం ఒక్కటే నాకు చాలా హాయిగా, తృప్తిని కలగచేస్తున్నట్టుగా వుంది.

అమ్మకి బాగా జలుబుచేసి కళ్లు, ముక్కు ఏకమైనట్టుగా ఎర్రబడినాయి. ముఖం భారంగా తయారైంది. అందువల్ల నన్ను పిలిచి రాజుకు తోడుగా రేడియో స్టేషన్‌కి వెళ్ళమని చెప్పింది. నేను సరేనన్నాను.

ఇద్దరం తయారై బైలుదేరుతుండగా, సారధి వచ్చాడు. నా కెందుకో ఈ సమయానికి అతను తప్పకుండా వస్తాడని వుదయంనుంచీ అన్పిస్తూనే వుంది సరిగ్గా రానే వచ్చాడు. మమ్మల్ని రేడియో స్టేషన్‌కి తీసుకెళ్ళమని నేనే అడిగాను. అతను వెంటనే ఒప్పుకున్నాడు. మేము బైలుదేరేముందు అమ్మ రాజుని దగ్గరకు పిలిచి ప్రోగ్రాం అయిపోగానే సరాసరి యింటికి వచ్చేయమని చెప్పింది.

రాజేశ్వరి అలాగే అన్నట్టు తల వూపింది. (సశేషం)

Published by A. Thirupathi Rayudu at No. 1, Arcot Road, Madras-26
and Printed by G. Veera Brahmam at his Anuradha Acchagam,
146, T. H. Road, Madras-21.
Controlling Editor: "CHAKRAPANI"

# ఆంధ్రప్రదేశ్ వెల్ ఫేర్ ఫండ్
## 13-వ రాఫిల్ డ్రా

15-11-1970 తేదీ ఉదయం 10-30 గంటలకు, ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌వారి పర్యవేక్షణకింద, హైదరాబాదు నైజామ్ కాలేజి పెవిలియన్‌లో జరిగిన ఆంధ్రప్రదేశ్ వెల్ ఫేర్ ఫండ్ 13-వ రాఫిల్ డ్రా ఫలితాలు.

ఒక మొదటి బహుమతి రు. 2,50,000/- నం. Y. 400760

రెండు రెండవ బహుమతులు ఒక్కొక్కటి రు. 25,000/- నం. Y. 934608 నం, Z 217086

రెండు మూడవ బహుమతులు ఒక్కొక్కటి రు. 5,000/- నం. Y. 57215 నం. Z. 365746

ఎనభై నాల్గవ బహుమతులు ఒక్కొక్కటి రు. 500/-:

'Y' సీరీస్‌లో 40 బహుమతులు, ఈ సంఖ్యలతో అంతమయ్యే అన్ని నంబర్లు 61926, 60803, 97751 మరిన్నీ 18821.

'Z' సీరీస్‌లో 40 బహుమతులు, ఈ సంఖ్యలతో అంతమయ్యే అన్ని నంబర్లు 40834, 40022, 69943 మరిన్నీ 64271.

ఒక వెయ్యి ఐదవ బహుమతులు, ఒక్కొక్కటి రు. 100/-

'Y' సీరీస్‌లో అయిదు వందల బహుమతులు, ఈ సంఖ్యలతో అంతమయ్యే అన్ని నంబర్లు 7879, 1338, 5835, 4647, మరిన్నీ 3382,

'Z' సీరీస్‌లో అయిదు వందల బహుమతులు ఈ సంఖ్యలతో అంతమయ్యే అన్ని నంబర్లు 6356, 8360, 4767, 5452, మరిన్నీ 7907.

డ్రా తేదీనుంచి ఒక నెలలోగా, బహుమతి గెలిచిన టిక్కెట్లను స్టాంపు అంటించిన రశీదుతో సహా దాఖలుచేస్తూ, బహుమతులను క్లెయిమ్ చెయ్యవలెను.

ఒక నెల తరవాత చేసే క్లెయిమ్‌లు గమనించబడవు. బహుమతి గెలిచినవారు, బహుమతి సొమ్ము క్లెయిమ్ చేయుటకుగాను, వారు గెలుపొందిన టిక్కెట్లను ఏ షెడ్యూల్డు బ్యాంకు ద్వారా నయినా కింది చిరునామాకు పంపవచ్చును:

గౌరవ కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్ వెల్ ఫేర్ ఫండ్,
హైదరాబాద్—1. (ఆం. ప్ర.)

ఫలితాల ప్రచురణలో ఎట్టి అచ్చుతప్పులకుగాని ఆంధ్రప్రదేశ్ వెల్ ఫేర్ ఫండ్ జవాబుదారీ లేదు. అధికార పూర్వకమయిన జాబితా మాత్రమే ఖచ్చితమైనది.

థాకూర్ వి. హరిప్రసాద్,
గౌరవ కార్యదర్శి,

గమనిక: 14-వ రాఫిల్ టిక్కెట్లుఅప్పుడే అమ్మబడుతున్నవి. డ్రా తేదీ 15-2-71

Paise H 980

... తప్పక వుండదగినవి!

# జిందా తిలిస్మాత్

దగ్గు,జలుబు,తలనొప్పి
పళ్ళనొప్పులు,దెబిత్రకలరాకు





# ఫయాకి పళ్ళపొడి

శుభ్రతకు,ఆరోగ్యకరమైన దంతములకు

తయారు చేయువారు:-

**కార్ఖాన జిందా తిలిస్మాత్**



హైదరాబాద్, A.P. (INDIA)